


వికృతి సం. చైత్రము

# భారతి

సంపుటము 27 సంచిక 4


## నీవు - నేను


శ్రీ నాదెళ్ల జనార్దనరావు


నీ వెవరో యెఱుంగను; మనీషులు కొందఱుమాత్ర మేదో యే
దో వచియింపబోయెదు కుతూహలులై బహుభంగులందు లో
భావన సల్పి సల్పి, తుది భాషకు లొంగ వటంచు జెప్పి, రా
నీ వను మాటకంటె మును నే నెవరన్న దెఱుంగ నింతకున్.

నీ వెవరో యెఱుంగను; కనీసపు టూహయు జిక్కలేదు; నా
కావల నిల్చి కన్పడు పదార్థము లన్నిట నిన్ను రోసి, నా
భావన కందనట్టి ప్రతిభాయుతు డౌదని యెంతుగాని, ఆ
నీ వెలుగుల్ స్ఫురించుటలు నే నను వస్తువునం దెఱుంగుదున్.

ఈ వెవరో యెఱుంగగ ననేకులు భిన్నపథానువర్తులై
పోవుచు, వేరువేరు తలపు ల్గని, చిక్కుచు, దారితప్పి, యే
తావున నీదు జాడ యని డస్సి, వృథా యని, మిన్నకుండుచో
నీ వను మాట కర్థమది నే నని పల్కిన సాహసంబొకో?

---

# ఖిన్నగాయని

"సాహితీవర్ధన"

౧

ఏవో తీయని క్రొత్త గీతికల వాయింపంగ నూహించి తం
త్రీవిన్యాసము చక్కదిద్దిననుగానీ—మూర్ఛనావేళలం
దేవో పూర్వపథాలలోన బడిపోయెన్ వల్లకీఘోరణుల్
దేవా! ఈ సుకుమారగాయనిని కస్తింబెట్టు నైరాశ్యముల్.

౨

నీ సేవాసమయాన నెల్లరము వీణెల్ తీర్చి పల్కింప, ఏ
వైశిష్ట్యమ్మును లేని నా రచన సంభావించి మందస్మిత
శ్రీసమ్మాన మనుగ్రహింప వను నార్తిన్ గుంది, ఈ మానసం
బాసించున్ బరగాయనీతతి కలభ్యంబైన ప్రత్యగ్రతల్.

౩

నీవే శిల్పుల శిల్పి వౌదువు జగన్నిర్మాణకావ్యక్రియన్
నీవైదగ్ధ్య మనన్యమై స్మృతికి సంధించున్ భవద్దివ్యలీ
లావిస్ఫూర్తి—గ్రహించి యెంచినపు డెల్లన్ మాకు; అట్లే ప్రభూ!
ఈ వీణాక్వణనమ్ము నాది యని యేదే నొక్క గుర్తుండునా?

౪

గాణేయత్వము మీరి చన్నది కదా కాలమ్ము!—సృష్ట్యాదిలో
నీ నిర్మించిన శిల్పజాలము కడున్ నిశ్ఛిద్రసారస్యలీ
లానిస్తంద్రము నిత్యనూతనమునై లావణ్యముల్ పండు దే
వా! నేడున్;—మఱి యేమి వింతగతులం బా నేర్పు సాధింతువో!

౫

నీశిల్పంబున మర్మముల్ తెలుపు తండ్రీ! నిత్యమున్ బ్రహ్మవి
ద్యాసిద్ధాంతము దివ్యమౌనులకు నధ్యాపించు రేవన్, వచ
శ్శ్రీసాహిత్యములో రసావగలు పర్వెత్తంగ, నామ్నాయవీ
ణాసుస్వానసమానమై పలుకు చిందన్ నాదగాంభీర్యముల్.

———

# భాష - అర్థతత్త్వవిజ్ఞానము

## (Language & Semantics.)

శ్రీ గురుభాగవతుల ధర్మారావు

*"The whole universe is only the meaning of words"*

*—Swami Vivekananda on Mimamsa.*

మానవునికి సంబంధించే సాంఘిక, నైతిక విషయములవలె భాషయు చాలా చిక్కులతో నిండిన సమస్య. మనము గ్రహించ వీలులేని కష్టమైన ప్రశ్న లెన్నో భాషలో ఇమిడిఉన్నవి. పదార్థవిజ్ఞాన శాస్త్రములోనేమి, జీవతత్త్వశాస్త్రములోనేమి తూ, చ తప్పకుండ సరియైన సిద్ధాంతములు చేయుట కవకాశము కొంతవరకు కలదు. గణితశాస్త్రరీత్యా ఒక గ్రహణము ఏరోజున, ఎన్నిగంటల ఎన్నినిముషములకు పట్టునో నిర్దుష్టముగా లెక్కించి చెప్పినట్లు, భాషలో—భాషలలో కాదు—ఎట్లు, ఎప్పుడు మార్పులు జరుగును అను విషయములపై స్పష్టీకరించుట దుస్సాధ్యము.

**శబ్దము, అర్థము - భాషయొక్క అంగములు :**

మానవులు తమ మనోభావములను ఒండొరులకు తెలుపుటకై ఏర్పడిన సాధనము భాష. కావున అది ప్రాతీకము (*Symbolical*). భాషయొక్క అంగములు రెండు: ఒకటి—శబ్దము; రెండు—అర్థము. శబ్దానికీ, భౌతికప్రపంచానికీ సన్నిహిత సంబంధం ఉన్నది. కావున ఆప్రపంచం తాలూకు సూత్రాలను, లక్షణాలను అనుసరిస్తుంది. కాని అర్థము మానవుని అగాధమైన ఆత్మలోనికి చొచ్చుకొనిపోయి, ఆశయ, కామ, మోహ, రసపిపాసామయమైన మానవజీవితమునంతయు ప్రతిబింబిస్తుంది. వాక్కునకు గల ఈ అర్థమే మనోవిజ్ఞానశాస్త్రజ్ఞుల (*Psychologists*) పరిశోధనా లక్ష్యము. శబ్దము లేని భాష లేదు. అర్థము, భావము లేని భాష యుండజాలదు. వాగర్థ సంయోగము భాషకు జీవము. శబ్దము అర్థమునందు మార్పుగలుగజేయును. ఇట్లే అర్థముకూడ శబ్దస్వరూపంలో భేదములను జన్మింపజేస్తుంది. వాగ్దేవికి శబ్దార్థము లను ఈ రెండు ముఖము లుండుటవల్ల భాషాతత్త్వశాస్త్రంలో సూత్రీకరించుట కొంతవరకు కష్టము.

**మార్పులకు కారణము- శబ్దముయొక్క ప్రాకృతిక స్వరూపము :**

ఒక పదము క్రమక్రమంగా వాడుక చేయబడక, చివరకు లోపించడం మనం సాధారణంగా అన్ని భాషలలోనూ చూస్తున్నాం. ఇట్లు అది లోపించుటకు కారణం ఒకప్పుడు దాని శాబ్దికస్వరూపమే అయివుంటుంది. దీనికి ఉదాహరణము—

తేనెటీగకు ఉత్తరఫ్రెంచి భాషలో *Apis* అనీ, దక్షిణఫ్రెంచిభాషలో *Apicula* అనీ రెండు పర్యాయపదము లుండెను. కాని కాలక్రమేణ *Apicula* అనే పదము నిలిచి, మొదటిది అదృశ్యమయిపోయినది. దీనికి కారణము. మొదట *Apis* శబ్దములోని రెండు *Syllables* న్నూ (అవిభక్తపదాంశ

ములు) ఒక *Syllable* అగుట. పిదప ఈ *Monosyllabic Word* భాషాస్వభావమునుబట్టి ఉచ్చరింపబడక క్రమంగా హరించిపోవుట. *Apicula* అనే శబ్దం నిలిచి, *Apis* అనే శబ్దం మృగ్యం అగుటకు కారణం ఈపదము యొక్క అర్థములో ఎంతమాత్రం సంబంధించినది కాదు.

ఇట్లే ఒకప్పుడు భిన్నార్థకములైనను, ఉచ్చారణలో కొంత పోలిక గల రెండు శబ్దములు, వాటి సమానధ్వనివలన ప్రజల మనస్సులలో పొరపాటున కవకాశం కలుగ జేసినప్పుడు, ప్రజలు ఒక శబ్దమును త్యజించి రెండవదానినే వాడుకలో నుంచుట సామాన్యంగా భాషల పరిణామంలో కనిపిస్తుంది.

**అర్థముకూడ శబ్దమునందు మార్పునకు కారణము:**

ఇటలీ దేశంలో భాషాపరిశోధకులు ఒక భాషానిరూపక పటం (*Linguistic Map*) తయారుచేసేరు. దీనిలో ఏ ఇటాలియన్ పదములు దేశమంతటా ప్రచారంలో ఉన్నవో, ఏవి స్థానికములో తెలుసుకొనుటకు భోగట్టా దొరుకుతుంది. ఈ *Map* వల్ల ఒక వింత విషయం గోచరిస్తుంది. *Magnus* (పెద్ద) అను పదము ఇటలీదేశమంతటా ఒకే రూపంలోనికి మారింది. కాని *Paruus* (చిన్న) అనే పదానికి భిన్నభిన్న రూపాంతరములు భిన్నభిన్న ప్రాంతాలలో కనుపిస్తవి. తార్కికబుద్ధితో చూస్తే, ఈ రెండు పదములును ప్రమాణ సూచకములు కావున, వాటి మార్పులు కూడ ఒకేమోస్తరుగా ఉండవలెను. కాని *Psychological*—అనగా మనః ప్రవృత్తి సంబంధములగు కారణములను పట్టి చూస్తే ఈ భేదానికి కారణం పొడకట్టగలదు. "పెద్ద" అనే భావం అందరి మనస్సుల లోనూ ఒకేవిధమైన మనఃప్రవృత్తులను ఉద్భవింపజేస్తుంది. "పెద్ద" అనే భావం *Objective*, అనగా విషయముఖచింతనా జన్యం. కాని "చిన్న" అనే భావంలో *Subjective* గుణం ఉన్నది. ఈభావం హృదయాన్ని స్పందింపజేస్తుంది—ముఖ్యంగా స్త్రీ హృదయాన్ని. దుర్బలత, ఒకవిధమైన అందం—ఈ రెండుభావాలు "చిన్న" అనే భావంతో కలిసిఉంటవి. అందువలన కొందరు వ్యక్తులు ఒక పదమును, తదితరులు మరొక పదమును వాడుట సహజం. భాష తార్కికసిద్ధాంతాలను అనుసరించి పరిణామం పొందదు. అది మానవాత్మలోని కళానుభూతి, రసవాంఛ, భావోచ్ఛ్వాసములను అనుసరిస్తుంది.

**శబ్దార్థముల సంబంధము అవశ్యమా?**

శబ్దార్థములకు సంబంధ మున్నమాట సర్వజనాంగీకారమే. కాని ఈ సంబంధం అవశ్యమా? వాటి స్వభావరీత్యా ఉండవలసినదేనా? నిజంగా ఈసంబంధం అవశ్యమైతే రెండు ఫలితాలు కలుగవలెను. (1) భాష ఎప్పుడును మారకుండుట (2) మానవు లందరూ ఒకేభాష మాట్లాడుట. కాని ఇవి రెండును జరుగలేదుకాబట్టి పదధ్వనికీని, ఆ ధ్వని సూచించు వస్తువునకు కార్యకారణసంబంధం లేదని చెప్పవచ్చును. కాని ఈ సూత్రము ప్రాకృతికధ్వనులను అనుకరించు శబ్దాలకు వర్తించదు. *German—kukkuk*: *Italian - Cuculo*: *Skt. Kokila*. ఈ ఉదాహరణలను అనుసరించి కొందరు పదములు ప్రాకృతిక ధ్వన్యనుకరణము లందురు. ఇంగ్లీషులో *Baby, Daddy, Mamma* ధ్వన్యనుకరణము లనవచ్చును. వైదిక

పౌరాణిక యుగసంధి కాలమునాటి యాస్కుడు నిరుక్తమునందు శబ్దానుకృతికి "కాక" "దుందుభి" పదముల నుదాహరించినాడు. కొన్ని ఐరోపీయభాషలలో స్వల్ప ప్రమాణము (*size*) తెలియజేయు శబ్దములలో (*English-Little kid; Italian-Pik. Pit*) "ఇ" అనే అచ్చును; గురుత్వమును తెలియజేయు శబ్దములలో (*Latin-Magnus: Italian-Grande*) "అ" అనే అచ్చును, కనిపింగునని భాషావేత్తల యభిప్రాయము. కవిత్వంలో పదములకూ, అర్థభావములకూ గల అప్రాకృతికసంబంధం విదితమే.

శబ్దార్థసంబంధమునుగూర్చి ప్లేటోకన్న పూర్వము మన దేశమున సూత్రకారులు వైయాకరణులు విచారణచేసినారు. అంతకు పూర్వము బ్రాహ్మణములలో నామముల వ్యుత్పత్తినిగూర్చి ప్రశంసలు కలవు. పిదప నిఘంటువులలోను, యాస్కుని నిరుక్తమునందును పదార్థముల చరిత్ర ప్రమాణములతో చర్చింపబడెను. "సమాన కర్మాణః"—ఒకే అర్థ మిచ్చు మాటలు కొన్ని శీర్షికలక్రింద విచారింపబడుచువచ్చెడివి. ఈ విషయమును మహాభాష్యకారుడు పతంజలి పేర్కొనియున్నాడు. యాస్కుని నిరుక్తమునందు అమూల్యమైన ఈ క్రింది వ్యుత్పత్త్యర్థములు విపులీకరింపబడినవి.

(1) దేవరః-ద్వితీయో వరః.

(2) వారాహ-వరాహార.

(3) కితవ- కిం తవాస్తి.

ఆర్యులు ధ్వని శరీరముగను, అర్థ మాత్మగను భావించిరి. వారి దృష్టిలో అన్ని ధ్వనులును శబ్దములు కావు. విషయములను కాని, వస్తువులనుకాని తెలుపుడుచేయు ధ్వనులే శబ్దములు. అర్థమును వ్యక్తము చేయుటయే శబ్దముయొక్క ముఖ్యోద్దేశమని పతంజలి నిరూపించెను. గ్రీసుదేశీయుడైన హెరాక్లిటస్ (*Heraclitus*) వలె మీమాంసకులు శబ్దార్థముల పరస్పరసంబంధము నిత్యమూ, స్వాభావికమూ ననిరి. అరిస్టోటల్ శబ్దముల యర్థము సంఘనిర్ణయంపైన ఆధారపడిఉంటుందని చెప్పేడు. ఆర్యశబ్దవేత్తల మతమే మన, భాష వ్యక్తి తన మనోగత భావమును బయటికి ప్రకాశింపజేయు నిచ్ఛవలన జన్మించినదని. ఈవిషయమును వారు వేదాంతపరముగను, మతదృష్టితోను రూఢపరచినారు. మృత్యనంతరము వాక్కు మనస్సున లీనమగునని శ్రుతులు చెప్పచున్నవి. వాక్కు మనస్సున జన్మించునని దీని యర్థము. భర్తృహరి వాక్యపదీయమునందు పదము వాచకమనియు, విషయము వాచ్య మనియు వర్ణించినాడు. తరువాతి వారిలో ఎన్నో మతభేదము లున్నవి. కొందరీ సంబంధము నిత్య మనియు, ఇతరులు సాంకేతిక (*conventional*) మనియు నుడివిరి. చివరకు కొందరు శబ్దార్థములు రెండును ఒకే తత్త్వము (శుద్ధచైతన్యము) యొక్క భిన్న స్వరూపము లని చెప్పినారు. ఈసందర్భంలో స్ఫోటవాదముకూడ కనిపిస్తుంది. శంకరుడు దీనితో ఏకీభవించలేదు. స్ఫోటమనగా సనాతనమును, నిత్యమును నగు వాక్కు అని యొక మతము. (*Eternal unit of speech*). ఈస్ఫోటము శ్రవణేంద్రియగ్రాహ్యము గాదు. అవ్యక్తమయిన వాక్కుయొక్క సూక్ష్మబీజము మన శరీరాంతరమునుండి బయలుదేరి గొంతులోనికి వచ్చేసరికి కాని

వినబడదని స్ఫోటవాదుల మతము. ఇది అవిభాజ్యము; రూపరహితము. అర్థము క్షణికములగుకంఠధ్వనులవలనగాక స్ఫోటము వలన వ్యక్తమగును కావున దీనికి స్ఫోటమని వారు నామకరణం చేసేరు. స్ఫోటమే బ్రహ్మ మని స్ఫోటవాదుల మతం. ఈ మతముప్రకారము "గౌ" శబ్దముయొక్క అర్థము గ, ఔ,:- ఈ మూటియందు వేర్వేరుగ విభజింప జాలమనియు, పదమునకు వాక్యమువినా ప్రత్యేక ఉనికి లేదనియు, పదము ఖండ మనియు వాక్య మఖండమనియు వీరు నమ్ముదురు.

భాష సంఘస్వభావాన్ని తెలుపుచుచేయునా? :

భాష మానవుని సాంఘికజీవనపు లక్షణ మయినయెడల, అది సాంఘికభావములను, ఆశయములను వ్యక్తపరుపవలెను. ఇంగ్లీషుభాష ఆంగ్లేయుల జీవితమును, తెలుగుభాష తెలుగుమాట్లాడువారి శీలమును దర్పణమువలె ప్రతిబింబించవలెను. కాని భాష ఒక ప్రవాహంవంటిది. ఒకే యుగపు సంస్కృతినిగాక, శతశతాబ్దుల అనుభూతులను, సభ్యతాసంస్కృతులను అది తన గర్భమున ధరించును. అనగా, అది మానవచరిత్రలో మార్పులను కలుగజేయు శక్తుల ఫలితము. మానవునికి పూర్వ ముండి మృతిచెందిన పెద్దజంతువుల యస్థికలు (*Fossils*) ఎట్లు భూగర్భమున ఇమిడి యున్నవో, అట్లే ఎన్నో పురాతనభావములు, సంస్కృతులు, సంప్రదాయములు భాష యందు దాగియున్నవి. వైదికభాషను బోధపరచుకొనవలె నన, ఆభాష మాట్లాడు వారి మనోగతములను సంస్కృతిని అవగాహన చేసుకొనవలెను. కేవలము వ్యాకరణ, ఛందస్సుల పఠనవల్ల సాధ్యముకాదు. సాంఘికవ్యవస్థలలో సంప్రదాయమున (*Convention*) కెంత యున్నత స్థాన మున్నదో అట్లే భాషాపరిణామమందుకూడ సంప్రదాయమున కంత ప్రాముఖ్యత యున్నది. గాథాసప్తశతినాటి యాంధ్రుల సంస్కృతికిని, నేటి యాంధ్రుల సంస్కృతికిని ఏదోయొక అపరిచిత కార్యకారణసంబంధము లేదని చెప్పట బహుసాహసము.

భాష విశ్వజనీనము, జాతీయము, వ్యక్తిగతము :

భాషను మూడువిధములుగ మనము పరీక్షించవచ్చును. మానవుని ఎట్లు(1)మానవ జాతికి చెందినవానిగను, (2) ఒక ప్రత్యేక జాతికి (*Anglo-Saxon, French*) చెందిన వానిగను, (3) ఒక ప్రత్యేకవ్యక్తిగను మనము పరీక్షించగలమో, అట్లే భాషనుకూడ (1) మానవజాతియొక్క సర్వసామాన్యవ్యవహారముగను (2) ఒకజాతియొక్క విశిష్టలక్షణముగను, (3) ప్రతివ్యక్తియొక్క వ్యక్తిత్వస్వరూపము గను విచారించవచ్చును.

(1) మానవు డెక్కడ నివసించునో అక్కడ భాష యుండును. ఇట్లు ప్రపంచమున ఎన్నో భాషలు కలవు. ఇందులో కొన్ని సన్నిహితబాంధవ్యము కలవి. ఎట్టి బంధుత్వము లేనట్లు కనిపించు భాషలు మరికొన్ని. కాని అన్నిభాషలును వ్యాకరణమునందును, అర్థకల్పనయందును కొన్ని సమానధర్మములు కలిగియున్నవి. అందుచేత మియాలెట్ (*Meillet*) అను ఫ్రెంచి పండితుడూ, కొందరు డేనిష్ భాషాతత్త్వవేత్తలూ, *General linguistics* సార్వికభాషా దర్శనమును నిర్మించ యత్నిస్తున్నారు.

(2) కాని ప్రతిజాతికిని—ఇంగ్లీషు

వారు, ఫ్రెంచివారు; ఆంధ్రులు, తమిళులు మొదలగువారికి—ఒక ప్రత్యేకసంస్కృతి, ఆత్మ (*Psyche*) అనగా భావనాక్రియాత్మకమైన చిత్తప్రవృత్తి యొకటి గలదు. క్రోసి (*Croce*) యను ఇటలీ దేశపు విద్వాంసుడు భాషాచరిత్రకును, ఆభాష మాట్లాడువారి చరిత్రకును అవినాభావసంబంధము కలదని గుర్తించినాడు.

(3) కాని ఒకే భాష మాట్లాడువారిలో ప్రతివ్యక్తికీ ప్రత్యేకభాష కలదనికూడ మనము గ్రహించవలెను. ఎవడైనను ఇంకొకనివలె మాట్లాడడు; వ్రాయడు. ఏయిద్దరి భాష చూచినను, ఉచ్చారణలో, కంఠస్వరస్థానములో, పదవాక్యముల కూర్పులో భేదములు కన్పించును. కంఠస్వరమునుబట్టి మనము మనుష్యుని పోల్చగలముకదా? కవులలోను, లలితకళోపాసకులలోనూ ఈ విశిష్టత మరీ స్పష్టము. ఆమధ్య చెన్నపట్టణమునుండి ప్రదర్శింపబడిన కఠోపనిషత్ప్రతిపాదితమగు నాటికను మధ్యను విన్నవారొకరు ఇది తప్పక విశ్వనాధవారిదనీ, ఆ బాణీ ఇంకొకరిది కాదనీ సరిగా చెప్పగలిగినారు.

**సర్వభాషల సమానధర్మములు :**

శబ్దార్థములకు సంబంధం కల్పించే విషయంలో అన్ని భాషలయందు గల సమానత్వమునుగూర్చి యింకను పరిశోధనలు జరుగుచునే యున్నవి. కాని *Jesperson*, *Meillet*, *Sommerfelt*, *Wackernagel* మొదలగు మహావిద్వాంసు లీక్రింద వివరింపబడిన ఏకాభిప్రాయమునకు వచ్చియున్నారు.

(1) ప్రపంచమునందు గల సర్వభాషల పరిణామరేఖ యొకటే.

(2) ఏవిధముగ మానవుడు పాషాణయుగము, లోహయుగము అనే అవస్థల ద్వారా ప్రస్తుతస్థితికి వచ్చెనో, అట్లే భాషలుకూడ అభివృద్ధి చెందినపుడు కొన్ని యవస్థలు పొందినవి. ఈ నాగరికయుగమున కొందరు ఆటవికులు, పార్వతేయులు ఎట్లు పాషాణయుగమునకు చెందియున్నారో, అట్లే వారి భాషలుకూడ ప్రాకృతములు. ఆధునికభాషలందు జరుగు మార్పులు వారి భాషలలో కనుపడవు. లేక, ఒకప్పుడా భాషలు మార్పుచెందినా, ఇప్పటి వారి భాషలలో ఆమార్పులు దృశ్యముకావు. కాని, ఇంతమాత్రమున నాభాషల పరిణామ మాగిపోయినదని చెప్పజాలము.

**విశ్వజనీనమగు భాషాపరిణామరేఖలు :**

భాష లన్నియు ఒకేవిధమున మార్పు చెందు ననియు ఈమార్పుల వైఖరి మనము గుర్తింపగలమనియు ఇదివరకే చెప్పబడియున్నది. ఆ పరిణామరేఖలకు దృష్టాంతము లివి :—

(1). క్రియాపదములందును, నామవాచకములందును, సర్వనామములందును ద్వివచనము లోపించుట.

(2) *Demonstrative Pronouns* నుండి (1) *Definite Article*, (2) *Indefinite Article* పుట్టుట.

(3) క్రియలలో వివిధముఖములు (*Aspects*) పోయి, *Tenses* వాడబడుట (అనగా వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము.)

(4) *Creation of the passive*—క్రియా

పదములలో 'పడు' ధాతువుతో కూడిన రూపములు జనించుట.

(5) లింగవిభేదములు క్రమముగా వాడుకలోనుండి పోవుట.

(6) నామవాచకముల యొక్కయు, క్రియల యొక్కయు స్వరపరివర్తనము క్రమంగా క్షీణించుట.

(7) ఒకరకపు ధ్వనులు (దంత్య, తాలవ్య మొ.) ఇంకొకరకపు ధ్వనులుగ మారుట.

(8) *Synthetic grammar — Analytic grammar*గా సమవాయవ్యాకరణము, విశ్లేష వ్యాకరణముగ మారుట. ఉదాహరణ :—

*Dīco > I say.*

*Lupīs > To the wolves.*

(9) పదములు క్రమక్రమంగా హ్రాస్వములగుట—ప్రత్యయములు లోపించుటవల్ల.

(10) వస్తుసూచకపదములు గుణసూచక పదములగుట.

పైన వివరింపబడిన పరిణామము లన్నియు ఒకేసారి కాకుండా, నెమ్మదినెమ్మదిగా, పరస్పరవిరోధీభావముతో సంభవిస్తూ ఉండేవి. వేదమునందు గల కొన్ని ఋక్కులను కాళిదాసభవభూతుల కావ్యభాషతో సరిపోల్చినయెడల ఈ పరిణామరేఖ కొంత మట్టుకు బోధపడుతుంది. ఇట్లే ఆల్ఫ్రెడ్ అను ఆంగ్లేయరాజునాటి భాషకును, నేటి ఇంగ్లీషుభాషకును భేదమేర్పడినది. యుద్ధమల్లుని విజయవాడశాసనంలో ఉన్న తెలుగు ఈనాటి తెలుగుతో సరిపోల్చినయెడల ఎంతో భేదము కనిపిస్తుంది.

ఈ మార్పులకు మనోవైజ్ఞానికపు కారణమేమి?

భాషావేత్త లీమార్పులు కలిగినవని యొప్పుకొనినను, వాటి కారణాలనుగురించి భేదాభిప్రాయులుగా నున్నారు. కాని *Giambattista* అను భాషావేత్త ఒకవిధంగా ఈ మార్పులకు గల కారణము చర్చించినాడు. సంగ్రహంగా ఇతని యభిప్రాయ మిది :—

మానవత్వము ఆదిమస్వరూపము నుండి నవీననాగరికతగా పరిణమించుకాలమున, మానవుని బాహ్యజీవితమార్గముతో పాటు అతని జ్ఞానవృత్తుల శ్రేణీగణముగూడ (*Mental, categories*) మార్పు చెందుతూ వచ్చెను. ఇంతే గాదు. మనోవృత్తులలోనూ, భావనలలోనూ కలిగిన భేదమే బాహ్యజీవితమందలి భేదమునకు గూడ కారణమని చెప్పగలము. ఈవిధముగనే బాహ్యజీవితమునందలి మార్పు మనోవృత్తుల పరిణామమును పురోగమింపజేసెను. ఈ శతాబ్దపు ఆంగ్లేయసారస్వతమును చదివినచో, యుద్ధానంతరపరిస్థితులు, నూతన విజ్ఞానమూ, సాంప్రదాయికభావములం దెట్టి విప్లవమును గలుగజేసెనో విదితము కాగలదు.

[సశేషము]

# చైనాలో నవ్యసాహిత్యం

శ్రీ పురిపండా అప్పలస్వామి

చైనాసాహిత్యసంస్కృతి ఈనాటిది కాదు. ఇండియాకు వలెనే దీనికీ వేలకొలది సంవత్సరాల చరిత్ర వెనక వస్తూఉన్నది. ఐతే, అప్పటి సాహిత్యం ఏకొద్దిమంది పండితప్రకాండుల చేతిలోనో ఉండి జనబాహుళ్యానికి అందనిదిగా ఉండేది. గ్రాంథికభాష ఆనాటి కావ్యభాష. చైనాభాషలో గ్రాంథికభాషను 'వెన్‌యెన్' అంటారు. ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంవరకూ ఈ వెన్‌యెన్ వల్లమందు చైనాను వదలలేదు.

చైనాలో రేకెత్తిన రాజకీయచైతన్యం సాహిత్యంలోకూడా విప్లవం కలిగించింది. నిజానికి చైనాలో నవ్యసాహిత్యం అప్పటినుంచే ప్రారంభమయింది.

౧౯౧౭లోనే చెన్‌తుసీఉ, డా. హుషీగార్లు పైహువా * (వ్యావహారికభాష) వాదం లేవదీశారు. మన దేశంలోవలెనే గ్రాంథికవాదులైన భాషాభిషక్కులు దీనిని ఎదిరించారు. పైహువాను రిక్షావాళ్ల భాష, కూలీల భాష అని హేళనచేశారు.

పరిణామంలో ప్రతిచోటా జరిగిన పనే అక్కడా జరిగింది. సాహిత్యసింహాసనంనుంచి వెన్‌యెన్ ఆధిపత్యం తొలిగిపోయి పైహువా ఆస్థానం అధిష్ఠించింది. వెన్‌యెన్‌లో ఉండిన ఉత్కృష్ట గ్రంథాలు పైహువాలోకి పరివర్తనం జరిగింది. క్రమంగా శాస్త్రం, విజ్ఞానం, చరిత్ర మొదలైన సాహిత్యమంతా పైహువాలో ప్రచురణ జరిగింది. యువజనోద్యమము దీనికి తోడై జీవం పోసింది.

మొన్న మొన్నటివరకూ చైనాలో లిపీ, గ్రాంథిక సాహిత్యమూ ఒకటే అయినా వ్యావహారికంగా మాట్లాడే భాషలో మాత్రం మాండలికములైన అనేక భేదాలు ఉండడంవల్ల ఒక ప్రాంతంవారి భాష ఇంకో ప్రాంతంవారికి దుర్గమంగా ఉండేది. ఉత్తరప్రత్యుత్తరాలకు గ్రాంథికభాషతప్ప మరో గత్యంతరం ఉండేది కాదు. డా. లీఫంగ్ క్వాయీ చూపిన వివరాల ప్రకారం చైనా భాషలో ఉత్తరమండారిన్, తూర్పుమండారిన్, దక్షిణ పశ్చిమ మండారిన్, బ్రూకాన్, హుక్కా, మిన్, కనోన్‌టోన్‌జన్, క్యాంగ్ అని ఎనిమిది ప్రధానభాషాభేదాలున్నాయి. ఇందులో మండారిన్ భాష మాట్లాడేవారు అధికం. చైనా జాతీయప్రభుత్వం అవసరమైన సంస్కారం చేసి మండారిన్ భాషను జాతీయభాషగా నిర్ణయించింది. చైనాజాతీయజనకుడు సన్‌యెట్‌సేన్ ఈభాషలోనే తన గ్రంథరచన చేశాడు.

ఈ మండారిన్ భాషను తరవాత పెకింగుప్రాంతములో వాడుకలోఉన్న ఉచ్చారణసౌలభ్యంతో అంగీకరించి ౧౯౨౮ నుండి ఈ భాషలోనే ప్రభుత్వం పరిపాలన సాగించింది. పాఠశాలల్లో నిర్బంధంగా ఈ వాడుకభాష ప్రవేశపెట్టి ప్రచారం సాగించారు. నవీనమైన గ్రంథరచన అంతా పైహువాలోనే జరిగింది. దాంతో వెన్‌యెన్ మృతభాష అయిపోయి పండితుల పరిశీలనకోసం మాత్రం మిగిలింది. విదేశాల్లో విద్యాభ్యాసం చేసివచ్చిన వేలాదియువకులు ఈ ఉద్యమానికి పట్టుకొమ్మగా నిలబడ్డారు. పాశ్చాత్యఉత్తమ సాహిత్యం ఆకళించుకుని తమ మాతృభాషలో ప్రవేశపెట్టారు.

ఈ నూతనచైతన్యం వచ్చేక సాహిత్యంలో పరస్పరభిన్నాభిప్రాయం గల రెండు సంఘాలు బయల్దేరాయి. ఒకరిది కళావాదం అయితే రెండోవారిది వాస్తవికవాదం.

కళావాదులు 'కళకోసమే కళ' అన్నారు. వాస్తవికవాదులు 'ప్రజలకోసమే కళ' అన్నారు.

---

* పై=సరళమైన, హువా=భాష.

కళావాదులకు ప్రేమ ఒక్కటే ఆదర్శమైన కావ్య వస్తువు. వీరిని మన భావకవులతో పోల్చవచ్చునేమో!

కళావాదులు తమ సంఘానికి ఛ్వాంగ్ చావ్ అని పేరుపెట్టారు. వీరిలో చాలామంది జపానులో విద్యార్జనం చేసివచ్చినవారు. అందుచేతనే వీరి రచనల్లో జపానుముద్ర కనిపిస్తూఉంటుంది. కళావాదుల్లో కూడ ముందడుగు వేసిన విప్లవవాదులు కొందరు—అల్పసంఖ్యాకులే అయినా—లేకపోలేదు. అలాంటివారిలో ముఖ్యుడు కూవ్ మోజో.

వాస్తవికవాదుల సంఘం పేరు 'వెన్‌సుయే ఇయేన్ చ్యుహ్వే'. ఇది ౧౯౨౦లో ఏర్పడింది. లూసూన్, మావ్‌తుంగ్, వాంగ్‌తుంగ్‌చావ్, చెంగ్ చెన్‌తో, లోహుయాషెంగ్, చియేన్‌సుయాంగ్ తుంగ్, ఊపింగ్‌పో, లూఈన్ మొదలైన సుప్రసిద్ధులు ఇందులో చేరారు. కథలపత్రిక 'యూసన్', సాహిత్యపత్రిక ఒకటీ ఈసంఘం ప్రారంభించాయి. ఈ రెండుసంఘాలూ ప్రారంభంలో అనువాదాలు ఆరంభించాయి. విశ్వసాహిత్యంలోని ఉత్తమగ్రంథాలు తమ భాషలో లేనిదే మౌలికమూ, బలీయమూ అయిన మంచిసాహిత్యం సృష్టికాదన్న రహస్యం ఉభయులూ గ్రహించారు.

వాస్తవికవాదులు ముఖ్యంగా రష్యావాఙ్మయం నుండీ, తదితరవిదేశసాహిత్యంనుండీ విరివిగా అనువాదాలు చేశారు. అనువాదసాహిత్యం బహుముఖాల విస్తరించింది. అనతికాలంలోనే గోర్కీ, పుష్కిన్, చెఖోవ్, టాల్‌స్టాయి, గోగల్, షేక్స్పియర్, గెథే, ఉమర్‌ఖయూామ్, రోమేరోలా, మేతర్లింక్, షెల్లీ, టాగోరు, స్టీవెన్‌సన్, వాల్టెయర్, అప్టన్ సింక్లెయర్, ఆస్కార్ వైల్డ్, మార్క్స్ మొదలైన వారి గ్రంథాలతో చైనాసాహిత్యం నిండిపోయింది.

రవీంద్రుడి రచనలు డా. తాయ్‌చితావ్ అనువదించాడు. నిజానికి గాంధీరవీంద్రులను చైనావారికి సుపరిచితులుగా చేసినవాడీయన. ఇండియా కూడ వచ్చి వెళ్లాడు.

పై రెండుసంఘాలలోనివారేకాక నవ్యసాహిత్యానికి తోడ్పడ్డవారిలో సుచిమొ, హుషీ, హుతఈ యోపింగ్ మొదలైనవారూ ఉన్నారు. సుచిమొ స్టీవెన్‌సన్, వాల్టెయరు మొదలైనవారిని అనువదించాడు.

సుచిమొ 'నెలవంక' సంప్రదాయమైన సాహిత్యసంఘానికి నాయకుడు, 'షిన్-యుయే' (నెలవంక) అనే మాసికపత్రికవల్ల ఈ సంఘానికి ఈపేరు వచ్చింది; షిన్-యుయే ఫాయి (నెలవంకసంప్రదాయం) అని. నెలవంకసంప్రదాయులకు ముఖ్యంగా ఇంగ్లీషురొమెంటిక్ కవులు ఆదర్శం. వీరి కావ్యాల్లో కావ్యాత్మకంటె శైలిలో జిలుగూ, నవీనతా ద్యోతకమౌతాయి. సుచిమొతోపాటు నెలవంకవాదుల్లో వన్ ఇతో కూడా చెప్పదగినవాడు.

అయితే సుచిమొ అకాలమరణంతరవాత వన్ ఇతో నవ్యసాహిత్యానికి జలాంజలి విడిచి ప్రాచీన సంప్రదాయంవెంట పడ్డాడు. అంతతో నెలవంక సంప్రదాయం అంతరించింది. షిన్-యుయే అంతరించిన తరవాతనే ఛ్వాంగ్‌చావ్‌సంఘం పైకివచ్చింది.

ఇటు కళావాదులతోనూ నెలవంకవాదులతోనూ, అటు వాస్తవికవాదులతోనూ సామరస్యంగా మెలగుతూ వచ్చాడు సైచియాత్-సూన్. ఇతడు కథారచనలో సిద్ధహస్తుడు.

ఈ సాహిత్యవిప్లవంలో వచ్చిన ఆధునిక చైనా రచయితలలో సర్వోత్కృష్టస్థానం అలంకరించిన మొదటివాడు లూసూన్; రెండోవాడు కూవ్‌మోజో. కూవ్‌మోజో కళావాదుల్లో ఉండినా ప్రగతివాది. పాశ్చాత్యసాహిత్యంనుండి అనేకగ్రంథాలు చైనాలోకి అనువదించాడు. ఉమర్‌ఖయ్యామ్, గెథేలను చైనావారికి పరిచయంచేసిన కీర్తి ఇతడికి దక్కింది. ప్రకృతిని కవిత్వంలో ప్రవేశపెట్టి చిత్రించిన ఆధునికుల్లో మొదటివాడీయన.

లూసూన్ చైనానవ్యసాహిత్యానికి ప్రవక్త అని చెప్పాలి. పైహవాకు సాహిత్యరూపం ఇచ్చినవాడీయన. ఇతని రచనలు ఇప్పటికీ బహుళప్రచారంలో

ఉన్నాయి. చైనావిమర్శకులు ఇతణ్ణి గోర్కీతో సరిపోల్చి గౌరవిస్తారు. ఇతడి రచన 'అహ్ క్యూ చంగ్ చ్వాన్' లక్షలాదిజనాన్ని ఆకర్షించింది. ఇతడి కథలూ, వ్యాసాలూ, నవలలూ నవీనులకు ఆదర్శాలయినాయి. మనం గురజాడ అప్పారావుతో ఇతణ్ణి పరిపోల్చవచ్చు. ఒకవిధంగా అప్పారావుతో సమకాలికుడు కావడమూ ఒక విశేషమే. (అప్పారావు ౧౮౬౨-౧౯౧౫. లూసూన్ (౧౮౮౧-౧౯౩౬.)

ఈ సమయంలో సాహిత్యంలో ప్రధానస్థానం ఆక్రమించింది కావ్యం. పాశ్చాత్యపద్ధతిని సానెట్, బ్లాంక్ వెర్సు కవిత్వంలో ప్రవేశించింది విరివిగా.

గద్యరచయితలలో లూసూన్, చౌచోజన్, లీన్ యుథాంగ్ మొదలైనవారు ముఖ్యులు. పత్రికలలో 'యుసన్', 'శ్యావ్ ష్వో యుయీ పౌ' ప్రసిద్ధమైనవి.

౧౯౨౫ తరవాత సన్ యత్ సేన్ మరణించడమూ, చాంగ్ కై షేక్ చైనాకు సర్వాధికారి కావడమూ జరిగాయి. నవీనరచయితల ఆదర్శాలకూ చాంగ్ కై షేక్ ప్రభుత్వానికీ సరిపడని పరిస్థితులు వచ్చాయి. రష్యాను ఆదర్శంగా పెట్టుకొని వామపక్షరచయితలు విజృంభించడం జరిగింది. ౧౯౨౫-౨౭ ఈ రెండు సంవత్సరాలమధ్య నవీనులు ఆత్మార్పణానికి సిద్ధపడి సాహిత్యసృష్టి చేశారు. ౧౯౨౭లో ప్రభుత్వం వీరిమీదికి దండెత్తడమూ, అనేకరచయితలు బలికావడమూ జరిగింది. దాంతో ఉద్రిక్తులైన అనేకరచయితలు వామపక్షంలో చేరారు.

అంతవరకూ పికింగ్ నగరం నవ్యసాహిత్యానికి కేంద్రంగా ఉండేది. కాని ఈతరవాత షాంఘాయి పట్నానికి మారింది.

చైనానవ్యసాహిత్యాన్ని రష్యాప్రభావంనుండి తప్పించి ఫ్రాన్సు, అమెరికాలలోని సాంకేతికవాదం (సింబాలిజమ్) దిక్కు త్రిప్పడానికి ఒక ప్రయత్నం జరిగింది. దీనికి నాయకుడు తాయ్ వాంగ్ షు. షాంఘాయినుండి వెలువడిన 'షియేన్ తాయిన్', 'వ షుయే' పత్రికలు ఇందులో ప్రముఖపాత్ర వహించాయి. కాని చెప్పుకోదగ్గ సాహిత్యసృష్టిమాత్రం ఏమీ జరగలేదు.

౧౯౨౭-౩౨ ఈ అయిదుసంవత్సరాలలో పాతపద్ధతుల సాహిత్యం ఏమూలాకనపడలేదు. అభ్యుదయ రచనలతో దేశం మారుమోగిపోయింది. అయితే అందులో చాలాభాగం ప్రచారసాహిత్యంగానే తయారైంది. సాహిత్యంగా చెప్పదగింది మాత్రమూ పుట్టలేదనే చెప్పాలి. మన సహాయనిరాకరణోద్యమంలో జాతీయగేయాల స్థానమే వీటికి లభిస్తుంది.

ఈ సమయంలో చైనా ఆధునిక నాటకరచన వృద్ధి పొందింది. ఇబ్సన్, రోమేరోలా మొదలైన నాటకాలు చైనాలోకి పరివర్తన పొందాయి.

డా. హుషీగారి చుంగ్ షన్ తా షవంటి ఏకాంక నాటికలు విశేషజనాదరణ పొందాయి.

ఔయూ వ్రాసిన 'యుఆహ్ ఇయే', 'లే-యూ', 'జ - ఫూ' మొదలయిన విషాదాంతనాటకాలూ, చియేన్ వూ వ్రాసిన సుఖాంతనాటకాలూ చెప్పదగినవి.

తియేన్ హాన్, హుంగ్ సేన్ మొదలైన రచయితలు నాటకసాహిత్యం పరిపక్వానికి తెచ్చారు. హుంగ్సేన్ మంచి అనువాదాలుకూడా చేశాడు. తియేన్ హాన్ స్థాపించిన 'నాన్ కోవ్' నాటకసమాజం ప్రసిద్ధమైనది.

౧౯౩౦ మార్చిలో అధునికరచయితల సమావేశమొకటి షాంఘాయిలో జరిగింది. యాభైమంది రచయితలతో ఒక పరిషత్తు ఏర్పడింది. దీనికి నాయకుడుగా నిలబడ్డాడు లూసూన్. లూసూన్ నాయకత్వం నవీనులకు ఉత్సాహం, సాహసం ప్రసాదించింది. నవ్యసాహిత్యప్రచారానికి మంచి పత్రికలు బయలుదేరాయి. వాటిలో లూసూన్, తింగ్ లింగ్ ల నాయకత్వాన వెలువడినవి ముఖ్యమైనవి.

నవ్యసాహిత్యం ఒక మహోద్యమంగా విజృంభించింది. దాంతో కుమింగ్ టాంగ్ ప్రభుత్వం ఇదొక విప్లవాత్మకమైన ప్రమాదంగా గణించింది. సర్వశక్తులూ వినియోగించి దీనిని మూలచ్ఛేదం చేయడానికి సంకల్పించింది.

ప్రథమకబళంగా ౧౯౩౧ ఫిబ్రవరిలో విశాసంలో ఉన్న ఈ ఆరుగురు రచయితలనూ ఉరితీసింది— జరోష్సీ (వయస్సు ౩౧), ఈన్ ఫూ (౨౩), లిఒమే ఈ-సింగ్ (౨౫), పింగ్ టా ఈ (౨౧), ఫెంగ్ కెంగ్ (౨౮ యువతి), హు ఇయే పింగ్ (౨౬).

హు ఇయే పింగ్ నేటి సుప్రసిద్ధకథారచయిత్రి తింగ్ లింగ్ భర్త.

లెక్కలేని నిర్బంధాలూ, నిషేధాలూ, మరణ దండనలూ జరిగాయి. ఏమైనప్పటికీ ఉద్యమంమాత్రం చావలేదు, తగ్గలేదు. నవ్యసాహిత్యం బహుముఖాలా వ్యాపిస్తూనే ఉంది; ఉజ్జీవనం పొందుతూనే ఉంది. జలప్రవాహానికి అడ్డంకు లేముంటాయి!

ఈ కాలంలో చైనాసాహిత్యాకాశంలో మొదటిరకం నక్షత్రాలుగా ప్రకాశించినవారు మావ్ తుంగ్ తింగ్ లింగ్ లు. మావ్ తుంగ్ ప్రతిభావంతుడు. 'ష్యన్ ఛాన్', 'ఛయేహ' ఇతని ప్రసిద్ధగ్రంథాలు. 'ఛయేహ' (మునిమాపు) చైనానవ్యసాహిత్యంలో మహోత్కృష్టమైన గ్రంథం. నవీననవలాకారులలో మావ్ తుంగ్ స్థానం గొప్పది.

తింగ్ లింగ్ (౧౯౦౬-) ఆధునికచైనాలో ఉత్తమోత్తమమైన రచయిత్రి. విద్యార్థినిగా ఉండినప్పటి నుండి విప్లవోద్యమంలో ఉరికింది. ప్రభుత్వానికి దొరకకుండా కొన్నిసంవత్సరాలు తిరిగింది. చివరకు౧౯౩౩లో పట్టుబడి అనేకసంవత్సరాలు నాన్ కింగ్ జైల్లో గడిపింది. ఈమె వ్రాసిన ఏడుపుస్తకాలు కుమింగ్ టాంగ్ ప్రభుత్వం నిషేధించింది. నిశితమైన శైలితో కథ ఒక ప్రవాహంలా నడిపించగల సమర్థురా లీమె. 'చాయ్ హావతన్ చుంగ్' (ఛీకట్లో) అనే ఈమెనవల సుప్రసిద్ధమైన రచన. (ఈమెభర్త హుఇయేపింగ్ ౨౬ ఏట ఉరితీయబడిన విషయం వెనక చెప్పాను.)

మావ్ తుంగ్, తింగ్ లింగ్ లతోపాటు లావ్ చావ, చాంగ్ తియేన్-ఈ, ఇయాన్ షుయే ఇయేన్ లపేర్లు కూడా చెప్పాలి. లావ్ చావ (౧౮౯౯-) వ్యంగ్యరచన ఇతడి అభిమానవస్తువు. ఇతడి అసలుపేరు షు-షే-ఉ. చాంగ్ తియేన్-ఈ (౧౯౦౧-) అనేకనవలలూ, చిన్న కథలూ రాశాడు. నవీనుల్లో ఇతడి కో ప్రత్యేకస్థానం ఉంది. ౧౯౨౭-౩౦ ప్రాంతంలో సాహిత్యరంగంలో అవతరించాడు. చైనాసాంఘికజీవనంలోని కుళ్లు బైట వేయడంలో సమర్థుడు. ఇయాన్ షుయే-ఇయేన్ (౧౯౦౯-) ౧౯౩౬లో సాహిత్యక్షేత్రంలోకి దిగాడు. కథారచనలో అందెవేసిన చెయ్యి. చైనాజపాను యుద్ధంలో పోరాడాడు. అందుచేత ఇతడి కథల్లో యుద్ధబీభత్సం పచ్చిగా కనపడుతూఉంటుంది.

పైవారేకాక ఈకాలంలో ప్రసిద్ధికి వచ్చిన అనేక యువకులూ ఉన్నారు. పాచిన్ యువకుల ఆదరం పొందిన రచయిత. ఇతడి రచన 'విల్ఫ్న' చదవని యువకుడు ఉండడు.

ఈసమయంలోనే షిచేమూన్, తూహేన్ మొదలైనవారు ఒక సంఘంగా ఏర్పడ్డారు. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన సైకోఎనాలసిస్ సిద్ధాంతం సాహిత్యంలో ప్రవేశపెట్టినవారు వీరు.

'కళకోసమే కళ' అన్న భావకవులు ఈ కాలంలో నామరూపాలు లేకుండా అయిపోయారు.

అభ్యుదయరచయితల్లో చేరని ప్రసిద్ధరచయితగా షెన్ సుంగ్ వన్ (౧౯౦౨-) ను ఉదహరించాలి. నవీనులతో భుజాలు కలపకపోయినా ఇతణ్ణి ఆధునికరచయితల్లో సమర్థులైన మహారథుల్లో ఒకడిగా అంగీకరించారు విమర్శకులు. ఇతడికి ముప్ఫయోయ్యోసంవత్సరం నిండేసరికి ఇతని నలభైగ్రంథాలు ప్రకటితమైనాయి.

ఇంతవరకూ చైనాలో నవ్యసాహిత్యం పైహవాలోనే సాగుతూఉన్నా, అది చాలవరకు శిష్టవ్యావహారికం కావడంచేత కార్మికులు, కర్షకులు మొదలైన సామాన్యజనంలో ప్రవేశించవలసినంత ప్రవేశం పొందలేదని గమనించారు నవీనులు. సార్వజనీనమైన ప్రజాసాహిత్యం వస్తేనేగాని ప్రయోజనం లేదని ౧౯౩౬నుండి సామాన్యప్రజల భాషలో సాహిత్యసృష్టికి ఉపక్రమించారు.

౧౯౩౬లో లూసూన్ మరణం చైనానవ్యసాహిత్యంలో తీరని లోపం తీసుకువచ్చింది.

౧౯౩౭లో జపానుఆక్రమణాన్ని ఎదుర్కోవడం కోసం చైనాలోని వామపక్షాలన్నీ కుమింగ్ టాంగ్

ప్రభుత్వంతో ఏకమై పోరాడవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. దాంతో అభ్యుదయరచయితలమీది నిషేధం తొలిగింది. నవ్యసాహిత్యం ఊహించలేనంత అభివృద్ధిని గడించుకుంది. కావ్యం, కథ, నవల, నాటకం-ఒకటేమిటి అన్నీ విస్తృతిపొందాయి. ఈసమయంలో ప్రతీరచనా జపానుమీద అగ్నివర్షం కురిపించింది.

ఈ దినాల్లో ముఖ్యంగా నాటకం మహోన్నతస్థానానికి ప్రాకింది. 'కెక్-మిన్-కాంగ్ ఎర్-చీ-షీ' (జపానువ్యతిరేకమయిన ప్రజానాటకసంఘాలు) ఎక్కడబడితే అక్కడ ఏర్పడి పట్నాలలో, పల్లెటూళ్లలో, మైదానాల్లో, వీధుల్లో, రోడ్లమీద—సర్వత్రా ప్రదర్శనాలు జరిపాయి. లూసూక్ నాటకసమితి, హోతీషీ నాటకసంఘం, ప్రాక్టికల్ నాటకపరిషత్తు, బాలికల నాటకసంఘాలు మొదలైనవి దేశమంతటా వ్యాపించాయి. ప్రజల్లో ఇవి కలిగించిన సంచలనం అభూతపూర్వం.

'మంచూరియావిజయం', 'ఆక్రమణ', '౧౮ సెప్టెంబరునుండి', 'ఆయునం', 'గర్జించు చైనా' మొదలైన నాటకాలు బహుళజనాదరణకు పాత్రమైన వాటిలో కొన్ని.

గొరిల్లాగేయాలూ, కార్మికగేయాలూ, ప్రబోధగీతాలూ ఆమూలనుండి ఈమూలకు ప్రతిధ్వనించాయి. ఎక్-షై-ఐఎర్హ్ అనే యువకవి వ్రాసిన గేయం గొరిల్లా పురోగమనం 'బానిసబ్రతుకు ఇష్టంలేని ప్రజలారా లేవండి' అంటూ ప్రతీకంఠంనుండి వెలువడింది. ప్రభుత్వపక్షాన ఏర్పడిన 'ఎకడెమియా సినికా' చెప్పదగిన సాహిత్యపరిశోధన చేసింది.

నిజానికి చైనాలో నవ్యసాహిత్యానికి ఆ దినాల్లో ఏర్పడిన అనుకూలవాతావరణం అపూర్వమైనది.

ఈకాలంలో వచ్చిన సాహిత్యం యుద్ధకాలపు సాహిత్యమని విభజించారు.

"చైనారచయితలు రక్తానికీ, కన్నీళ్లకూ మధ్య నివాసంచేస్తూ నవ్యసాహిత్యనిర్మాణం చేశారు. యుద్ధంలో ప్రజాసామాన్యం పాల్గొనడంకోసం సాహిత్యం ఒక ఉపకరణగా వినియోగించారు. కావ్యాల్లో, కథల్లో, నవలల్లో, నాటకాల్లో-అన్నిటా కర్షకులనూ, కార్మికులనూ, సైనికులనూ చిత్రించారు." అని చుపు-సుంగ్ 'యుద్ధకాలపు చైనాసాహిత్యం' అన్న వ్యాసంలో వ్రాశాడు.

ఐతే ఈ పరిస్థితి ఎంతోకాలం నిలవలేదు. ౧౯౩౯ లో చాంగ్ కైషేక్ జపానుతో కాక చైనా కమ్యూనిస్టులతో పోరాడవలసిన పరిస్థితులు వచ్చాయి. నవ్యసాహితీపరులు ప్రభుత్వవిపద్దృష్టిలోకి మళ్లీ వచ్చేశారు. సాహిత్యకేంద్రం ఈ ఏనాన్ ప్రాంతానికి మారింది. సుప్రసిద్ధులైన రచయితలందరూ ఇక్కడ చేరి నవ్యసాహిత్యసృష్టికి తలపడ్డారు.

౧౯౪౨లో మావ్ సేతుంగ్ ఆధునికరచయితలను ఒకచోట చేర్చి పెద్ద సాహిత్యసమావేశం జరిపాడు. ఈ సమావేశం కొన్ని వారాలపాటు జరిగింది. ఈ సమావేశంలో మావ్ సేతుంగ్ చేసిన మహోపన్యాసం విశ్వసాహిత్యవేత్తల దృష్టిని ఆకర్షించింది. కళ, సాహిత్యం ప్రజలకోసమే అని అతడు సహేతుకంగా నిరూపించాడు. మావ్ సేతుంగ్ చైనావిప్లవానికి నాయకుమాత్రమే కాదు, ప్రతిభావంతుడైన రచయితకూడ. సర్వజనసుబోధమైన ఇతడి శైలి కత్తిపదునువంటిది. ఇతడి గీతం ఒకటి ఉదాహరిస్తాను.

"ఉత్తరాన్ని కనపడే దంతా
వేయి 'లీ'*ల మంచుతో, వేయివేయి 'లీ' ల
ఆకుల తుషారంతో ఉంది.
లే, పరికించు,
మహాప్రాకారం† ఇరుప్రక్కలా
కుసుములతోంది ప్రళయం.
పసుపునది‡ నిమ్నోన్నతాల్లో
మచ్చికైన కనపడదు జలప్రవాహం.
తాండవం చేసి అలిసిపోయిన
నల్లత్రాచుల్లా ఉన్నాయి దూరాన పర్వతాలు.

* లీ=(*Li*)మైల్లో మూడోవంతు.

† *Great wall of China.*

‡ *Yellow River.*

దగ్గరి కొండలు ఏనుగుమందలు.
నేనో, మేఘాలనుండి నా ఔన్నత్యం కొలుస్తాను.
నిరాడంబరమైన అలంకారంతో
అందంగా ఉన్న యువ్వనివలె
శుభ్రమైన దినాల్లో పుడమి ఎంత అందంగా
ఉంటుంది!

ఆమెకోసం పందేలు వేసుకు ఉరుకుతున్నారు
అసంఖ్యమైన వీరులు.
ఊచి, షీహుయా సామ్రాట్టులలో
సంస్కృతివాసన శూన్యం.

తాయిజాంగ్ చక్రవర్తిహృదయానికి
అనుభూతి పులకిక్క.
చెంఘీస్‌కు కేవలం డేగలమీదికి
శరం సంధించడమే తెలుసు.
వీళ్లందరి దినాలూ వెళిపోయాయి.
ఇవాళ, ఇవి హృదయం కల మానవుడి దినాలు."

చైనాలో నవ్యసాహిత్యానికి పూర్వం ఉండిన అడ్డంకులు ఇప్పుడు తొలిగిపోయాయి. ఇకముందు జాతిని నిర్మాణమార్గంలో నడిపించే స్థాయి గల సాహిత్యం సృష్టికావాలి.



# రసార్ణవసుధాకరము - కొన్ని విశేషములు

శ్రీ బులుసు వెంకటరమణయ్య

సంస్కృతవాఙ్మయమున గల యలంకారగ్రంథములలో రసార్ణవసుధాకర మొకటి. ఇయ్యది సర్వజ్ఞసింగమహీపాలునిచే రచింపబడిన ప్రామాణికశాస్త్ర గ్రంథము. భారతదేశమంతటను ప్రఖ్యాతి వహించి, పరమప్రామాణికుఁడనియు, సాటిలేని వ్యాఖ్యాత యనియు బేరుగాంచిన శ్రీకోలచల-మల్లినాథసూరి తన వ్యాఖ్యానములలో నెడనెడ నీ గ్రంథములోని విషయములనే—తనకు ప్రమాపకములుగ నుదాహరించుటంబట్టి యేతద్గ్రంథప్రశస్తి సువ్యక్తమగుచున్నది. మఱియు నసాధారణమేధావియు, కవిసార్వభౌముఁడు నగు శ్రీనాథమహాకవి ఏతద్గ్రంథకర్త యగు సింగమహీపాలుని యాస్థాని కేగినపుడు

'ఎటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలుధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సకలసద్గుణనికురుంబ, శారదాంబ'

అని పల్కుటంబట్టి సింగమహీపాలుని వైదుష్యము వ్యక్తమగుచున్నది.

రసార్ణవసుధాకరము మూఁడు విలాసముల యుగ్రంథము. ఇందు మొదటి విలాసమున నాయికా, నాయకుల స్వరూపము, భావాదిచేష్టలు, విభావ, సాత్త్వికరీతి, వృత్తి, ప్రవృత్తి, గుణాదులు వివరింపబడినవి. రెండవవిలాసమున సంచారి, స్థాయిభావములు, రసములు, రసాభాసము మున్నగునవి సవిమర్శముగ వివరింపబడినవి. మూఁడవ విలాసమున దశరూపకములు, సంధి, సంధ్యంగాదిరూపకసామగ్రియు విపులముగ వివరింపబడినవి.

విషయవివేచనమున గ్రంథకర్త భోజదేవుడు మున్నగు నాలంకారికుల మతమును సయుక్తికముగ నిరాకరించుచు, భరతముని మతమును బెక్కుయెడల వివరించుచు నిష్కృష్టము లగు సిద్ధాంతములను ప్రతిపాదించెను. ఇయ్యది సాహిత్యతత్త్వవిమర్శకుల కెంతయు నుపయుక్తమైనది.

ఈ గ్రంథ మిట్లు విశేషవిషయప్రతిపాదక మయ్యును, ప్రతాపరుద్రీయాదులవలె నిపుడు విశేషప్రచారమున లేకున్నది. ఇయ్యది ౧౮౯౫లో వెంకటగిరియందు తత్సంస్థానాధిపతులచే నొకసారి తెలుగు లిపిలో ప్రకటింపబడినది. కాని యిది ముద్రాపక, పరిష్కర్తల లోపములచే దప్పుల తడ

కగా దయార్హైనది. దీనిని ౧౯౫౬సం.న తిరువనంతపురము సంస్కృతగ్రంథావళివారు ప్రకటించిరి. ఇందు వెనుకటి దానిలో నున్న యన్ని తప్పులు లేకున్నను స్ఖాలిత్యములు చాల లేకపోలేదు. పయి రెండుప్రతులను ఎదురెదురుగ నుంచికొనిననేగాని, గ్రంథము సమన్వయించుట దుర్ఘటము. ఈ రీతిగ నైనను గ్రంథస్వరూపమును నిలిపినందుల కాయ్యాప్రకాశకు లభినందనీయులు.

ఇతరగ్రంథములవలె కేవలము లక్ష్యలక్షణనిరూపణమున దృష్టిజెందినచో నీ గ్రంథముయొక్క విశిష్టత వ్యక్తమయియుండెడిది కాదు. అట్లు కాక, ఇయ్యది పెక్కు విశేషవిషయములను దెలియజేయుటచే నుత్కృష్టగ్రంథ మని పేరుగాంచినది. వివిధ మార్గములలోని యా విశేషములలో గొన్ని మచ్చున కిచట నీయబడును.

(1) ఆంధ్రులు రచించిన గ్రంథములలో గ్రంథవిషయమునకు గల ప్రాముఖ్యము 'కృత్యాది'కిని గల దనుట స్పష్టము. కృత్యాదిరూప మగు నీ 'పీఠిక' పెక్కు చారిత్రకవిషయముల కాకరమై 'చరిత్ర'గా గూడ బరిణమించుచున్నది. రసార్ణవసుధాకరమునందలి 'పీఠిక' కృతికర్తృవంశమును విపులముగా వివరించుటయే కాక, యక్కాలమున జరిగిన కొన్ని సంఘటనలను గ్రంథస్థ మొనర్చుచున్నది.

మహాచలము—

అన్నపోతవిభుని వర్ణించు సందర్భమున—

'హేమాద్రిదానై ర్ధరణీసురాణాం
మహాచలం హ స్తగతం విహాయ
యశ్చారుసోపానపథేన చక్రే
శ్రీపర్వతం సర్వజనప్రగమ్యమ్',

అను శ్లోక మున్నది. శ్రీమదనపోతమహీధవుడు విప్రులకు లెక్కలేని సువర్ణమును దానముచేయుచుండె ననియు, అతడు చేజిక్కిన మహాచలమును—పెనుగొండను విడిచి పెట్టె ననియు, శ్రీశైలపర్వతమునకు సోపానములు కట్టించె ననియు దీనికి దాత్పర్యము.

మూలములో నొక్క తిరువనంతపురపు ప్రతియందే 'మహాచల'మ్మని కలదు. తెలుగు లిపిప్రతిలోలేదు. లేనందున గొంతకాలమున కిట్టి విషయము మఱగిపోవును. చరిత్ర పరిశోధకులు గమనింపవలసిన విషయ మిది!

(2) కాళిదాసమహాకవి మేఘసందేశ కావ్యమున గల—

'ఏతస్మా న్మాం కుశలిన మభి
జ్ఞానదానా ద్విదిత్వా
మాకౌలీనా దసితనయనే!
మ య్యవిశ్వాసినీ భూః,
స్నేహానాహుః కిమపి విరహే
ధ్వంసిన స్తేహ్యభోగా
ది ష్టేవస్తు న్యుపచితరసాః
ప్రేమరాశీభవంతి'

అను శ్లోక మీగ్రంథమున ప్రౌఢస్నేహమున కుదాహరణముగ నీయబడి యున్నది.

'ప్రవాసాదిభి రజ్ఞాత
చిత్తవృత్తౌ ప్రియే జనే,
ఇతరక్లేశకారీ యః
స ప్రౌఢః స్నేహ ఉచ్యతే'

అని ప్రౌఢస్నేహలక్షణము.

'ప్రవాసము మున్నగువానివలన, నాయికా నాయకులలో నొకరి చిత్తవృత్తి తెలియకపోగా రెండవవారికి క్లేశమును గలిగించు స్నేహము ప్రౌఢస్నేహమగు' నని లక్షణమున కభిప్రాయము.

పయి లక్షణమును బట్టియు,

'అత్ర ప్రోషితే యక్షే స్నేహజనితయా తదన్యాసంగశంకయా ప్రియాక్లేశో 'మయ్యవిశ్వాసినీ మాభూ' రితి ప్రత్యాశ్వసనేన వ్యజ్యతే'

[ఇచట దేశాంతరగతు డగు యక్షుని యెడ గల స్నేహమువలన, అత డన్యాసక్తుడై యుండు నను సందేహమున నతని ప్రియురాలికి గ్లేశము కలిగినది. అది 'నాయెడ నపనమ్మికను పొందకుము' అను యక్షుని యుపశమనవాక్యమువలన వ్యక్త మగుచున్న' దని వివరణము నభిప్రాయము]

అను నుదాహరణపు వివరణమును బట్టియు బై యుదాహృతి కీ క్రింది యభిప్రాయ మని గ్రహింపవలసియున్నది.

'ఓ చెలీ! ఈ నా సందేశమును విని, నేను కుశలముగా నున్నానని యెఱుగుము; నా యవస్థ తెలిసికొనుము. లోకులు పల్కులేనిపోనిమాటలు విని, నాయెడ (నే నితర కాంతయం దాసక్తుడ నని) నెట్టి సందేహమును పొందకుము; పరస్పరము కల యనురాగములు విరహావస్థయందు నశించు నని కొందలు పలుకుమాట పొరపాటు. భోగాభావముచే విరహావస్థయందే యవి యిక్కలి ప్రవృద్ధములయి, విరహము భరింపరానిదిగా నొనర్చుచుండును.' అని.

కాని మల్లినాథసూరివ్యాఖ్యానమున నిందలి తొలి భాగమునకు—

'ఏతస్మాత్ పూర్వోక్తాత్, అభిజ్ఞాయతే ఽనేనే త్యభిజ్ఞానం లక్షణం; తస్య దానాత్ ప్రాపణాత్; మాం కుశలినం క్షేమవంతం; విదిత్వా జ్ఞాత్వా; హే అసితనయనే! కులే జనసమూహే భవాత్ కౌలీనాత్—లోకప్రవాదాత్—ఏతావతా కాలేన పరాసుర్నోచే దాగమిష్యతీతి జనప్రవాదా దిత్యర్థః. 'స్యాత్కౌలీనం లోకవాదే యుద్ధే పశ్వహిపక్షిణా' మిత్యమరః. మయి విషయే; అవిశ్వాసినీ మరణశంకినీ; మాభూః, న భవ. భవతే ర్లుఙ్. నమాఙ్యోగే ఇ త్యడాగమప్రతిషేధః'

అని వివరణ కలదు. దీనినిబట్టి మల్లినాథు డియ్యెడ మూలాభిప్రాయమును వేఱొకరీతిని దెల్పె ననియు, 'లోకుల మాటలను విని, నేను మరణించితి నని యెంత మాత్రము తలంపవ' ద్దని యక్షుని మాటగా నెంచె ననియు దెలియుచున్నది. కాని 'మయ్యవిశ్వాసినీ మాభూః' అనుదానికి 'నాయం దపనమ్మిక పొందకుము' అనునదే సరియగు నభిప్రాయము; కాని 'నేను మరణించితి నని తలంపకుము' అనునది సరియైన యభిప్రాయము కాజాలదు. 'మయ్యవిశ్వాసినీ' అనునది నాయకుని తప్పును వ్యక్తముచేయునుగాని, లోకాపవాదమును వ్యక్తపఱుపదు. మఱియు యక్షుడు మరణించె ననెడి యభిప్రాయమే యక్షభామినికి గలిగినచో శ్లోకముయొక్క యుత్తరార్ధము సంగతము కాదు. అయ్యది యక్షు డన్యస్త్రీ సంగతుడు కాడని చెప్పుటకే సమర్థకమై యున్నదనుట సహృదయహృదయవేద్యము!

(౩) ప్రసిద్ధముగా నున్న మహాకవి కాళిదాసు కావ్యములలోను కొన్ని శ్లోకములు వేర్వేఱు పాఠములు కలిగినట్లును, విద్వాంసులు తమకు దోచినట్లు వానిని గ్రహించినట్లును క్రింది విషయమువలన దెలియుచున్నది.

రఘువంశము ౬-వ సర్గలోని—

'తం వీక్ష్య సర్వావయవానవద్యం
వ్యావర్తతాన్యోపగమా త్కుమారీ'

[పొందికగా నమరియున్న సర్వావయవములు గల యా యజమహారాజుం జూచి యిందుమతీదేవి వేఱొకరాజునద్దకు బోవలె నను నాశయమును మార్చుకొనెను]

అనునది ప్రత్యక్షదర్శనమువలన గల్గిన పూర్వానురాగమున కుదాహరణముగా రసార్ణవ సుధాకరమున జెప్పబడెను. కాని యిచట మల్లినాథుడు 'తం వీక్ష్య' అను దానికిబదులు 'తం ప్రాప్య' అనుపాఠమునే గ్రహించి 'త మజం ప్రాప్య' అని వ్యాఖ్య యొనర్చియున్నాడు. ఇచట 'తం వీక్ష్య' అనునదియే యుచితమగు పాఠముగ దోచుచున్నది.

(౪) షాడబము-

షాడబపదార్థనిర్వచనమును గూర్చి యీవఱకే పెక్కు వివరణములు వెలువడినవి. షాడబ ముపాహార మని కొందఱును, భక్ష్యవిశేష మని యొకరును, పానీయమని కొందఱును, ద్రవవ్యంజనవిశేష మని కొందఱు నభిప్రాయపడుచున్నారు. ఈ గ్రంథమునుబట్టి షాడబము ద్రవరూపమగు వ్యంజనవిశేష మనుట స్పష్టముగా దెలియుచున్నది.

'దధ్యాదివ్యంజనద్రవ్యై
శ్చించాదిభి రథాపరైః
గుడాదిమధురద్రవ్యై
ర్యథాయోగం సమన్వితైః
యద్వ్యత్పాకవిశేషేణ
షాడబాఖ్యోరసః పరః
నిష్పద్యతే............'

పెరుగు, చింతపండు, బెల్లము మున్నగునవి తగినపాళ్లుగా నుండి, పాకవిశేషమున దయారగు ద్రవము వ్యంజన మగుట స్పష్టము.

(౫) కరుణావిప్రలంభము.

విప్రలంభశృంగారభేదములలో గరుణవిప్రలంభ మొకటి యని యాలంకారికుల సిద్ధాంతము.

'యూనో రేకతరస్మిన్
గతవతి దేశాంతరం పున ర్లభ్యే.
విమనాయతే యదాన్యః
తదాస్యా త్కరుణవిప్రలంభోయమ్'

అను లక్షణమునుబట్టి యువతీయువకులలో నొకరు దేశాంతరమున కేగగా—పునరాగమాశయున్నపుడు కరుణవిప్రలంభ మగునని కొందఱి సిద్ధాంతము.

పయి యంశమునుబట్టి ప్రసిద్ధనాటకమగు నుత్తరరామచరిత్ర రసవిషయమును గూర్చి ఇదివఱకు పెక్కు వాదోపవాదములు వెలసియున్నవి. ఆ నాటకమున ప్రధానరసము కరుణవిప్రలంభ మని కొందఱి మతము; కరుణ మని కొందఱి యాశయము. రామునకు సీతాప్రాప్త్యాశ లేదనియు, ఆమె మరణించె ననియే యాతడు నిశ్చయించి

నట్లు 'క్రవ్యాద్భి రంగలతికా నియతం విలుప్తా' మున్నగు నాతని వాక్యములే తెల్పుచున్న వనియు గరుణరసవాదుల మతము. కాని యీరసార్ణవసుధాకరమును బట్టి చూచినచో నట్టి యాశయమున కెట్టి యవకాశము నుండదని స్పష్టముగ దెలియుచున్నది.

'ద్వయో రేకస్య మరణే
పునరుజ్జీవనావధౌ
విరహః కరుణోఽన్యస్య
సంగమాశానివర్తనః
కరుణభ్రమకారిత్వాత్
సోఽయం కరుణ ఉచ్యతే.'

అని యిందలి లక్షణము. ఈ లక్షణమునుబట్టి యువతీయువకులలో నొకరు మరణించినను, తిరిగి జీవించి వచ్చువఱకును రెండవవారికి గలుగు విరహము కరుణవిప్రలంభ మనియు, ఇది పునస్సంగమాశానివర్తక మగుటచే, కొందఱది కరుణమే గాని కరుణవిప్రలంభము గాదని భ్రాంతిగొందురనియు కర్త్రభిప్రాయమైనట్లు తెలియుచున్నది. మఱియు నీ గ్రంథమున దీని కుదాహరణముగా మన్మథమరణమున దుఃఖించు రతీదేవి యుదాహృతిగ నీయబడినది. పునరుజ్జీవనమున గరుణ విప్రలంభ మనియు, నది లేని యెడల గరుణమే యనియు వివరణమున స్పష్టీకరింపబడినది.

ప్రామాణిక మగు నీ రసార్ణవసుధాకరముంబట్టి యుత్తరరామచరిత్రమునందలి ప్రధానరసము కరుణవిప్రలంభమే యని నిర్ణయింప నెంతయు వీలగుచున్నది.

౬. రసాభాసము.

'ఏకత్రైవానురాగశ్చేత్
తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా,
యోషితో బహుసక్తిశ్చే
ద్రసాభాస స్త్రిధా మతః'

అనునది సర్వసాధారణమగు రసాభాస లక్షణము. నాయికానాయకులలో నొక్కరికి మాత్ర మనురాగ మున్నను, అనురాగము తిర్యక్కులయెడ గాని, అనాగరకులయెడగాని యున్నను, ఒకస్త్రీకి బెక్కుమందియెడ ననురాగ మున్నను రసాభాస మగునని దీని యభిప్రాయము. ఈ యంశమే రసార్ణవసుధాకరమున—

'శృంగారరసస్యారాగా, దనేకరాగాత్, తిర్యగ్రాగా, న్మ్లేచ్ఛరాగా చ్చేతి చతుర్విధ మాభాసభూయస్త్వమ్.'

అని పయి విషయమే తెల్పబడినది. సింగభూపాలు డిట్లు చెప్పుచు తిర్యక్కులకును, మ్లేచ్ఛులకును గల రాగము రస మగునే గాని రసాభాసము కాదని తెల్పిన ఏకావళీకారు డగు విద్యాధరుని మతమును ఖండించెను. అంతతో బోక—విద్యాధరు డట్లు చెప్పుట స్వబుద్ధివలన గాదనియు, తన ప్రభువును, శృంగారరసాభిమానియు, నుత్కళదేశాధీశుడు నగు నరసింహదేవుని యభిమతము ననుసరించియే యట్లొనర్చె ననియు, ఒడ్డెరాజుల కింతకంటె నెక్కువ రసికత యుండజాల దనియు దెలియపఱచెను. ఆ మాట లివి—

'భో మ్లేచ్ఛారసవాదిన్! ఉత్కలాధిపతేః శృంగారరసాభిమానినో నరసింహదే

వస్య చిత్త మనువర్తమానేన విద్యాధరేణ కవినా బాధ మభ్యంతరీకృతోఽసి.'

పయి యంశమును బట్టి కవులును, పండితులును తమ ప్రభువుల మెప్పుకొఱకు స్వకీయాభిప్రాయములను గూడ మార్చుకొని యాత్మవంచన మొనర్చుకొనుచుందురనియు, రసికులగు ప్రభువు లాయంశమును గమనింపకపోలే దనియు విద్వత్ప్రభు వగు శ్రీసింగభూపాలుడు చెప్పినట్లు స్పష్టమే కదా!

విషయవివేచనమునందువలె రచనా విశేషమునను దీనికి విశిష్టత కలదు. ఉదాహరణములను గ్రహించుటలో బెక్కుఱు పాతపద్ధతి ననుసరించి, ప్రాచీను లుదాహరించివానినే గ్రహించుట కాని, సాధారణముగా దృశ్యకావ్యములలోని వాని నుదాహరించుటకాని కానవచ్చుచున్నది. సింగభూపాలుడు దృశ్యకావ్యోదాహరణములకు నాటకాదులలోని యుదాహరణములను ఇచ్చినను తక్కిన రసభావాదికములకు మూడువంతుల ముప్పాతిక- కావ్యముల నుండి గ్రహింపబడినవానినే యుదాహరించెను. రఘువంశ-కుమారసంభవ - శిశుపాలవధాదులనుండియే పెక్కింటిని గ్రహించెను. నాటకములందును— మాళవికాగ్నిమిత్ర, శాకుంతల, విక్రమోర్వశీయములను బలుతావుల నుదాహరించెను. ఇతరులవలె బద్యములనే గాక, నాటక గద్యభాగములను గూడ—పఠితలకు సులభముగ నవగాహ మగున ట్లుదాహరించెను. ఇదియు నొక విశేషము. మఱియు నీ గ్రంథమునందలి యుదాహరణబాహుళ్యమునుబట్టి సింగభూపాలునకు గాళిదాసమహాకవియెడ గల గౌరవము సుప్రతిపాదిత మగుచున్నది.

# నవ్యకవితా తత్త్వము

శ్రీ దేశిరాజు కృష్ణశర్మ

"నానివాసమ్ము తొలుత గంధర్వలోక
మధురసుషమాసుధాగానమంజువాటి
ఏనొక వియోగగీతిక, నేను నిదుర
వెన్నెలల దారినొక రేయి వెడలిపోతి
నొక విపంచీవిరవాకంఠ మొకని రోయగని"

—కృష్ణశాస్త్రి

సమకాలీక కవిత్వంలోని మూలతత్త్వాన్ని తెలుసుకోవాలంటే, కవిత్వమంటే ఇదమిత్థమని నిర్వచనమున్న ఒకేఒక దృగాభిప్రాయాన్ని కలిగివుండటము విరమించుకోవాలి.

కవిత్వ మనేది బహుముఖాలూ, బహువ్యక్తిత్వాలూ కలిగిన ఒక పరమసత్యమని భావిస్తేనే తప్ప- బహుళవ్యాప్తమూ, సులభవ్యాసంగమూ అయిన నేటి కవిత్వతత్త్వాన్ని గ్రహించడము కష్ట మవుతుంది.

కవిఅంతశ్చేతనమందలి హద్దులు లేని చైతన్య విస్తరణంగా కవిత్వము అభివ్యక్తమవుతుందని అంగీకరిస్తే, కవి పొందిన ఆవిష్కారణమే కవిత్వ మవుతుంది.

ఈ ఆవిష్కారణము బాహ్యాభ్యంతరపు-చివరి విస్తరిల్లినప్పుడు—అభ్యంతరంలో—అంతరాంతరంలో ఒకానొక అచంచలమైన దృష్టి, శృతి వుండి అది బాహిరమైనప్పుడు ఒక రాగము, తాళము, లయలతో కూడి రూపవ్యక్తీకరణ పొందితే—అందలి తత్వము సుగమ మవుతుంది.

కర్త గాంచిన వికాసము—లేక ప్రతిభతో కూడిన వివేకము—అతని కార్యములో వ్యక్తమగునట్లు సాహిత్యంలోని వికాసము ఆ సాహితీకారుని వికాసాన్ని తెలియజేస్తుంది. ఈ వికాసము సర్వ సర్వత్రా అతని బాహ్యజీవితములో ప్రతిబింబించక పోవచ్చు. ఇందుకు కారణమూ, ప్రతిబంధకమూ—ద్విధా విభక్తమయిన మనస్సులో వున్నది. ఈ వికాసానికి మనస్సులో భూమిక ఒకటే అయివుండదు. ఆ వికసన మందలి గుణము పొందిన ప్రతిస్పందనాన్ని బట్టి ఆ భూమిక స్థితిని నిర్ణయించవచ్చును.

'గంధర్వలోక మధురసుషమాసుధా గానమంజువాటి' లోని ఒక వియోగగీతిక గా బయల్వెడలిన కృష్ణశాస్త్రికవితాధ్వనిలో మానవత్వపు పైభూమికయందలి స్పందనము అవరోహణము పొందుట వినిపించుచున్నది.

అసలు మానవచైతన్యానికి నిత్యమూ, ఒకానొక ఆరోహణావరోహణక్రీడ కలదు. ఆరోహణస్థితిలో మనస్సులో ఎగువ లోయలలోకి అధిగమించుట కలదు. అవరోహణస్థితిలో మనస్సులోని దిగువలోయలలోని అధశ్చేతనాన్ని పొందుట కలదు. అసలు మనస్సులో ఈలాటి నిచ్చెన కలదా అని సందేహిస్తే, సృష్టిలోనే ఇంతవరకు మూడు అంచెలుగా ఏర్పడివున్న జీవిత నిశ్రేణి ద్యోతకమగును. మొదటిది శుద్ధభౌతికస్థితి. రెండవది ప్రాణము. మూడవది మనస్సు. అనగా ప్రాణరహితముగా పైకి కనపడుతున్న వస్తుస్థితి యావత్తూ మొదటి భూమికలోనిదిగానూ, ప్రాణముకలిగిన పశుపక్ష్యాదులు రెండవ కక్ష్యలోనూ మనస్సు కలిగిన మానవుడు పైమెట్టులోనూ కనిపిస్తున్నారు. ఈ మనస్సుకు అన్నిభూమికలలోనూ ప్రసరించే శక్తి గలదు.

"పరస్మాత్ ప్రస్థితా సేయం
భూమికానాం పరంపరా
సోపానకల్పితాకారా
నిఃశ్రేణీ రివ నిర్మితా"

—"తత్త్వప్రభ"

చిత్ అనునది పరమునుండి బయలుదేరి భూమి కల వరుసరైన మెట్టులుగల రూపుగలదై నిచ్చెనవలె ఏర్పడియున్నది.

"వ్యక్తాని యాని తత్త్వాని
తురీయే ధామ్ని సన్తతం
తాని సుప్తాని భూలోకే
జడేస్మిన్ పాంచభౌతికే." —"తత్త్వప్రభ"

నాల్గవ స్థానమైన మహర్లోకమునందు (అనగా భూః, భువః, సువః - లోకములకు పైన గల మహర్లోకము) ఏతత్త్వముల చిదానందము వ్యక్తముగా ప్రకాశమానముగా నున్నదో, అది పాంచభౌతికమై జడమైయున్న ఈ భూలోకమునందు సుప్తములై అప్రకాశములుగ అణగియున్నది.

ఈలోకంలో సుప్తంగా నున్న చిదానందాన్ని వ్యక్తంగా ప్రకాశమానము చేయుటయే ఇందలి సర్వ కవిత్వ, కళ, శిల్ప, తత్త్వముల పరమలక్ష్యమని చెప్ప వచ్చును.

కృష్ణశాస్త్రి ఆగీతిక చెప్పినతర్వాత నవ్యకవిత్వము ఎన్ని దశాంతరదశలు పొందినది! ఆనాటి విరహ స్పందనము నేటివరకూ వినిపిస్తున్నదా!

అసలు ఆవిరహము నిత్యజీవితంలోని ప్రణయానుభూతికి చెందినదేనా ?

ఆ వియోగము గంధర్వస్థితినుంచి పొందిన ఎడబాటు. ఆ వచ్చిన దారి నిదురవెన్నెలల దారి. జాగ్రత్ స్థితినుంచి సుషుప్త్యవస్థకు పోవుదారి నిదురదారి. సుషుప్తిలో అంతశ్చేతనము మనస్సులోని ఎగువపాలి మేరలను దాటుట కలదు. అది వెన్నెలల దారి అయితే వికాసస్ఫూర్తిని పొందిన దన్నమాట. జాగ్రత్ సుషుప్త్యవస్థలలో ఒకే ఒక ఎరుకస్థితి నిలిచినచో, ఆపైన గల అతీతమైన తన్యస్థితికి సంబంధించిన గంధర్వస్థితికి నిచ్చెన వేసినట్టగును. యోగముద్వారా ఈస్థితిని అనుభూతికి తెచ్చుకొనవచ్చును. ఆ అనుభవము అంతరమునుంచి బాహిరమునకు తెచ్చుకొనుటయే యోగసిద్ధికి గమ్యమని శ్రీ అరవిందులు. కవిత్వము ఈస్థితిని సాధించగలుగునా! అసలు కవిత్వమువల్ల మనస్సులో నిచ్చెన వేయవచ్చునా!

కృష్ణశాస్త్రి, పైన చెప్పిన విరహమునే, అందలి హృదయరాగవేదనారేఖనే రమణీయముగా అభివ్యక్తము చేసినాడు.

నవ్యకవిత్వము ౧౯౧౩, ౧౪ లలో రాయప్రోలువారి తృణకంకణముతో ప్రారంభమయినదని స్వామి శివశంకరులు. తృణకంకణముతో వెలిగింపబడిన నూతనద్యుతి తర్వాతతర్వాత కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, నాయని సుబ్బారావు, అడివి బాపిరాజు, కాటూరి, పింగళి, నండూరి ప్రభృతులలో నవనవవికాసాన్ని పొందుతూ ఆంధ్రసాహిత్యంలోనే ఒక వెలుగును వ్యాపింపజేసినది.

తృణకంకణము కృతిసమర్పణంలో—

"శాశ్వతనవ్యస్ఫురణల
నశ్వరలావణ్యమై పెనగ, కావ్యకళా
విశ్వమునం దానందర
సైశ్వర్యము లేలు కవిత—"

అన్నారు. అనశ్వరలావణ్యాన్ని కలిగిన కవిత మానవునిలో అనశ్వరలావణ్యాన్ని నిలుపగలుగునా? నవ్యకవిత్వపు భవిష్యత్తు ఈ సమాధానముపై ఆధారపడివున్నది. స్వచ్ఛమైన ఆనందరసైశ్వర్యము మనస్సును అధిగమించిన విజ్ఞానమయభూమికలోనిది అయినప్పుడే అది అనశ్వరలావణ్యముతో పెనగి వుంటుంది.

నవ్యకవిత్వానికి సుస్పష్టము గానట్టి ఆదర్శమిదియే. అందలి తత్త్వమిదియే. ఈ తత్త్వమునకు గమ్యము అమృతత్వము. మార్గము రసపరిప్లుష్టము. కవికి రంగస్థలాలూ పరికరాలూ అని చెప్పదగిన మనస్సు, హృదయాలలో సత్యమై, ఓజమై, మధురమైన ఈ త్తమ పరిణామం తెచ్చుటే నవ్యకవిత్వప్రథమ కర్తవ్యము.

నవ్యకవిత్వములో—పెద్దలు కొందరి కావ్యములలోనే ఈ తత్త్వమూ—ఆదర్శమూ ఛాయామాత్రంగా తెలుసుకోవచ్చును. నవ్యకవిత్వపు ప్రధాన

లక్షణాలలో ఒకటి కవి దృష్టి బాహ్యమునుండి అంత ర్ముఖమగుట. ఈ అంతర్ముఖతయే తత్త్వమునకు సునిశి తత్వాన్ని ప్రసాదించునది; మనోవికసనానికి దారి తీయునది.

ఈ అంతర్ముఖతలో గోచరించిన స్పష్టమైన ఛాయలు—(౧) స్త్రీపురుషుల బాహ్యసౌందర్యాన్ని వర్ణించుటకు బదులు వారి ఆత్మగుణసౌందర్యాన్ని చెప్ప డము. (౨) స్వవిషయాలలోని కష్టసుఖములలో ఆర్ద్రి తనూ, భావోన్మీలనమూ కలిగించుట. (౩) జీవితంలో ఒకానొక దర్శనమార్గాన్ని తెలియజెప్పుట. (౪) ప్రకృతివర్ణనలలో మానవసౌకుమార్యాన్నీ, మానవాతీత వికసనాన్నీ తెలియజెప్పుట. (౫) సాంప్రదాయ సిద్ధిమూ, జాతివికాసదోహదమూ అయిన సంస్కార దృష్టిని కలిగించుట—మొదలగునవి.

ప్రబంధయుగంలో స్త్రీల సౌందర్యము ప్రధా నంగా అంగాంగవర్ణనలో వ్యక్తము చేయబడ్డది. నవ్య కవిత్వంలో—

"ఆమె నవనీతహృదయ—నా అంతరంగ
శాంతిదేవత—ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము, ప్రేమజీవనవిభాత
కైశికీగీతి, నాతపఃకల్పవల్లి."

(వేదుల—'వైతాళికులు' పే. ౭౨)

"ఆమె కన్నులలో అనంతాంబరంపు
నీలినీడలు గలవు.

వినిర్మలాంబుపూరగంభీరశాంత
కాసారచిత్రహృదయములలోని
గాటంపు నిదుర చాయ లందు
నెడనెడ గ్రమ్మ—
ఎదలోపలి రొదలో, నె
మ్మదిలో, జీవితరహస్యమార్గమ్ములలో
వదలని కోరికనై, నా
బ్రదుకు బరువు లెల్ల పాట పాడింతుసఖీ!"

(కృష్ణశాస్త్రి—ఊర్వశి)

అనలీభావమే అంతకుముందు అపరిచితము. ఏదో పారిభాషికపదములను వాడిన ట్లుండును స్థూల దృష్టికి. ఎదలోపల రొదలోని సుప్తచైతన్యాన్ని కద లించబూను పాఠకునికి, ఆదిలో కొంతవరకు దారి అగ మ్యముగా నుండునట్లు, పాఠకునికి ఈ దారి సుగమంగా కనిపించక పోవచ్చును.

ఈ వివిధవర్ణనలలో ఒక విశిష్టత కలదు. ఒకా నొక నాయికయందు ప్రీతి ఆమెయందు గల గుణవిశేష తను బట్టిగాని రూపవిశేషతనుబట్టి కాదని తెలియును. కన్నులు హృదయానికి అద్దములు. నీలినీడలు శోకసూ చికములు. శోకమగ్నమైన హృదయము అలజడి పొందకుండ గంభీరతనూ, శాంతమునూ కలిగివుండుటయు ఉత్తమలక్షణమేకదా. ఒక భావాన్ని తదనుగుణమైన వస్తుచిత్రములద్వారా స్ఫురింపజేసే వ్యంగ్యాన్ని భావ చిత్రణ మనవచ్చును. ఈ గేయంలో చిత్రాలు—ఒకటి అనంతమైన ఆకాశంలోని నీలినీడలు; రెండవది వినిర్మ లాంబుపూరగంభీర శాంతకాసారము.

ఒకానొక వస్తువుకు బదులు మరియొక భావ మునే స్ఫురింపజేయు భావధ్వని తన సఖి వదలని కోరిక లాగా వున్న దనడములో కలదు.

అసలు నవ్యకవిత్వంలో బహుకొద్దిమంది వ్రాసిన శృంగారరచనలలో మాత్రమే ఉదాత్తభావోన్మీలనం వుపదిష్టమయినది. పశువృత్తులను ప్రేరేపించు క్షుద్ర శృంగారరచన మనస్సులోని అవరోహణస్థితిని నిరూ పించు ననుటలో సందేహ ముండనక్కరలేదు.

నాయని, కృష్ణశాస్త్రి, వేదుల ప్రభృతుల రచనల లోని శృంగారము ప్రధానంగా విప్రలంభమయి— అందులోనూ ఉదాత్తమనఃఫలకంలోని ఆరోహణస్థితిని తెలియజేయును. వారి ఉత్తమసంస్కారాన్ని కూడా వ్యక్తము చేయును.

"నీవలపుకోలంపు సోకిననె,
ప్రాణసఖీ, బ్రతుకెల్ల కోటిగొం
తులు విడి సోనలై పొరలు
నూతనగీత సుధాపథాలలోన్".

—కృష్ణశాస్త్రి

"అంత శ్రమపడి పావన మభ్రగంగ
ధారుణికి తెచ్చినాడు భగీరథుండు

మత్పురాణేకపుణ్యజన్మములు పండి
జాహ్నవీస్వచ్ఛపుసుధాస్వాదుమూర్తి
వైన నీ దివ్యసాన్నిధ్య మందుకొంటి
పురమికిక్ స్వర్గమున కొక్క ముడి ఘటించి."

—నాయని

ఈ విధప్రణయదృక్పథమే నూతనమానవత్వ పరిణామానికి దారితీస్తుం దంటాను. ఈ విధమైన సుకుమారప్రణయస్పందనమే నవ్యకవిత్వంలో బహుళంగా పరివ్యాప్తమయినది—నవ్యకవిత్వానికి ప్రాముఖ్యతనూ విశేషాదరాన్నీ సంపాదించినది ఈ విధమైన శృంగార రచనలే. నండూరివారి ఎంకిపాటలు, విశ్వనాథుని గిరికుమారుని ప్రేమగీతాలు, శివశంకరుల హృదయేశ్వరి, నాయని సౌభద్రుని ప్రణయయాత్ర, వేదుల దీపావళి, కృష్ణశాస్త్రి ఊర్వశి-ప్రవాసమూ నవ్యసాహిత్యంలో చిరమైన స్థానాన్ని సంపాదించుకొన్నవి. నాయని సుబ్బారావులో ప్రణయము అమర్త్యపుహద్దులను తాకినట్లుండును.

"వత్సలాఫాలమున నెలవంకగురుతు
కందళించి వికాసించి కళలుజేరి
తరుణశారదరాకాసుధాకరాచ్ఛ
బింబము లనంతములు లెక్కపెట్టుకొనెను
ఈ అమర్త్యాచ్ఛచంద్రిక లెన్నినాళ్లు
నాతనువు ముంచుకొను నన్నినాళ్లు ఒక్క
ఈశ్వరశ్రీమి నాది సదాశివత్వపదవి—
నీవు దేవివి నేను నీ సేవకుడను."

—సౌభద్రుని ప్రణయయాత్ర.

అను దాస్యభావమునూ చూపించినాడు. ఈ విధంగా "నాయని లౌకికశృంగారస్థాయిదైన మానవుని అధిగమించిన అలౌకికరసానందమునకు దివ్యమానవుని ఛాయామాత్రంగా లీలగా ఒకేముఖంలో దర్శించినాడు. కృష్ణశాస్త్రి జీవితదృక్పథమే రసవంతము. స్వతస్సిద్ధమూ, మనోజ్ఞమూ అయిన ఆనందమయ ఆవరణాన్నించి అక్షేయమయిన సంభవమేదియో పట్టి క్రిందికి గిరాటుపెట్టబడిన మానవుని ఆవేదనాన్ని ప్రస్ఫుటంగా, రమ్యంగా, తీవ్రంగా వ్యక్తంచేసినాడు." ఈ మాటలు ఈ రచయిత వేరొకచోట చెప్పినవి.

జీవితంలో మాధుర్యదర్శనాన్ని కలిగించే ప్రణయంతోపాటు ప్రశాంతగంభీరతనూ, అచంచలమైన ఉదాత్తతనూ ప్రసాదించే తాత్త్వికదర్శనాన్ని కూడా ఈ కవులు వ్యక్తీకంచేసినారు.

"ఉదయసంధ్యానవాంశువు లరుమ దద్ద
రిల్లి అశాంతములనుండి మెల్ల మెల్ల
కుంచుకొనిపోవు నీ నీడకొనలవెంట
చేరికొందును నీపదాంభోరుహములు."

—'నిత్యక్రీడ'లో నాయని.

వ్యక్తిగతస్వాభిలాష అనురక్తులతో ప్రారంభమైన జీవితము ఉదయము కుంచుకొనిపోయిన నీడవలెనూ, మధ్యాహ్నము 'ప్రణయభావాతిమధుర విశ్రాంతికొరకు'గా శరీరాంచలము లంటిపుండు యవ్వన స్థితిని స్ఫురింపజేస్తూ, సాయంకాలానికి, అనగా వృద్ధాప్యానికి—

"అపరసంధ్యార్ద్రరోచుల నమృతరాగ
మంజురంజితమై సాగి, మరల దిసలు
క్రమ్ముకొనిపోవు నీనీడ కలసి వెడలి
ఆ యనంతదిగంతమ్ము లావరింతు."

నటులలో ఆత్మాన్వేషణముయొక్క పర్యవసానము విశ్వాత్మతో మేళనమొనర్చుటే అను అద్వైతత్వమూర్తి ధ్వనించుచున్నది.

నాయని చూపించిన దాస్యభావముకంటె భిన్నమయిన ఆరాధనభావమును వేదుల చూపించినాడు.

"ఆ మెవదసన్నిధానదివ్యస్థలాన
నాకకల్లోలినీపదన్యాసమునకు
దరవినతమైన హరజటాభరమువోలె
నకుడ నయ్యుక్క మహామహోన్నతి వహింతు"

స్త్రీప్రకృత్యారాధనమువల్ల పురుషునిలో గల స్వాతిశయము తగ్గి అహంరహితమైన అనురాగము హద్దులు దాటి ప్రజ్వరిల్లుతుంది. భవిష్యత్తులో నవ్యమానవావతరణమునకు నాందీప్రస్తావన నవ్యకవిత్వము చేసింది.

తన సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని తన హృదయంలోనేగాక ప్రకృతిలోగూడా చూడగలిగే

సామంజస్యము, విశిష్టవిషయాన్ని సాధారణీకరించు విశాలదృక్పథమూ నవ్యకవితలో కలవు.

"నావిరహగంధగీతి కన్వయము చెప్ప
శిరసు లెత్తుచునున్నవి చిగురుపొదలు
నవ్వుచున్నది కడలి నందంపు సంజె
కావిరంగుల రంగైన కోవి విరిచి."

—రాయప్రోలు.

"శారదనిశాంతరమణీయసాంధ్యరాగ
విమలపథముల నీవాడు వెల్లివిరిసె
నీప్రణయరాగ మెల్లెడ నిండుకొనియె
ఆ దెసగిరివచ్చు పూర్వదిశాభిముఖము
లైన పులుగుల రెక్క లల్లార్పులందు
మధురకంఠధ్వనులయందు మాటలందు
నీబయలుదేరు సంగతి నే గ్రహించె.

ఈమనోజ్ఞ కార్తికపూర్ణి మామహోద
యావసరమున పొంగి బ్రహ్మాండమంత
దైన నాఆత్మలో భవదమృతమూర్తి
నిరుపమవిలాసలేశముల్ పారలిపోయి"

—నాయని.

తనచుట్టూ వున్న ప్రకృతిలో తనను చూచుకొనడంలో గల తత్వ మటుంచి అది పరిణతస్థితిని పొందిన మానసికవికాసాన్ని తెలియజేస్తుంది.

అసలు సృష్టిరహస్యాన్ని వ్యక్తంచేసే పరిణామ సిద్ధాంతాన్ని విశ్వనాథ ఆదిలో అంగీకరించినాడు.

"నేను మాయమ్మ యొడిలోన నింతవాడ
నైనయపుడు నాలోన నీఅఖిలమిపుడి
యుండెగావలె నేటి కిట్లువికివచ్చి
చిత్రచిత్రభావాకృతుల్ చెలువుమిగిలె.

పాడుటకు మున్ను కంఠగర్భమున నెలుఁగ
రాక అవ్యక్తమై యున్న రాగమట్లు
నిభృత-చిక్కణమూర్తులు నీవు నిసువు
లిన్ని సుఖములు దాగినా రెటుల దేలి ?
అస్మదీయహృదబ్జనాళాంతరమున
బీజరూపమ్ముగా నుండి విశ్వమింత
ఇది బహిర్గతమగుదాక రెలుఁగలేన
అంత నవ్యక్తశిసుమూర్తి నైతి నెట్లు—"

ప్రకృతిలో అవ్యక్తముగా నున్న స్థితిని వ్యక్తముచేయుట పరిణామప్రక్రియ. ఈ పరిణామము అసమగ్రతలోనుంచి సమగ్రతకూ, అపరిపూర్ణతలో నుంచి పరిపూర్ణతకూ దారితీయును.

"అన్నా ద్వికాసః ప్రాణస్య,
వృక్షాదౌ దృశ్యతే యథా,
మానుష్యేచ మనసో
వికాసశ్చ తథాస్ఫుటః
విజ్ఞానస్య వికాసః స్యా
దితి ఊర్ధ్వం భువీహ నః
యస్మిన్ సిద్ధే భవే త్సిద్ధం
దివ్యత్వం మనుజన్మనః"

—"తత్త్వప్రభ"

—"అన్నమునుండి ప్రాణవికాసము ఎట్లు వృక్షాదియందు కనపడుచున్నదో, అట్లే మానవ జాతియందు మనస్సుయొక్క వికాసము స్పష్టముగ నున్నది.

ఇకపైన భూమియందు విజ్ఞానవికాసమే కావలయును. ఆ విజ్ఞానవికాసము సిద్ధమగునప్పుడు మానవునకు దివ్యత్వము సిద్ధమగును."

నేడు అవ్యక్తశిసుమూర్తిగా నున్న మానవుని లోనుంచే భవిష్యత్తులో పరిపూర్ణవ్యక్తిత్వము ఆవిష్కరణము జరుగవలసియున్నది.

"కవిమనోభావముగాని, కావ్యమునందలి విషయముగాని సహృదయసాపేక్షము. మానవజీవితమునం దేది శాశ్వతమో అది రసము నంటిపెట్టుకొనియున్నది. అది అపరివర్తనీయము. మానవులందరకును శాశ్వతమగు నొక ప్రకృతి కలదు. దాని నంటుకొని మరికొన్ని ప్రవృత్తులు కలవు. అవియు అపరివర్తనీయములు. ఆ ప్రవృత్తులవలన కలిగిన భావములప్రకాశమున కాలంబనము కావలయును. ఆ యాలంబనము చుట్టును భావసమూహము వికసించును"—వేలూరి శివరామశాస్త్రి గారు.

ఈ ఆలంబనము కవిపరంలో ఉత్తమప్రతిభ ఉపజ్ఞలు. సహృదయుని పరంలో సాపేక్షమయిన ఆర్ద్రమయిన హృదయము.

ప్రతిభా ఉపజ్ఞలచే వికసింపచేయబడిన భావ సమూహముచే రసోత్పత్తి గలిగి, 'భగ్నావరణచిద్విశిష్టరసః' అను సూక్తి ననుసరించి,మనస్సులో ఆవరణములు తొలగింపబడి ఆరోహణస్థితి ఏర్పడును.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రామాయణకల్పవృక్షమును "అకాలాద్యనవచ్ఛిన్నమ్ము సచ్చిదానంద సంపచ్చయమ్ము, అద్వితీయ మేక"మయిన ఆత్మనిత్యత్వాన్ని పునరుద్ఘాటించుటలో ప్రారంభించినారు. ఇంతవరకు ఏ రామాయణములోనూ చేయని ఈ నిత్యాత్మసూత్రప్రతిపాదనంతో ఈ కావ్యారంభము చేయుట ఎందులకు ? నేటి కాలంలో దేహాత్మవాదులు ప్రతిపాదించిన రాజకీయఆర్థికతత్త్వవిజృంభణంతో విస్మరించబడినట్లయిన ఆత్మజ్ఞానమును మరల సిద్ధాంతీకరించుటకే ఈ కావ్యమును చెప్పుట అని భావించవలసియుండును.

ఈ కావ్యములో వస్తువు పురాతనము. రచన ఆధునికము. నవ్యసాహిత్యలక్షణాలలో ప్రథమ మన దగిన ఆత్మగుణసౌందర్యాభివర్ణనము. ఈ కావ్యములో రామణీయకతనందినది.

"కౌసల్యముక్తి కాంతా సమానాకార
నలిసుమిత్ర ఉపాసనాస్వరూప
కైకేయిమధుసామగానమూర్తి
కౌసల్యనదశరథాత్కాలమందాకిని
కైకేయి సుమనల్లకల్పవృక్షూ—"

శ్రీరామచంద్రునకు జానకీదేవి ప్రథమదర్శనములో

"ఇదమిత్థమని నిర్ణయింపగారాని దే
కోర్కిరెవో రూపుగైకొన్నయట్లు
జన్మజన్మాంతరసంగతంబైన ఆ
శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికి వచ్చి ముగ్ధాకార
మెనయించి దర్శన మిచ్చినట్లు—
దృగింద్రియగతపరమార్థమగుచు
హృదయపక్ష్మమై రక్తరుచిరినిలీన
వేగమాధుర్య పరసీమరై గవేషి
తార్థసంప్రాప్తిరై దర్శనాధ్వమెుదిగె"

ఈవిధమైన అంతర్ముఖతలో మహాయోగసాధన కలదని చెప్పవచ్చు. ఒక యుదాత్తమయిన భావము యోగసాధనలో సాధకుడు దర్శించు ప్రతిస్పందనము వంటిది. ఆభావముయొక్క గుణనిర్దేశమునుబట్టి కవితా సాధనమందలి లక్ష్యశుద్ధిని తెలుసుకొనవచ్చును.

నవ్యసాహిత్యంలో ప్రధానంగా కనిపిస్తున్న విప్రలంభశృంగారానికి అన్వయము వ్యక్తిపరంగానూ, దేశస్థితిసంఘస్థితుల పరంగానూ చెప్పవచ్చును. కృష్ణశాస్త్రి కృష్ణపక్షము నాటి దేశదుస్థితికి సాంకేతిక మనవచ్చును. వేదుల 'దీపావళి' మానవహృదయంలోని ఆరిపోని మధురమైన ఆశాజ్యోతి. ఈయన ఆహ్వానము అమృతకాంతికి, దివ్యకాంతికి. ఈయన ఆశాగానము, ప్రభు, ముక్తావళి, నిరీక్షణము,—ఈవిధ ఉత్కంఠాప్రస్ఫుటాలు.

జీవితకాంక్షనూ, ఆదర్శాన్నీ ప్రేయసిగా, స్వప్నరాజ్ఞిగా భావించి విరహాన్ని పొందుట ఒకవిధ ప్రణయలక్ష్యము. ఒకానొక భక్తుడు తన దైవాన్ని ప్రణయాధిదేవతగా ప్రియతమునిగా భావించునట్లు, కవియు తన లక్ష్యాన్ని ప్రేమమూర్తిగా చూడటం కలదు. నవ్యకవిత్వంలోని విప్రలంభము కేవలము వ్యక్తిపరంగానే అన్వయం అయ్యే పక్షంలో ఒక్కొక్క కవిలో ఒకానొక జీవితదృక్పథం ద్యోతకమగును.

కృష్ణశాస్త్రిలో, కాంక్షా వైఫల్యంవల్ల వైక్లబ్యం కలిగి దుఃఖానుభూతిని చెందిన హృదయం అనుతాపాత్మకమగుట (కన్నీరుపాటలు), అతిలోక సౌందర్యరసపిపాసలకు తోడు హద్దులు త్రెంచుకొని పారుటకు ఉద్యమించు స్వేచ్ఛాజీవనవికాసము సుస్పష్టంగా తెలుసుకొనగలము.

వేదులశాస్త్రిలో నిరాశను ఆశతో చూడటము, కాఠిన్యాన్ని కరుణతో చూడటము తెలుసుకుంటాము,

రాయప్రోలు సుబ్బారావుగారిది మధురదర్శనం. విశ్వనాథవారిది అతిరూతచింతనతో కూడిన మనోదర్శనం. కాటూరివారిది త్యాగ-అహింసల దర్శనం. నవ్యసాహిత్యాచార్యులు స్వామి శ్రీ శివశంకరులు, నోరి నరసింహశాస్త్రులలో భిన్నదృక్పథాలు గోచరించును. ప్రకృతిమాతృదేవ్యారాధనతో ప్రారంభమయిన నరసింహశాస్త్రిగారి కవితాదర్శనము క్రమేణా ఆర్షత్వము నలవరించుకొని శ్రీచక్రారాధనంలో సునిశితత్వాన్ని పొంది దేవీభాగవతరచనలో సనాతననాగరికతకూ సంస్కృతికీ వ్యాఖ్యానము చెప్పించుచున్నది.

స్వామి శివశంకరుల రచనలలో ఆదిలో స్త్రీమూర్తి ఆలంబనముగానున్నా, క్రమేణా జగన్మాత, ప్రస్తుతము అర్ధనారీశ్వరులు ఆలంబనముగా కనిపించును. ప్రారంభములో ప్రియాన్వేషణం చేసి, రాధాతత్వము గ్రహించి, 'సహజయానపంథ' సాధన చేసి, కృష్ణప్రేమ ననుభవించి జగదంబాదర్శనాన్ని లక్షించి, ఇప్పుడు ప్రత్యభిజ్ఞారూపమైన శివస్వరూపదర్శనాన్ని సాధిస్తున్నారు.

నవ్యకవిత్వం తెచ్చిన నవ్యతను గురించి ఇంతవరకు చెప్పినది ఉపోద్ఘాతంగానే భావించుకొనవలసియుండును.

సాహితీసమితితో ప్రారంభమయిన నవ్యత చాలా పరిణామము చెందినది. నాటి నవ్యత నేడు మృగ్యము. నాటినుంచి నేటివరకు ప్రవర్తిల్లిన కవిత్వచరిత్రను ప్రస్తావించుటకిది నాందిగా మాత్రమే ఉపకరిస్తుంది.



# హోళికా పూర్ణిమ

[కథానిక]

శ్రీ రా. పీ. ఆంజనేయశాస్త్రి

ఏకాదశినుంచే రంగులు చల్లుకోటం ప్రారంభించారు కొద్దికొద్దిగా. చతుర్దశినాటికి తెల్లచొక్కా హిందువు బజార్లో కనిపిస్తే ఒట్టు. ఆ మార్వాడీల వీథిలో ప్రతి మేడమీదా పీపాలకి పీపాలు రంగునీళ్లు పెట్టుకుని, పిచికారీలతో దారినపోయే మనుష్యుల్ని తడిపి ముంచెత్తుతున్నారు. కాస్త ఎరిగున్నవాళ్లు కనిపిస్తే "ఎక్కడనుంచీ రావడం?" అంటూ ఓ క్షణం నిలవేసి, పంట్లాంజేబులోంచి తడిరుంకం చాటుగా తియ్యడం, మొహమంతా పట్టించడమూను! కొంచెం ఆకతాయిమూక నూనెల్లో రంగులు కలిపి తలంట్లు పోసుకున్నా కూడా పోకుండా ఉండేట్టు ఒక పేరంగు వెయ్యటం ఒక్కంతాను!!

సీతాకోకచిలకల్ని ఒంటిమీద సందులేకుండా పరుచుకుని కిలకిలలాడుతూన్న చందమామలల్లే మేడల వసారాల్లో యువతులు తిరుగుతున్నారు. చిన్నకారు పిల్లలు విరిగిన కుర్చీలూ, బల్లలూ, దర్వాజాలూ కూర్చి హోళికను తయారుచేస్తున్నారు వీథిమొదట్లో, దహనం చెయ్యటానికి. చందాలు పోగుచేసి కొనుక్కొచ్చిన కర్ర చాలనట్టుగా యింటింటికీ పోయి తెస్తున్నారుకూడాను అడిగీ, అడక్కుండా. ఆడవాళ్లు అడ్డపెట్టినా, యింట్లో పిల్లలు చాటుచాటున అందిస్తున్నారు మొగవాళ్లు చూసీచూడనట్టూరుకోటంచేత. ఇంటికొచ్చిన పిల్లలమీద రంగునీళ్లు తడిసి ముద్దయేటట్టు చల్లి, వాళ్లచేత మళ్లీ చల్లించుకుని, విరగని వస్తువుల్ని కాస్తో కూస్తో విరిచి పరిచేసిన ఏకొయ్యవస్తువో యిచ్చి పంపని యిల్లే లేదు...

షేక్ గులాంమహమ్మద్ నెరిసినగడ్డము, కుచ్చుటోపీ, గోధుమరంగు షెర్వానీ, తెల్లటి పైజామా, వెండిపొన్నుకర్రా ఆయనా చెక్కు చెదరకుండా అప్పుడే యింటికొచ్చాడు. ఎంత పెద్దఉద్యోగం చేసినా నమాజు మానేసిన పాపాన పోలేదు ఆయన. చిన్నపిల్లలిక్కూడా తెలుసు ఆయనమీద రంగు చల్లరాదని. "ఆయనేం ఆకాశంలోంచి ఊడిపడ్డాడా? మన ఊళ్లో మన వీథిలో మన యిళ్ల మధ్య యిన్నేళ్లనుంచీ వుంటూ, మన పండగలో రంగునీళ్లు కాసిని చల్లించుకుంటే తప్పేమొచ్చిందేమిటి?" అని నిరుడు పండగల్లో ఓముఠాగా కొంతమంది యువకులు ఆయనింటికెళ్లేసరికి, ఆ మేడమీదనే వుంటున్న బన్సీలాల్ వారించాడు. గులాంమహమ్మద్ మటుకు జరుగుతున్న విషయమంతా విని ఊరుకున్నాడు తప్పితే "ఫరవాలేదు చల్లండి." అనలేదు. ఈయేడు ఆయన్ని పొంతం ఒదిలిపెట్టారు అంతా కూడాను.

ఫయాదామటుకు యీరంగునీళ్ల పరదాలో చిన్నప్పటినుంచీ మునిగితేలే మనిషే. "ఏం నాన్నా, నేను చల్లనా మీమీద మరి?" అని అంది యీయేడు గులాంమహమ్మద్‌తో. "మన మతంలో లేదమ్మాయీ" అన్నాడు గంభీరంగా. "ఒద్దని వుందేమిటి మరి?" అని మళ్లీ అడిగింది పెంకెగా. "అందుకనేగా నువ్వు రంగునీళ్లు చల్లుతున్నా, చల్లించుకుంటున్నా నేను ఊరుకుంటున్నా" అన్నాడు చాకచక్యంగా.

"మరి మీమీద చల్లనియ్యరేం ?" అని ఎదురు ప్రశ్న వేస్తున్న కూతుర్ని వీపుమీద చేత్తో నిమురుతూ "మొత్తంమీద నువ్వు వాళ్లల్లో కలిసిపోతున్నావులే... సరేకాని...నమాజు వేళయింది.. నీళ్లు తీసుకురా... కాళ్లు కడుక్కుంటానికి..." అని మాట తప్పించేశాడు గులాంమహమ్మద్.

"ముందొచ్చిన చెవులకన్న తరవాతొచ్చిన కొమ్ములు వాడి" అన్నట్లు మతంపట్టుదలల్లో గులాం మహమ్మద్‌కీ యితరసాహెబులికీ ఏమీ సరిపడేది కాదు. తా పెరిగినంతవరకు తన ముత్తాతలముత్తాతలు కూడా మహమ్మదీయులేననీ, భారతదేశంలో వుండే యితరమహమ్మదీయుల్లా తన పూర్వీకు లెవరూ హిందూమతంలోని ముస్లింమతం అవలంబించినవాళ్లు కారనీ గులాంమహమ్మద్ సగర్వంగా చెప్పుకుంటూ వుండేవాడు. ఆమాట వినేసరికి యిక్కడి సాయిబులికి చుర్రుమనేది. కురాన్‌షరీఫ్ ఆయనకి మంచి నీళ్లప్రాయం. అవును మరి! వాళ్ల నాన్న చిన్నప్పుడే నూరిపోశాడు. మొదట్లో ఆయన ప్రతిశుక్రవారమూ పెద్దమసీదు కెళ్లేవాడు. "మౌల్వీ! మౌల్వీ!" అంటూ గౌరవంగా చూసేవాళ్లు కూడాను తక్కిన ముస్లింలు. మూడేళ్ల కిందట ఊళ్లో హిందూ ముస్లింకొట్లాటలు ప్రారంభమైనప్పుడు చదువుకున్నవారుకదా అని ముస్లింలంతా యీయనసలహా అడిగారు. "మతంపేరుతో ఒకళ్ల నొకళ్లు చంపుకోటమంత మహాపాతకం యింకోటి లే"దని స్పష్టంగా వాళ్లతో చెప్పేసరికి, యీయనమీద వుండే గౌరవం సన్నగిలింది వాళ్లకి. వాళ్లు యింకా తక్కువ చదువుకున్న వాళ్ల నాయకత్వంకిందా, అసలు చదువుకోనివాళ్ల అధ్వర్యంకిందా దోపిడీలూ, దహనాలూ, హత్యలూ సాగించారు. ఆ అల్లర్లలో ఓశుక్రవారంనాడు మసీదులో గులాంమహమ్మద్‌ను ముస్లింలంతా చుట్టుముట్టి నిలవేసి అడిగారు—"నువ్వు ఆ మార్వాడీవీధిలోంచి ఎప్పుడు వెళ్లిపోతావు ?"అని.

"ఎందుకూ వెళ్లిపోవడం ?"అని అడిగాడు ఆశ్చర్యంగా. ఆమాటకి ముఠానాయకుడు విరుపునవ్వు నవ్వి "ప్రాణాలు దక్కించుకుంటానికి..."అని జవాబు చెప్పాడు. అతని పేరు గజనీ. అతని తాతలు ముగ్గురిలో యిద్దరు హిందువులే. వారి సంతానంకూడా పంజాబులో యిప్పటికీ వుంది. ఇతని ముత్తాత నవాబు దర్బారులో చేరి నవాబుప్రాపకంకోసం ముస్లింమతం స్వీకరించి ఓ జాగీరు సంపాదించాడు. మతం మార్చగానే భార్య తన బిడ్డల్ని తీసుకుని పుట్టింటికి పోయింది. భర్త ఓదాసీదానికి యిస్లాంమతం యిప్పించి పెళ్లిచేసుకున్నాడు. ఆమెకి పుట్టినవాడే గజనీతాత. తాత తండ్రులతోనే జాగీరు అంతమైనా, గజనీకి మటుకు జాగీర్దారీఅలవాట్లూ, మూర్ఖత్వమూ మటుకు పోలేదు. ఉర్దూ మాట్లాడటం మాత్రం ఒచ్చుతప్పితే, పట్టుమని పదిబంతులు రాయలేడు. కురానుగిరానుతోనూ, నమాజు గిమాజూతోనూ ఏమీ అతనికి సంబంధం లేదు. హిందూముస్లింకొట్లాటల్లో మటుకు మతోద్రేకాన్ని రెచ్చగొట్టి దోపిడీలు పురిగొల్పి లూటీసామాన్లు జాగ్రత్తగా దాచెయ్యడంవల్ల యిటీవల గజనీ ఓ పిల్ల జాగీర్దారై పోయాడు మళ్లా.

గజనీ వ్యంగ్యపుపలుకులూ, అతని కుచ్చితపు నవ్వూ గులాంమహమ్మద్‌కి అసహ్యం వేశాయి. చీదరించుకున్నట్లుగా చూస్తూ "నేను వచ్చేది ఒక్కమాటే..."అన్నాడు.

"కాని ఆ చావడం యివాళా రేపా అని" అంటూ గద్దించాడు గజనీ...

"నీకు జవాబు చెప్పక్కర్లేదు నేను" అన్నాడు గులాంమహమ్మద్ యీసడింపుగా. తమ నాయకుణ్ణి యింత చులకనగా మాట్లాడటం గుంపు సహించలేకపోయింది. గజనీ పళ్లు పటపటలాడిస్తూ "నాకు సమాధానం చెప్పనివాళ్ల గతేమయ్యేదీ పట్నంలోని ప్రతి ముస్లింబిడ్డకీ తెలుసు ముసలికుక్కా!" అన్నాడు. అంత పండితుణ్ని "ముసలికుక్కా!" అని తమ నాయకుడు అన్నందుకు గుంపంతా ఫక్కున నవ్వింది. గజనీకీ నవ్వొచ్చింది. గులాంమీద కోపమంతా పోయినట్టు వీపుమీద చెయ్యివేసి నిమురుతూ "మీరు హిందువుల వీధిలో వుంటే ఎప్పుడో అప్పుడు వాళ్ల చేతుల్లో పడి

ప్రాణాలు ఒవలకతప్పదు...అందుకని" అంటూ ఏదో సలహా చెప్పబోతున్న గజనీని వికుల్చుకుంటూ...

"ఈముసలితక్కను చంపే హిందువు ఎక్కడా వుండదు. ఈపట్నంలో అసలే లేదు. ఆఖరికి ముమ్మాటికీ లేదు..."అని లేచాడు గులాంమహమ్మదు.

"ఇలాంటి పిచ్చిచేష్టలు చేసే వక్కలికి జవాబు చెప్పేందుకు హిందువులే అక్కర్లేదు." అన్నాడు మూకలోంచి ఒకడు.

"ఒళ్లు దగ్గిరపెట్టుకు మాట్లాడు..." అంటూ గజనీ ఆమూకలో మనిషిని కోప్పడి "మౌల్వీగారూ! కోపగించకండి...మతంకోసం, మాకోసం, మీకోసం అల్లా పేరు చెప్పుకుని మీ కోమనవి చేసుకుంటున్నా... బన్సీలాల్ సంగతి మీకు తెలుసుకదా?"...... అన్నాడు...

గులాంమహమ్మదు జవాబేమీ చెప్పలేదు... గజనీ మళ్లా అందుకుని "వాడి మామ లక్షలకి అధికారి...వాడు వేలకి వేలు ఖర్చుపెట్టి ముస్లింలను చంపేస్తున్నాడు..." అని సాగించాడు.

గులాంమహమ్మద్ చీదరించుకుని వెళ్లబోగా మూక అడ్డంపడినట్టుగా వచ్చి... "సర్దార్ చెప్పే మాటలు ఆలకించండి మౌల్వీజీ..." అన్నారు. ఏమి చెయ్యటానికీ తోచక చూస్తున్న గులాంమహమ్మదు భుజంమీద చెయ్యేస్తూ గజనీ తన గాథ పూర్తిచేశాడు. "బన్సీలాల్ పని మీరు కానిస్తే మిగతా సంగతి మేము చూసుకుంటాం. ఇంజనీరు తన అల్లుడనే ధీమాతో వాడు చేసే ఘోరాలికి కాస్త అడ్డు తగుల్తుంది బన్సీలాలును మీరు..."

గులాంమహమ్మద్ యిక పట్టలేకపోయాడు. తను యిన్నాళ్లు ప్రాణస్నేహితునిగా చూస్తున్న బన్సీలాల్‌ను చంపమని ఒక చవట సలహాయిస్తున్నాడు. అదీగాక అల్లా పేరుతో యీహత్య చెయ్యాలిట! ఇంతకన్న ఘోరం ఏముంటుంది?

"నన్ను వెళ్లనియ్యరా ఏమిటి?" అని గద్దిస్తూ అడిగాడు గులాం మహమ్మద్.

"మా ఆజ్ఞ పాటించినట్లేనా?" అని ఉరుముతూ ప్రశ్నించాడు గజనీ...

"అది గడ్డిపరకతో సమానం నాకు..." అని కచ్చితంగా సమాధానంచెప్పాడు గులాంమహమ్మద్...

"కాఫిర్!..."అని మూకలోంచి ఒకడు కేకేశాడు. "కాఫిర్‌కంటె కనాకష్టం...ద్రోహి..."అని నలుగురన్నారు...

"అసలు వాడిని యిక్కడే దేవుని సన్నిధికి పంపితే!..." అని ఒక సాహసికు డన్నాడు...

"కాని సయిాదా...మన కందరు..." అని గజనీ బాహాటంగా సణిగాడు...

గులాంమహమ్మదుకు పిచ్చెత్తినట్టయింది. "పిశాచాల మధ్య నేను యిన్నాళ్లూ దేవుని ప్రార్థిస్తున్నా... ఛీ!! ఛీ!!!" అంటూ దూసుకుపోయాడు...ఎవరూ అడ్డు పెట్టలేదు...అప్పటికీ యిప్పటికీ ఆయన మసీదు మొహం చూడలేదు మళ్లా.

## ౨

బన్సీలాల్ తండ్రి లక్ష్మీచంద్ కూడా గొప్ప నగలవ్యాపారస్థుడే. గులాంమహమ్మద్ పద్ధెనిమిదేళ్ల వాడుగా ఉన్నప్పుడు అతని దూరపుబంధు వొకడు అతనిని లక్ష్మీచంద్ దగ్గిరికి తీసుకొచ్చి "పిల్లది గొప్ప ముస్లింవంశం. తండ్రి నిరుడే చనిపోయాడు. ఇతనిప్పుడు ఇంగ్లండు వెళ్లి చదువుకోవాలని చూస్తున్నాడు. మీ సాయం కావాలి..."అని చెప్పాడు. ఒక్కొక్కరి మొహం చూస్తే దగ్గిరికి తియ్యబుద్ధవుతుందో ఏమో! లక్ష్మీచంద్ ఒకటిరెండు ప్రశ్నలు వేసి "సరే! మాఅబ్బాయికూడా వెడుతున్నాడు యింగ్లండు...కలిసే చదువుకుంటారు..." అన్నాడు.

బన్సీలాలూ, గులాంమహమ్మదూ కలిసి ఇంగ్లండు వెళ్లారు. ఒకచోటే వుండి చదువుకున్నారు. ఇండియా కొచ్చి ఒకేచోట ఉద్యోగంలో చేరారు. వేరువేరు జిల్లాల్లో పని చేసినప్పుడు వీలు కాకపోయినా, ఒక ఊళ్లో పనిచేస్తున్నప్పుడు ఒకే

యింట్లో చెరోభాగంలో వుండటం వాళ్ల కలవాటైపోయింది. ఇంగ్లండులో ఉన్నప్పుడు మతంవిషయంలో అట్టే పట్టుదలలూ కట్టుదిట్టాలూ కనపరిచేవాడు కాదుగాని ఉద్యోగంలో చేరింతర్వాతా, మరీ ముఖ్యంగా భార్య పోయినతర్వాతా, గులాంమహమ్మదుకు మతాచారాలు ఎక్కువయ్యాయి. సయీదా పుట్టకపూర్వం యిద్దరు మొగపిల్లలు పుట్టిపోయారు. గులాంకు మొదటి మొగపిల్లాడు పుట్టిన వారంరోజుల్లోనే బన్సీలాలుకు కిషన్‌లాల్ పుట్టాడు. ఈ పిల్లలిద్దరూ ఆటపాటల్లో కలిసి మెలిసి తిరగటంతో గులాంమహమ్మదుకు కిషన్‌మీదకూడా ప్రేమ ఏర్పడింది, తన కొడుకు హుసేన్‌మీదమల్లేనే. ఆమూడేళ్లకి మరో కొడుకు పుట్టి నెలతిరక్కముందే పోయాడు పాపం. మరో మూడేళ్లకి సయీదా పుట్టింది. ఆఏడే మశూచికం పోసి హుస్సేన్ పోయాడు. పాపం! గులాం దుఃఖానికి మేరలేదు. కిషన్‌ను చూసుకుంటూ తన దుఃఖాన్ని మరిచిపోవటానికెంతో ప్రయాసపడేవాడు. నిజానికి అలా శోకోపశమనంకూడా అయ్యేది కొంతవరకు.

భ్రాతృగండమేకాకుండా మాతృగండంకూడా ఉందేమో, సయీదాజన్మలగ్నంలో! పదకొండో నెలలో తల్లికి విషజ్వరం తగిలింది. మూడోవారంలో అన్నిదుర్లక్షణాలూ కనిపించాయి. సరే, కళ్లుమూసింది శాశ్వతంగా. గులాంమహమ్మదుకు దుఃఖంకంటె వైరాగ్యమే ఎక్కువైంది. గడ్డంపెంచడం అదేమొదలు, నమాజు నిత్యకృత్యాల్లో ఒకటయిపోయింది.

పాకిస్థాన్ వచ్చింతర్వాత ఇండియాలో ఉండే ముస్లిం ఉద్యోగస్థులెవరన్నా పాకిస్థాన్‌కు వెళ్లదలచుకుంటే వెళ్లవచ్చు అన్న రోజుల్లో, బన్సీలాలే స్వయంగా గులాంమహమ్మదుని అడిగాడు "ఏమోయి! నువ్వు వెళతావా?" అని జంకుతూ జంకుతూ. గులాంమహమ్మదుకు కళ్లనీళ్లపర్యంతం అయింది. "మనుష్యుల్ని అడగాల్సిన ప్రశ్న కాదోయ్ బన్సీ..." అని గద్గదికస్వరంతో జవాబు చెప్పాడు. బన్సీకి చచ్చినచావైంది. చాలా క్షమార్పణలు కోరాడు. నిజానికి గులాంమహమ్మదుపైఖరి అతనికి అనుమానం పుట్టించి వుంటుంది. భార్య పోయిన దుఃఖంవల్ల జనించిన వైరాగ్యచింతే గులాంను మతకర్మలమీదికి తిప్పింది కాని, పరమతద్వేషం దానికి పర్యవసానం కాదని బన్సీలాల్‌కు తేలికగా అర్థంకాలేదు.

తల్లి పోయినప్పటినుంచీ సయీదా బన్సీలాల్ యింట్లోనే పెరిగిందన్నా అతిశయోక్తి కాదు. భగవంతుని కృపవల్ల బన్సీలాలుకూ యింత వేసీ వెయ్యకుండా వుండటమే కాకుండా పిల్లాకెల్లలికి కూడా కొరవలేదు. నిజానికి సయీదాకూడా బన్సీలాల్ పిల్లల్లో ఒకత్తె అయిపోయింది. హోళీపండగేమిటి? దీపావళేమిటి? దసరా ఏమిటి? సంక్రాంతేమిటి? అన్ని పండగల్లోనూ వాళ్లతోపాటు సయీదాకూడా పాల్గొనేది. తండ్రికి ఎంతమాత్రమూ కష్టం లేకపోవటంమూలాన సయీదాకు పెద్దదయింతర్వాత కూడా ఆ సరదాల నేమాత్రం తగ్గించుకోవలసిన అవసరం కలగలేదు. మొహరం, రంజాన్, బక్రీదులాంటి పండగల్లో తండ్రి చెప్పినట్లు చేసేది. రంజాన్‌రోజుల్లో తండ్రి ఉపవాసం ఉంటే ఎంతో జాగ్రత్తగా ఉపచరించేది కూడాను. కాని ఇంగ్లీషుచదువు చదువుకోటంమూలాన యీరోజుల వేషాలూ, ఫ్యాషన్లూ అలవాటయ్యాయి, బన్సీలాలు కుటుంబంలోవాళ్లతోపాటు సయీదాకీ కూడాను.

ఓమాటు సంవత్సరంపాటు గులాంమహమ్మదును బారిసాల్ జిల్లాకు మార్చారు. బన్సీలాల్ మటుకు కలకత్తాలోనే వున్నాడు. "అమ్మాయీ, నువ్వుకూడా బారిసాల్ వస్తావా?" అని అడిగాడు సయీదాని తండ్రి. "మీరు రమ్మంటే..." అంది సయీదా చిరునవ్వు నవ్వుతూ.

ఆయన రమ్మనలేదు. సయీదా బన్సీలాల్ యింట్లోనే వుంది. ఆఏడు దసరారోజుల్లో బన్సీలాల్ కుటుంబం అంతా చక్కగా అలంకరించుకుని కాళీదేవాలయాని కెళుతూ "సయీదా, నువ్వుకూడా వస్తావా?" అని అడిగారు. "నాన్నగారు కోప్పడుతారేమో!" అంది. అంతా ఆమెను విడిచిపెట్టి ఆరోజు గుళ్లో కెళ్లారు. రాత్రికి గులాంమహమ్మద్ వచ్చాడు.

సంగతి తెలుసుకుని "నీకు సరదాగా వుంటే వెళ్లు తల్లీ !" అన్నాడు. "మీరు వెళ్లరుగా మరి !" అని కూడా అడిగింది. "అల్లా నామనస్సులోనే ఉన్నాడమ్మా !" అని జవాబు చెప్పాడు.

మూడోరోజు విజయదశమి... మొహాన స్వస్తిక కుంకపుబొట్టు పెట్టుకుని బన్సీలాల్ కుటుంబంతో సయీదాకూడా గుళ్లోకి బయలుదేరింది. గులాంమహమ్మద్ నవ్వుతూ ఊరుకున్నాడు. ఎలా తెలిసిందో ఏమో, మసీదులోని మూకకీసంగతి తెలిసింది. గుసగుసలూ, నేరారోపణలూ, తీర్పులూ ఎన్నో సాగాయి పరోక్షంగా. శుక్రవారంనాడు మసీదులో నిలవేసి అడిగారు. "మీ అమ్మాయిని హిందువుల్లో చేర్పిశారే ?" అని. అప్పటికి గులాంమహమ్మదంటే ముస్లింలందరికీ గౌరవం బాగా వుండేది. అయినా అడిగారు. బహుశః అందుకనే అడిగారేమో !... "నేనేమీ మార్చలేదే ?..."అన్నాడు.

"మీరు మార్చకపోతే అదిసగారే మారచ్చు... లేవు..." అని ఒకడు ఎత్తిపొడిచాడు.

"నిరాటంకంగా మారచ్చు, అలా ఆమె కోరితే..."అని కచ్చితంగా జవాబు చెప్పేసరికి ఎవరూ ఏమీ అనలేకపోయారు.

జరిగిన సంగతి చెప్పేసరికి సయీదాకి చాలా అసహ్యం వేసింది అడిగినవారిమీద..."మారితే మటుకు వీళ్లు అడ్డంబస్తారా ?..."అని కోపంగా అంది... "అయితే నీకు మారాలని వుందేమిటే ?" అని వ్యంగ్యంగా గులాంమహమ్మద్ అన్నాడు. చురుకైన పిల్ల కావటంచేత తండ్రిభావాన్ని యిట్టే కనిపెట్టి, చిక్కమొహం వేసుకుని "మీ రెందుకు చెప్పలేదు మరి, గుళ్లో కెళ్లొద్దని ?" అని అడిగింది. "ఇప్పుడుమాత్రం నేను ఒద్దన్నానటమ్మా !" అన్నాడు మందహాసం చేస్తూను గులాంమహమ్మద్.

సయీదాతల్లి గొప్పవంశపు బిడ్డేగాని, తోబుట్టువులు కలదికాకపోవటంచేత, సయీదాను తీసుకెళ్లి పెంచుతానన్న మనిషే కనిపించలేదు, తల్లిపోయిన ఆరోజుల్లో. పన్నెండేళ్ల వయస్సులో బన్సీలాల్ కుటుంబంతోపాటు కాళికాలయానికి వెళ్లినప్పుడు మాత్రం ఊళ్లో ముస్లింలికి సయీదామీద ధ్యాస పుట్టింది. ఆతరవాత నలుగురైదుగురు ఘరానా సాహెబులు సయీదాను తమ కుమారులికి చేసుకుందామనే భావాన్ని గులాంమహమ్మదుకు తెలిపారు. కాని అతని కెవరూ నచ్చలేదు. అలాగే మూడేళ్లు గడిచాయి. "మెట్రిక్యులేషను పూర్తికానియ్యండి నాన్నగారూ !"అంది ఓమాటు యీప్రస్తావన వచ్చినప్పుడు. పరీక్షలో ఉత్తీర్ణురాలైనట్లు తెలిసింతర్వాత మళ్లీ ఆప్రస్తావన యింకా రాలేదు. ఇంటరులో చేరింది బన్సీలాల్ కూతురు సీతతోబాటు. ఆడపిల్లలికి చదువు ఎక్కువైనకొద్దీ వాళ్లని చేసుకోవాలని ఉబలాటపడే పురుషుల సంఖ్య తగ్గతూవుంటుంది తమ హోదా చాలదనే భయంవల్ల. సయీదా యింటర్లో చేరేసరికి వియ్యంకు లవుదా మనే కుతూహలం కల వారు గులాంమహమ్మదుదగ్గిరకి రావటం మానేశారు.

## 3

గజనీ మూడేళ్లనుంచీ వేస్తున్న ప్రణాళికల్ని ఆయేడు అమలుజరప నిశ్చయించాడు. మతోద్రేకమే కాకుండా, ధనికనిరుపేదభావాలూ, రాష్ట్రవిభేదాలూ సామాన్యజనానికి మరింత వెర్రిని కలగజేశాయి. "కాఫిర్‌ను చంపితే స్వర్గంలో ఒక మెట్టెక్కుతాం. ధనికుణ్ణి చంపితే యిహలోకంలో మంచి ఉన్నతి ఒస్తుంది. అన్యరాష్ట్రీయుణ్ని చంపితే మనరాష్ట్రానికి అభివృద్ధి కలుగుతుంది"అని నూరిపోశాడు గజనీ గుండాలికి. "ఈమూడుఅపరాధాలూ కల లక్ష్మీచందునీ, అతని వియ్యంకుడినీ ముందు బలిపెట్టాలి. దాంతోటి కల్లోలం లేస్తుంది. దోచుకు తినచ్చు..."అని నలుగురు మూర్ఖులికి బాగా నచ్చచెప్పి, తాగపోయించి, డబ్బిచ్చి, పిస్తోళ్లిచ్చి చతుర్దశినాటి రాత్రినుంచే కాపలా కాయించాడు గజనీ.

పండుగరోజులు. అందులోనూ పాకిస్తాన్ విడిపోయినతర్వాత హిందూముస్లింకలహాలు యిండియాలో వుంటాయని ఎవరూ అనుకోలేదు. లక్ష్మీచందూ, వియ్యంకుడు ఫూల్‌చందూ, గులాంమహమ్మదూ,

మోటారులో షికారుకని బయలుదేరి ఊరిబయటగా నదిఒడ్డున షికారుచేస్తుంటే పటపటా పిస్తోళ్లు పేల్చు కుంటూ నలుగురు గుండాలు మీదికొచ్చి ఫూల్చందును కాల్చేశారు. లక్ష్మీచందుమీద గురిపెట్టి కాల్చబోయే సరికి గులాంమహమ్మద్ సింహంమల్లే ఎగిరి ఆ గుండా మీదికి దూకి, పిస్తోలు లాక్కొని ఎదురు పేల్చేసరికి ముగ్గురూ పారిపోయారు. నాలుగోవాడు చచ్చి పోయాడు గుండుదెబ్బ తగిలి. పారిపోతున్న వారిలో ఒకడు కాల్చిన గుండు లక్ష్మీచంద్ ఎడమతొడలో దూరింది.

ఫూల్చందుశవాన్ని చూసేసరికి ఉద్రేకాలు ఆకాశమెత్తు లేచాయి. గులాంమహమ్మద్ ఒక ముస్లిం గుండాని చంపి లక్ష్మీచందుని బతికించాడనేసరికి ముస్లింల ఆగ్రహం యింతా అంతా కాదు. మసీదులో రహస్యపుసభ జరిగింది. గులాంమహమ్మదును చంపిన వీరుడికి స్వర్గంలో శాశ్వతస్థానం లభిస్తుందని తీర్మానించబడింది. భగవంతుడే సాక్షాత్తు వచ్చినా ఆయన్ని చంపతలపెట్టే మనుష్యులు లేకపోరు. ఆరాత్రి హోలికాదహనంతోపాటు చాలా గృహదహనాలు కూడా జరిగాయి. అమాయకులైన ప్రజలు చాలా మంది చంపబడ్డారు. లూటీలు జరుగుతుంటే పోలీసులు కాల్చారు. గులాంమహమ్మదు నిజమైన ముస్లిం అని తెల్లారేసరికి ఊరంతా పాకిపోయింది.

ఆయన నెరిసిన గడ్డం, కుచ్చుటోపీ, గోధుమ రంగు షెర్వానీ, తెల్లటి పైజామా ధరించి మామూలుగా వెండికర్ర పట్టుకుని వీధిలో కొచ్చాడో లేదో, ఒక హంతకుడు అమాంతం కత్తిని ఆయన డొక్కలో గుచ్చేశాడు, పూర్ణిమనాడు ఉదయం. ఉద్రేకాలకి మతాలతో పనిలేదు. రక్తపిపాస వృద్ధిఅయితే, స్వమతస్థుణ్నే కాదు తన్ను తానే చంపుకుని రక్తపానం చెయ్యాలనిపిస్తుంది.

"అల్లా" స్మరణ చేస్తూ మరణిస్తున్న గులాం మహమ్మదు ఆఖరుస్వరమూ, హంతకుని మోటారు పరుగూ ఒకేమాటు మొదలెట్టినా, ఖడ్గధారులైన పోలీసులు కారును వీధిచివర ఆపేసి చూసేసరికి హిందు వున్నాడు లోపల. పోలీసుస్టేషన్లో తెలిసింది అతను సయ్యద్ అనీ, గజనీతమ్ముడనీని.

లక్ష్మీచందుకూడా రెండువారాల్లో ఆ గుండు దెబ్బలవల్లనే స్వర్గస్థుడయ్యాడు. బన్సీలాల్ మనస్సు మనస్సులో లేదు. గు లా ం మ హ మ్మ దు మరణంతో సయీదాకు యిహలోకమే శూన్యమైపోయింది. సీతా, కిషన్లాలూ ఆమెను ఓదార్చలేకపోతున్నారు. చిన్నప్పటినుంచీ ఎంత కలిసిమెలిసి వున్నవాళ్లైనా కూడా.

## ౪

హోలికాపూర్ణిమ మర్నాడే శాంతిసంఘం ఏర్పడింది. ఆసంఘంలో మహమ్మదీయుల ప్రతినిధి గజనీ అయ్యాడు, కంచే చేనుమేసినట్లు. ఉభయ వర్గాలూ శాంతిని కాపాడాలని విన్నవిస్తూ జాతిపిత గాంధీజీ పవిత్రనామాన్ని చక్కగా ఉపయోగించు కుని ప్రకటన చేశాడు. "స్వపరమతవిచక్షణ లేకుండా గుండాలిని ఎదుర్కోటంలో షేక్ గులాంమహమ్మద్ వంటి ఉదారులు ఉభయమతాల్లోనూ ఉండాలని ఉదహరిస్తూ గులాంమహమ్మద్ స్వార్థత్యాగాన్ని కొని యాడాడు గజనీ ఆప్రకటనలో. రాత్రినమాజుసమ యంలో మసీదులో "ఆప్రకటన అంతా రాజకీయపు ఎత్తు" అని తన అనుయాయులికి నచ్చచెప్పాడు. సయీదాను తన కిచ్చి పెళ్లి చేయిస్తాననీ, అందుకుగాను గులాంమహమ్మదును హత్య చేసితీరాలని తన అన్న గజనీ చెప్పటంవల్ల ఆయనను హత్యచేశాననీ, కవక గులాం మహమ్మదుమీద తన కెంతమాత్రం ద్వేషం లేదనీ సయ్యద్ వాఙ్మూలం యిచ్చినట్లు తెలుసుకుని తన పలుకుబడినంతా వినియోగించి దాన్ని ఉపసంహరింప జేశాడు గజనీ. సబుజైయిలులో తమ్ముణ్ని కలుసుకుని "సయీదాను నీకు కట్టబెట్టే పూచీ నాది. నీమీద కేసు ఉపసంహరింపజేస్తాను. నేను శాంతిసంఘం ఉపాధ్యక్షుణ్ణికూడాను. నీకు తెలుసా!" అని అతనికి బాగా నూరి పోశాడు. దున్నలికి గడ్డివేస్తే చాలు! వేస్తానని నచ్చ చెప్పినాకూడా చాలు!! అనుకున్నట్లుగానే సయ్యద్ను జెయిలుమీద విడిచిపెట్టించాడు గజనీ.

శాంతిసంఘంసమావేశంలో మొదటిమాటే చూచాయగా సయీదామాట ప్రస్తావించి విడిచి పెట్టాడు గజనీ. హిందువులందరికీ గజనీ చెప్పిన మాట చాలా సబబుగా కనిపించింది. స్వపరమతవిచక్షణ పాటించకుండా ఆత్మబలిదానం చేసిన మహాపవిత్ర మతవిశ్వాసం కలిగిన గులాంమహమ్మద్ కూతురు సయీదాను అమతస్థుల చేతుల్లో పెట్టకపోతే, మృతాత్మ క్షోభిస్తుందనీ, కనక సయీదాను గజనీసంరక్షణకు అప్పజెప్పాలనీ తీర్మానించారు.

తీర్మానపు ప్రతి ముందుగా బన్సీలాల్ కు పంపబడింది. బన్సీలాల్ చిరునవ్వు నవ్వి కిషన్ లాల్ కు చూపించాడు. కిషన్ లాల్ సయీదాకు చూపించాడు. కబేలాలో కసాయివాడి దగ్గిరికి లాక్కుపోతున్న వాకరుకేసి దీనంగా చూస్తున్న గొర్రెలాగా కన్నీరు నింపుతూ సయీదా కిషన్ లాల్ కేసీ, బన్సీలాల్ కేసీ చూస్తూ లోపలి కెళ్లిపోయింది.

బన్సీలాల్ తో గులాంమహమ్మద్ స్వయంగానే చెప్పాడు:—"నిన్ను చంపవలసిందిగా నాకు గజనీ ఆజ్ఞ యిచ్చాడోయి ఆరోజుల్లో!" అని. "అయితే ఆకత్తి యిలా తీసుకురా!"అని నవ్వుతూఅన్నాడు బన్సీలాల్. "గజనీ అందుకొడుటయ్యా మరి!"అని ఫక్కున నవ్వాడు గులాంమహమ్మద్. తర్వాత యిద్దరూ ఆలోచించారు "యీకారణంగా గజనీని అరెస్టుచేయిస్తే బాగుంటుందేమో" నని. కాని అన్యసాక్ష్యాధారం లేకుండా తను ఆరోపణ గజనీమీద ధ్రువపడదని విరమించుకున్నారు. ఆకాశరామన్న ఉత్తరాలుకూడా గులాంమహమ్మద్ పేర వచ్చినవన్నీ ఎప్పటికప్పుడు ఆయన బన్సీలాల్ కు చూపిస్తూ వుండేవాడు. ఒకరిద్దరు హిందువులుకూడా బన్సీలాల్ కు ఆకాశరామన్న ఉత్తరాలు రాశారు. గులాంమహమ్మద్ ని యింట్లోంచి వెళ్లగొట్టమనీ, లేకపోతే అతనే నిన్ను పొట్టనపెట్టుకుంటాడనీని.

ఒక్క ఉత్తరంమటుకు, పాపం, గులాంమహమ్మద్ హత్య చేయబడిన మూడురోజులకి వచ్చింది. సయీదా చూసుకుని మహా చింతించి సీతకిమాత్రం చూపించింది. "నీకూతురిని ఎన్నిరోజులు కిషన్ లాల్ కు..." సీతకూడా ఆపైన చదవలేకపోయింది. అన్నగారితో చెప్పుదామనుకునికూడా బాగుండదని మళ్లీ మానేసింది.

తీర్మానం పంపిన మర్నాడు శాంతిసంఘం అధ్యక్షుడూ, ఉపాధ్యక్షుడు గజనీ, మరోసభ్యుడూ బన్సీలాల్ యింటికి వచ్చి ఫూల్ చందూ, లక్ష్మీచందూ వధింపబడినందుకు విచారాన్ని తెలుపుతూ, గులాంమహమ్మద్ ఆత్మబలిదానానికి ప్రశంసిస్తూ, తీర్మానం మాట ఎత్తి సయీదాను గజనీకి అప్పజెప్పవలసింది గానూ, అప్పుడే స్వర్గంలో ఉన్న గులాంమహమ్మద్ ఆత్మ తృప్తిపడుతుందనీ సవినయంగా మనవిచేశారు. అదీగాక సయీదా బన్సీలాల్ యింట్లోనే యింకా వుంటే శాంతిభద్రతలకు భంగం వాటిల్లవచ్చుననీ, ముస్లింలలో యీవిషయమై తీవ్రమైన పట్టుదలలు ఉన్నట్టున్నా గజనీ మరీమరీ చెప్పాడు. అన్నీ విన్న తర్వాత బన్సీలాల్ సూటిగా గజనీని ప్రశ్నించాడు: "మూడేళ్లక్రితం గులాంమహమ్మదుతో నన్ను చంపివేయవలసిందిగా మీరు చెప్పలేదా!" అని. గజనీ తెల్లమొహం వేసి "ఇంతకన్నా అభాండం మరొకటుండదు." అని నీళ్లునమిలాడు. తక్కిన యిద్దరూ ఒకళ్ల మొహం ఒకళ్లు చూసుకున్నారు. గులాంమహమ్మదు డైరీ తీసుకొచ్చి కిషన్ లాల్ శాంతిసంఘం ముందు పెట్టాడు. "గులాంమహమ్మద్ ను చంపిన సయ్యద్ ను జెయిలుమీద విడిపించడంలోనూ అతను యిచ్చిన వాఙ్మూలాన్ని ఉపసంహరింపజెయ్యడంలోనూ మీ ఉద్దేశం ఏమిటి!" అని కిషన్ లాల్ ప్రశ్నించాడు.

"అనవసరప్రసంగం చేస్తున్నారు మీరు..." అని గజనీ గుడ్లురుముతూ జవాబు చెప్పాడు.

"సయీదాకు మైనారిటీ వెళ్లింది. ఆమె యిష్టం... చిన్నప్పటినుంచీ మాయింట్లోనే పెరగటంవల్ల మేము ఆమెను బుద్ధిపూర్వకంగా వెళ్లగొట్టదలచలేదు." అన్నాడు బన్సీలాల్. ఆమాట కెవరూ కాదనలేకపోయారు. సయీదాఅభిప్రాయం కనుక్కో

టానికి మరికొంతమంది పెద్దమనుష్యు లుండా లని గజనీ అనడంచేత మూడోరోజుకు వాయిదా వేశారు.

"నాతండ్రిని పెంచి పెద్దచేసిన సేఠ్ లక్ష్మీచంద్‌నూ, ఆయనవియ్యంకుడు ఫూల్‌చందునీ చంపడమే కాకుండా నన్ను ఏడాదివయస్సునుంచీ తన పిల్లలతోపాటు పెంచి పెద్దచేసిన బన్సీలాల్‌ను హత్య చేయవలసిందని మీనాయకుడు సాక్షాత్తు నాతండ్రితో చెప్పాడు. అలా చెయ్యకపోవడంచేత నాతండ్రినే మీ నాయకుడి తమ్ముడు ఘోరహత్యచేశాడు. మతం పేరుతో యీ క్రూరకృత్యాలు జరిగాయి. అసలు మతమంటేనే నాకు నమ్మకంలేదు. అందులోనూ ముస్లింమతంమీద. ముస్లింలని పేరుపెట్టుకున్న మీమూలంగా నాకు అస్థ ఎంతమాత్రమూ లేదు. ఈఘాతుకకృత్యాలమధ్యకి నేను రావటంకన్నా ఆత్మహత్య చేసుకోటం మేలు. నేను సయీదా అనే పేరుతో నాయిష్టం వచ్చినచోట వుండటంవల్లనే శాంతిభద్రతలకు భంగం కలుగుతుం దని పెద్దలు భావించేటట్టయితే నేను యీక్షణంలోనే మతం మార్చుకుంటున్నాను."అని సయీదా స్పష్టంగా ఖండితంగా చెప్పేసింది వాయిదానాడు పదిమంది లోనూ.

౫

"పూర్ణిమ"అని పేరు మారిస్తే బాగుంటుంది అంది సీత సయీదాతో. "అవును, హోళికాపూర్ణిమ అన వచ్చుకూడాను"అని వేళాకోళం చేశాడు కిషన్‌లాల్. "నేనుమాత్రం సయీదా అనే అంటాను నాకోడలిని" అన్నాడు బన్సీలాల్.



# ఆధారవిద్య *

శ్రీ కల్లూరి సుబ్బారావు

రాష్ట్రపరిపాలనాసమస్యలలో అత్యంతప్రాముఖ్య మైనది, అధికవ్యయముతో కూడినది విద్యాశాఖ. మదరాసురాష్ట్రాదాయములో సుమారు ౧౧ కోట్ల రూపాయల ఖర్చు ఈ సంవత్సరఆదాయవ్యయపట్టికలో చూపబడినది. ఇంత వ్యయమునకు తగిన ఫలమున్నదా యను ప్రశ్న పలువురను కలవరపరచుచున్నది.

ఏదేశముయొక్క ఉన్నతిగాని, ఆ దేశప్రజలయొక్క విజ్ఞాన వికాసాదులనుబట్టియే లెక్కపెట్టబడును. భారతదేశము నేడు విద్యావిషయమున చాల వెనుకబడియున్నది. చదువు వ్రాత నేర్చినవారు నూటికి ౧౪ మంది మాత్రమే ఉన్నారు. కాని వేలకొలదిపుస్తకములు బిరబిర చదువుటయు, వేళ్లపై వేలకొలది లెక్కించుటయు విద్య యనిపించుకొనదు. మానవునిలో దైవదత్తముగు అంతర్గర్భితశారీరక, మానసిక, ఆధ్యాత్మికశక్తులను పెంపొందించుటయే విద్య.

విద్యయొక్క పరమార్థము అందము—అర్థము—ఆనంద మని చెప్పదగును. ప్రతివాడును తన రూపులో, చూపులో, మాటలో, మర్యాదలో ఆదర్శమైనట్టిన్ని రక్షణీయ మైనట్టిన్ని మంచి నడవడి నలవాటుచేసికొనుటయు, నీతితో, నియమముతో, నిష్ఠతో జీవితము గడుపుచు, ధర్మసాధన కాధారమగు శరీరమున కండ, కళ, కాంతి నార్జించుటయు అందము. జీవనాధారమున కవసరములను కష్టించి సంపాదించుకొని, కోరికలను పరితృప్తిచేసుకొనుటకు వలయు నిర్మాణశక్తి గడించుటయే అర్థము. తినడము, తూగడమే జీవితపరమావధి యని తలంచక కంటికి కన్ను, చెవికి చెవి, వాక్కునకు వాక్కు, మనసునకు మనస్సై వర్తించు శాశ్వత సత్యశక్తిని కనుగొనుటకు ప్రయత్నించుటయే ఆనందము. సంతృప్తియే ఆనంద మనిగూడ చెప్పవచ్చును. అంతేగాక, తన్నుతా తెలిసికొనుటయు, తన సంఘమునకు తనకు గల సంబంధబాంధవ్యము నెఱుగుటయు, తనచుట్టుపట్లగల చేతనాచేతనముల పుట్టుపూర్వోత్తరములను రహస్యస్వారస్యములను తెలిసికొనుటకు ప్రయత్నించుటయు విద్యయనబడును. అట్టి జ్ఞానసిద్ధి కంటె జర్పింప సకలసిద్ధులును లొమ్ముగాన దొలుత దాని గడనవలయు అని పెద్దల పలుకు. విద్య, లేక జ్ఞానసముపార్జనమునకు ప్రయత్నించుట మానవుని ప్రథమకర్తవ్యము. అద్దానికి సర్వవిధముల సహకరించుట పాలకుల ప్రధానధర్మము. అందుననే మన ప్రభుత్వమువారు తమ ఆదాయములో నూటికి ౨౦ వంతులు విద్యాభివృద్ధికి వెచ్చించ నిశ్చయించినారు.

"విద్య యొసగును వినయంబు—వినయమునను బడయు పాత్రత—పాత్రతవలన ధనము—ధనముకలనను ధర్మంబు—దానివలనను ఐహికాముష్మికసుఖంబు లందు నరుడు" అని భారతవాక్యము.

సూత్రప్రాయముగ—విద్య వినయవిజ్ఞాన వివేకదాయకము; జీవనోపాధికి ఆధారము; ధర్మనిర్వహణకు శక్తి; ఇహపరసాధనము అని చెప్పవచ్చును.

యుగధర్మముల ననుసరించి విద్యాపద్ధతులుగూడ మారుచుండును. ప్రాచీనభారతదేశమున విద్యాపద్ధతి ఆదర్శప్రాయమై అత్యుత్తమస్థితిలో నుండిన దని ఉపనిషత్తులవల్లను, పరిశోధనలవల్లను తెలియుచున్నది. ఆశ్రమవాసపద్ధతిని సర్వశాస్త్రములను గురువు

* ఆలిండియా రేడియో - మద్రాసుకేంద్రము వారి అనుమతితో.

సన్నిధిని శిష్యులు అభ్యసించుచుండిరి. కలవారు, లేనివారను భేదము లేక కలసి గురుకులమున సేవ లొనర్చుచు, పరమక్లేశముల కోర్చి, విద్యార్జన మొనర్చినట్లు పురాణములు పలుకుచున్నవి. శ్రీకృష్ణకుచేలురు సాందీపని యొద్ద చదువుకొన్నట్లు భాగవతమున చదువుచున్నారము. అతరువాత బానిసభారతమున, ముఖ్యముగ ఆంగ్లపాలనములో రమారమి ౧౦౦ వత్సరముల కాలము విద్యాబోధనాపద్ధతిలో విపరీతమార్పులు కలిగినవి. చదువు నేర్చుట సర్కారుచాకిరీకని తేలిపోయినది. సంస్కారమునకు బదులు సంకరము—విజ్ఞానవికాసము లకు మారు విజాతీయపద్ధతులకు, వెక్కిరింపులకు ప్రజల సర్వశక్తులు వినియోగపడినవి. అవనతి కలిగినపుడెల్ల ఉన్నతికి దారిచూపు ధీరవరు లవతరించెద రను నుడి సార్థకమైనది. లోకోత్తరపురుషుడు, భారతజీవనజ్యోతి మహాత్మగాంధీ ప్రజానాయకుడై అపూర్వపద్ధతిని పరదాస్యశృంఖలములనుండి ప్రజలను విడిపించి, స్వాతంత్ర్యమును సంపాదించెను. భావిభారతము స్వాస్థ్యముగ సౌభాగ్యముగ వర్ధిల్లుటకు వలయు నిర్మాణశక్తులను ఆయన ప్రజలలో విజృంభింపజేసెను. భారతీయుల సర్వతోముఖాభివృద్ధికి సర్వోదయసమాజసూత్రములను సూచించినాడు. వార్ధాలో తన సన్నిధికి విద్యావేత్తల రావించి, పరిశోధనచేయించి సప్తవర్షప్రణాళికపై నూతనవిద్యాబోధనాపద్ధతిని భావిభారతాభ్యుదయమునకు అమలుజరిపినాడు. దానిని వార్ధావిద్యావిధానము, లేక '*Basic*' అనగా ఆధారవిద్యావిధాన మని పిలుచుచున్నారు.

*"The education of the future will, in the case of every child over a certain age, combine productive labour with education and athletics—not merely as one of the methods raising social production but as the only method of producing fully developed human beings."*

*(Karl Marx.)*

భావివిద్యాపద్ధతి ప్రతిబాలునిలోని సృష్టిచైతన్యశక్తిని, శరీరసౌష్ఠవమును పెంచి, సంపూర్ణమానవత్వమును పెంపొందించుటయే యని దీని భావము. ఇరువురు యుగపురుషులు —కార్ల్‌మార్క్సు, మహాత్మగాంధి యీ విషయమునం దేకాభిప్రాయులు.

నూతనరాజ్యాంగమునకూడ నిర్బంధ ఉచిత ప్రారంభవిద్య ౧౪ సంవత్సరముల లోపు బాలుర కెల్లరికిని నేర్పించితీరవలెనని నిర్ధరించినారు. భారత ప్రభుత్వమువారు కూడ ఆధారవిద్యావిధానమునకు సర్వవిధప్రోత్సాహము నొసగుచున్నారు.

ఈవిద్యావిధానమున గమనింపదగిన ముఖ్యాంశము లియ్యవి :

(౧) వృత్తిద్వారా విద్య గఱపుట.
(౨) మాతృభాషద్వారా విద్య బోధించుట.
(౩) పవిత్రపౌరజీవితము పెంపొందించుట.
(౪) స్వయంపోషకత నొనర్చుట.

(౧) విద్యాబోధన జీవనోపాధి కవసరమగు వృత్తిపై నాధారపడవలెను. ఇంతవరకు విద్యావంతుల మనుకొన్నవారు బుద్ధిజీవులుమాత్రమే; కాయకష్టమున కాని, చేతినేర్పరితనమున కాని జీవించియెరుగరు. గ్రామాలలో సహితము విద్య నేర్చినవారికి పొత్తుకుదురుట అసంభవమైనది. విద్యావంతులదే ఒకజాతిగా ఏర్పడినది. చదువుకొన్నవారు ప్రభుత్వనౌకరీల కుపయోగపడిరేకాని, పల్లెటూరిప్రజల బాగోగుల నరసి, వారి నిత్యజీవితవ్యవహారములలో సహాయపడలేకపోయినారు. మానవునియందలి ఉత్పన్నశక్తి, ఉత్సాహశక్తి, ఉల్లాసశక్తి సన్నగిలి, వెక్కిరింపునకు, నిరుత్సాహమునకు, నిరాశకు లోనై కొలువులేనపుడు కూడు నార్జించుటకు కూడ శక్తిలేకపోయినది. అందుచేత వృత్తితో కూడిన విద్య చేడత్యంతావశ్యక మైనది. నాలు వడుకుట, నేయుటయే బేసికువిద్యకు మూలమని, దీనిని దూదేకులవిద్య యని హేళనచేయువారు కూడ కొందరు గలరు.

అయ్యది తెలిసి తెలియని దోషము. వడకుట, నేయుట అందులో నొకభాగమైనను వ్యవసాయము,

వ్యవసాయము, కూరగాయలు పండ్లతోటల పెంపకము, పసుపోషణ మొదలగు ఆయాపరిసరముల కనువగు వృత్తివిద్యలను బోధించి, చదువుకొన్న ప్రతిబాలుడును స్వతంత్రజీవనోపాధి నార్జించు శక్తిని సంపాదించుటకు తరిబీతుచేయుట యిందలి ముఖ్యసూత్రము. ఇంతేకాక సంగీతము, సాహిత్యము, చిత్రకళ, నాట్యకళ మొదలగువాటినికూడ చెప్పవచ్చును. అయ్యది బాలుని యభిరుచినిబట్టి ఉపాధ్యాయుడు చెప్పవలసియున్నది.

(౨) మాతృభాషలో విద్యాబోధనావసరమును గుఱించి యెక్కువ చెప్పనవసరములేదు. పరభాషలోని విద్య పలువిధకష్టములకు లోనైనది. పటిమతో జాగ్రత్తగా విద్య నేర్చుకొను నవకాశము లేకపోయినది. విద్యార్థులు పరభాషకు దాసులై భావదాస్యమును కూడ పొందినారు. ౧౦ సంవత్సరముల చదువును తల్లిభాషలో ౫ సంవత్సరములలో నేర్వవచ్చును. తన భాషలో విద్య నేర్పినచో తక్కువకాలములో ఎక్కువజ్ఞాన మార్జించుటకు వీలగును. ఇయ్యది జీవనాధారమేగాక జాతీయజీవనాధారమైనదిగా నుండవలెను. జాతీయభాషను నేర్చి, జాతీయ సంప్రదాయములను తెలిసి, జాతిసుఖసౌభాగ్యాభివృద్ధికి అవసరమగు శక్తిసంపన్నతను బడయుట ముఖ్యము. అయ్యది మాతృభాషలో విద్య నేర్పినపుడే వీలగును.

(3) పవిత్రపౌరత్వమును బాలురలో పెంపొందించుట యీ విద్యాపద్ధతిలోని పరమోత్కృష్ట సూత్రము. మానవుడు సంఘజీవి. సంఘసేవయే సర్వేశ్వర సేవగాభావించి, సంఘోద్ధరణకేర్పడిన సర్వసంస్థలకును తోడ్పడుటకు సభ్యులను తయారుచేయుట అత్యవసరము. స్వాతంత్ర్యము, సమానత్వము, సోదరత్వము సమస్తప్రజలలో పెంపొందింపజేయుటయే మానవాభ్యుదయమునకు మూలమని ప్రబోధించి, ప్రతివాని హృదయక్షేత్రమున ప్రేమ, సత్య, అహింసల ప్రాధాన్యమును, ప్రాశస్త్యమును ప్రతిష్ఠించవలెను. దానికనువగునట్లు ప్రతిబాలుని తీర్చిదిద్ది పరనారీసోదరుడై, పరధనమునకు దూరుడై, పరహితపరుడై ప్రవర్తించు పవిత్రజీవిగా తయారుచేయవలెను.

(౪) స్వయంపోషకము. ఈ విద్యావిధానములోని సప్తవర్ష ప్రణాళికలోని మొదటి 3 సంవత్సరముల తరగతులు విడిచి మిగత ౪ సంవత్సరముల కాలములో అభ్యసించు వృత్తివిద్యలో విద్యార్థులు తయారుచేయు వస్తువుల విక్రయమూలమున వచ్చు ధనముతో ఈవిద్యావిధానము స్వయంపోషక మగునని మహాత్మాగాంధీగారు నిరూపించినారు. అనుభవమున కూడ అయ్యది సాధ్యమని తేలినది. భారతదేశములో అన్నిప్రదేశములవారును ఈవిద్యావిధానమును ఆచరణకు తెచ్చుచున్నారు. మద్రాసుప్రభుత్వ మీవిషయమున ముందంజ వేయుచున్నది. ప్రతిజిల్లాలోను ఉపాధ్యాయశిక్షణాలయములను స్థాపించి ఉపాధ్యాయులకు శిక్షణనొసగుచున్నారు. వేలకొలది ప్రాథమికపాఠశాలలను (*Basic*) ఆధారపాఠశాలలుగా మార్చి యీ నూతనవిద్యాపద్ధతిలోని నూతనోత్సాహమును, ఉత్తేజమును జనసామాన్యమున, ముఖ్యముగ పల్లెటూరిప్రజలలో నేటి ప్రజాప్రభుత్వము ప్రచారముచేయుచున్నది. ప్రజాదరణముకూడ సుముఖముగ నున్నది.

మహాత్ముని తపశ్శక్తిఫలితముగ, మహనీయుల త్యాగశక్తిమూలకముగ నేర్పడిన యీ స్వాతంత్ర్యము స్థిరముగ శాంతముగ నుండుటకును, సర్వులలో సుస్థిర జాత్యభిమానమును పురికొల్పుటకును ఈ విద్యావిధానము సహాయపడుగాతయని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

# మానవా! మానవా!

★

శ్రీ మసంతరావు వెంకటరావు

[ఉదజనిబాంబు పేలిన పక్షమందు భూగోళ ఖరాగ్నికీలలచే ఆవరింపబడి సూర్యగోళంవలె మండిపోవచ్చునని విజ్ఞానుల అభిప్రాయము. ఉదజని కేంద్రకాలసమ్మిశ్రణంతో జనించిన శక్తి విషపూరితమై జీవసర్వస్వాన్ని ధ్వంసంచేయగలదని విజ్ఞానులు తల్లడిల్లుచుండగా, ఉదజనిబాంబుల నిర్మాణానికై అమెరికారష్యాలు అహమహమికతో పరుగెత్తుచున్నాయి. వేలసంవత్సరాలుగా తనవారు శ్రమించిసమకూర్చినజ్ఞానాన్ని ఆత్మవినాశానికే మానవుడు వినియోగిస్తాడా!]

నీ నిర్మాణము నీ చేతులతో
నే నిర్మూలము చేసెదవా,
స్వార్థ పరత్వపిశాచప్రేరిత
సర్వధ్వంస మొనర్చెదవా!

అపరసూర్యులై యవని జ్వలింపగ
అణుశక్తిని విడిపించెదవా,
సర్వవినాశకవిషవాయువు లీ
యుర్విస్థలి సృష్టించెదవా!

ప్రకృతికాంతతో ప్రబలిన ప్రణయం
ప్రళయం బౌనని మెరుగుదువా,
శాంతాకనకము లెప్పటికిని ప్రా
ణాంతక మని గుర్తింపవుగా.

యుగయుగాలుగా యోగులు కట్టిన
త్యాగసౌధముల గూల్చెదవా,
కళారాధకుల కావ్యసంతతిని
ఫెళ ఫెళాగ్ని కర్పించెదవా!

యావత్ సృష్టికి నేనే మణి నను
భావదార్ఢ్యమున జిక్కితివా!

చిక్కి—చిక్కి— శల్యావశిష్టమై
జీవశక్తి గోల్పోయెదవా!

యాదవకులమున ముసలంబట్లీ
అణవాస్త్ర ముదయించినదా!
ప్రకృతిశక్తి స్వాధీనమైన దను
ప్రతిభకు బలి గానున్నావా!

వార్ధులు దాటియు పిల్లకాల్వలో
బడి చచ్చెడు చందంబగునా,
ఘనపర్వతముల చూర్ణించియు మృ
త్కణదుశ్శక్తికి ప్రమగ్గెదవా!!

అంబరచుంబితవాయుయానమా
హాత్మ్యము వ్యర్థము కావలెనా!
మత్స్యసన్నిభజలాంతర్గమనము
మత్సరాగ్ని కింధనమగునా!!

సృష్టిరహస్యాన్వేషణ మంతయు
నష్టము భ్రష్టము కావలెనా!
కష్టార్జితవిజ్ఞానము యావద
రిష్టదాయకము కావలెనా!

కాలాకాశాతీతతత్వము హే
లాలీలానుగతిం జనునా!
సౌఖ్యవర్ధకవిశిష్టసృష్టియు
స్వప్నప్రాయంబై చనునా!!

* * * * * *

అణుసంయోగవిధాన మెరింగియు,
అణునిర్మాణరహస్య మెరింగియు,
మూలతత్త్వముల మూల మెరింగియు,
ద్రవ్యశక్తిసంబంధ మెరింగియు,
సౌరశక్తి కాధార మెరింగియు,
ఉదుపరిణామచరిత్ర మెరింగియు,
విద్యుదయస్కాంతత్వ మెరింగియు,
రుజసంహారప్రక్రియ లెరిగియు,
మానవాభ్యుదయమార్గ మెరింగియు,
ఇల స్వర్గము నెలకొల్పు టెరింగియు,
తుట్టతుదకు సూక్ష్మాతిసూక్ష్మమగు
మట్టికణములో నిమిడిన శక్తికి
పట్టుపడెదవా? పడి ప్రపంచమే
ముట్టించెదవా, మానవుడా!

జీవులు కలకలలాడే లోకం,
జీవాభ్యున్నతి కనువగు లోకం,
జీవనదుల కాస్పదమగు లోకం,
జీవశక్తులకు నాట్యరంగ మగు
లోకములం దేకైకలోక మీ
లోకము నొక సూక్ష్మాణుశక్తిచే
భీకరాగ్నికీలావృతమౌన
శ్లోకలిప్తలో మంటబెట్టెదో!!

* * * * * *

పరవిధ్వంసమె ఆత్మరక్షణో
పాయ మందువా మానవుడా!
బతుకనిచ్చి మరి బ్రతికెదు తెరు వె
ప్పటికి నేర్తువో మానవుడా!

* * * * * *

మారణాస్త్రనిర్మాణమె శాంతికి
మార్గమందువా మానవుడా!
మారణహోమం ప్రారంభించిన
ఆరవుసుమ్మీ హోమాగ్నుల్!!

# విడుదల

[కథానిక]

★

శ్రీ వేలూరి సహజానందం

రాత్రి నిద్రపోయే సమయానికి హఠాత్తుగా తలుపులు తట్టిన చప్పుడవగానే ఉలిక్కిపడి లేచాడు రంగడు. పక్కనున్న యువతి భయపడ్డది. మళ్లీ తలుపులవద్ద చప్పుడు. మెల్లగా అడుగులు వేసుకుంటూ వెళ్లి తలుపులు తీశాడు. గుమ్మంబైటనుంచి కారుచీకట్లో కళ్లను మిరుమిట్లుగొల్పిన 'టార్చిలైటు' వెలుతురులో ఎర్రటోపీలు తళుక్కుమనగానే రంగడి ముఖం ఆందోళనతో వెలవెలపోయింది.

"ఏమిటి ?" అని అన్నాడు.

"ఆ ! ఏం లేదు...నాలుగురోజులు మాదగ్గర ఉండివద్దువుగాని" అన్నాడు వాళ్లలో ఒకడు.

పక్కపావడిలో పరున్న రంగడి తల్లిదండ్రులను లేపుకొనివచ్చిందా యువతి. వృద్ధదంపతులు పోలీసులను చుట్టుముట్టుతూ, "మావాడు ఇప్పుడలాంటి. ఏమీ చేయట్లేదు...బాబూ...బుద్ధి కుదురువచ్చి, రెండేళ్లయాక మళ్లీ ఇంటిగడప తొక్కాడు" అని విన్నవించుకున్నారు.

రంగడు పోలీసులవెంట వెళ్లటానికని తయారు కాగానే, ఆ యువతి దుఃఖవివశురాలైంది. "కంగారుపడకు...రేపు వచ్చేస్తాను." అని చెప్పి, రంగడు పోలీసులతో చీకట్లో కలసిపోయాడు.

ముసలితండ్రి కొడుకుతోపాటు మునసబు ఇంటిదాకా వెళ్లాడు. తన పాదాలమీదకు వాలుతున్న వృద్ధుడిని పైకి లేవనెత్తి, "ఇది వాడి కేం కొత్తకాదు... పక్కఊర్లో పెద్ద దొంగతనం జరిగిందట...ఇనస్పెక్టరు విచారించి వదిలేస్తాడులే" అని, తీరగా రంగడికేసి చూస్తూ, మునసబు ధైర్యం చెప్పాడు.

ఆమాటల్లో వేళాకోళం, హేళనా, ద్వేషం రంగడు గుర్తించి, తండ్రిని మందలించాడు.

"నాపై రిపోర్టు మీరే పంపా రనుకుంటాను." అన్నాడు రంగడు.

"అబ్బే...నా కస లేం తెలియదు. వీరు వచ్చి నీ పేర వారంటు చూపేదాకా" అని జవాబిచ్చాడు మునసబు.

ఆ నిశిరాత్రి సమయంలో మునసబుగారి వెనక గోడమొత్తన చీకట్లో కంసాలి కిష్టాయ్ కన్పించటం రంగడి కాశ్చర్యం వేసింది.

"ఏం...మామా...నువ్వా ఇక్కడ ఉన్నావు?" అని అడిగాడు.

గుర్రంలా సకిలించి, "పోలీసు లనగానే లేచి వచ్చాను...ఏమిటో చూద్దామని" అన్నాడు కిష్టాయ్.

కొంచెంసేపయాక కారుచప్పుడు వినబడి, ఆ యువతిగుండె దడదడ కొట్టుకుంది. చీకట్లో అలాగే కొంతసేపు నిలబడి మంచంలో కూలబడ్డది. విపరీత భయంతో వణికిపోయింది.

రంగడి తల్లిదండ్రులు, అన్నదమ్ములు ఆమెదగ్గరకు వచ్చి, "మళ్లీ ఎక్కడైనా కన్నాలు వేస్తున్నాడేమో చెప్పవే!"అని అడిగారు. తన్ను హీనంగా చూసిన వారి దృష్టి ఆమెను కలతపెట్టింది.

"అవి మానేసి చాలాకాలమైంది"అని అంది.

"గంతకు తగ్గ బొంత...వాడి కాపాటి బుద్ధి కుదురేవస్తే, నిన్నెందుకు నెత్తివపెట్టుకొనివస్తాడు." అన్నది తల్లి.

అవమానంతో ఆయువతి తల వాల్చుకుంది. అసహాయురాలి కళ్లు నీళ్లతో మూసుకున్నయ్.

సావడిలోకి వెళ్తూ వెళ్తూ రంగడి అన్న వెంకయ్య మళ్లీ అడుగులు వెనక్కు వేసి, "నీకు తెలియకుండా ఉంటుందీ! ఈ చీరెలు...ఈనగలు...ఇలా సీతాకోకచిలుకలా సింగారించుకోటానికి వాడెన్ని చోట్ల కన్నాలు వేస్తున్నాడో!" అని వెళ్లిపోయాడు.

అతని కళ్లు గద్దకళ్లలా ఆమెను చీల్చిచూసినయ్. అన్యుని అధీనంలో ఉన్న పరస్త్రీపై ఆక్కసు వెళ్లబోసుకున్నాడు. ఈ ద్వేషపూరితమైన మాటలు, చూపులు ఆమెకు కొత్తకాదు. వీటి మధ్యనే ఎలాగో పడుతూ లేస్తూ రంగడిని చేరుకుంది.

తెల్లవార్లూ కంటికి కునుకు పట్టలేదు.

ఏమో! తనకు తెలియకుండా మళ్లీ ఆ ముఠాలో చేరాడేమో! ఏదో బస్తీలో కోట్లమీద పెత్తందారీ పని చేస్తున్నానని చెప్పుతూ, పాత నాటకమే మళ్లీ ఆరంభించాడా?

ఉభయులూ కలిశాక, ఒకసారి మొదట్లో కొన్నాళ్లు కటకటాలవెనక ఉండివచ్చాడు రంగడు. విడుదలై వచ్చినరోజు తాను అతని పాదాలపై బడి, మళ్లీ సంకెళ్లు తగిలించుకొనే పనులు చేస్తే చంపుకుంటానని ఒట్టువేసుకుంది. అప్పటినుంచి ఎన్నో బస్తీలు తిరిగారు. ఏదో దేవుడి చలవవల్ల ఇంత సంపాదిస్తున్నాడు. వడ్డీవ్యాపారులవద్ద కొన్నాళ్లు...వెండి వ్యాపారులవద్ద కొన్నాళ్లు...ఇంకొన్నాళ్లు బట్టల వ్యాపారం...

కాని ఇప్పుడు అకస్మాత్తుగా మళ్లీ పోలీసులు సాక్షాత్కరించగానే ఆమె నిర్ఘాంతపోయింది. ఏదో దారిన పోతున్న బండీ ఒక్కమాటు బోల్తాకొట్టినట్టయింది.

పోలీసులంటే తనకు తెలుసు. వాళ్లచేతుల్లో పడిన మనిషి త్వరలో బైటపడడు...ఎన్నాళ్లు శిక్ష వేస్తారో! ఈలోగా తా నేమవాలి?

ఇది కొత్త వూరు తనకు...రంగడి కుటుంబం దగ్గరనుంచి వూరిలోవాళ్లదాకా అంతా తనను దుమ్మెత్తిపోసేవారే...బజారులో వెళ్లే ప్రతిమగవాడూ గుమ్మంలోంచి తనకేసి చూసేవాడే!

బస్తీల్లో పురుషులు స్త్రీలను వేటాడుతారని తనకు తెలుసు. తాను సత్రాల్లో, ఇళ్లఅరుగులపై, స్టేషనుప్లాటుఫారాలమీదా దైన్యంతో కృశిస్తున్నప్పుడు, తమ కళ్లతో తన్నిలా హింసించేవారు!

పల్లెటూరిలోనూ అవే కళ్లను చూస్తోంది. తాను ఒంటరిగా ఈతోడేళ్లమధ్య ఎలా గడపటం?

మర్నాడు రంగడి తల్లిదండ్రులతో చెప్పింది— పోలీసుస్టేషను కెవరినైనా పంపించమని.

"ఎవరు వెళ్తారు? నువ్వే వెళ్లు...నీకేం?...మగరాయుడివి. వాడు అసలే భ్రష్టుడు...నువ్వు దాపరించాక...ఇక అనుకోవలసిం దేమి వుంది!" అని జవాబిచ్చారు.

ఆసాయంకాలందాకా ఎదురుచూసింది. ప్రియుడు తిరిగి రాలేదు. ఆమెభయం హెచ్చింది.

మరునాడు పొద్దున హఠాత్తుగా పోలీసులు మళ్లీ సాక్షాత్కరమై, ఆమెనగలూ, ఏవో వెండి సామాన్లూ తీసుకుపోయారు. అవి తన స్వంతం అని ఎంత మొత్తుకున్నా, అధికార్లు మాటవినలేదు. పోనీ పోతేపోయినయ్ నగలు...రంగడు విడుదలైతే అంతే చాలు...

ఊరంతా రంగడి గొడవతో గుప్పుమంది. పోలీసులు ఆ యువతినగలనూ, వెండిసామాన్లను స్వాధీనంచేసుకున్నప్పుడు గ్రామస్థులు నిశ్చేష్టులయారు. రంగడికి ఈ ఐశ్వర్యమంతా ఎలా వచ్చింది?

రంగడు గజదొంగ అని నిర్ధారణచేశారు.

౨

రెండేళ్లు అజ్ఞాతవాసంలో ఉండి, హఠాత్తుగా సతీసమేతంగా దర్శనమిచ్చిన రంగడిగురించి వూరంతా

ఈ రెండు నెలలనుంచీ మూగిపోతోంది. ఇళ్లలో, బజార్లలో, రేవులవద్ద, గుడివద్దా తీవ్రంగా చర్చలు సాగినయ్.

ఇలా కొన్నాళ్ళపాటు కంటికి కనపడకుండా ఉండి, మళ్ళీ హఠాత్తుగా తయారవటం రంగడికి మొదటిసారి కాదు. గడచిన అయిదారేళ్ళలో పట్టుమని వాడు పదినాళ్ళు కూడా ఇంటి పెంకెన ఉన్న పాపాన పోలేదు. ఎవరికీ తెలియకుండా మాయమయే వాడు. మళ్ళీ తిరిగి...సిల్కులాల్చీ, బస్తీచెప్పులు, చేతిగడియారం వగైరా ఘరానామనుష్యుల పటాటోపాలతో వేంచేసేవాడు. పోలీసులకు వీడు చిరపరిచితుడు.

కాని ఈసారి ఒక చక్కని పడుచును వెంట పెట్టుకొని రాగానే, వూరి పెద్దమనుష్యులకు వాడిపై శ్రద్ధ ఎక్కువైంది. వెధవ! పోనీ, ఏదో పిలిచి, మెల్లగా విషయం కదిల్చి చూద్దామా అంటే, వాడి వాలిక నిప్పు. అయ్యో! తలపొగరు! భక్తా, భయమా! తమ నీతినీ, జాతినీకూడా ఏకరువుపెట్టుతాడు.

రంగడుమటుకు మాంచి ఉత్సాహంగా, షోకిల్లాలా అటూ ఇటూ బజార్లలో నదురూ బెదురూ లేకుండా తిరుగుతూనే ఉన్నాడు.

వాడి వేషం, ధోరణీ చూసి, "పెద్ద జాతకం ఈ వెధవాయిది." అనుకున్నాడు ఆవూరి జ్యోతిష పండితుడు. వాడిని పిలిచి, ఏదో సరసమాడబోతే, "బాబుగారు...గోతిలో పడి మోకాలు చితికి నాలుగు నెలలు తీసుకోటం నేను మరచిపోలేదు" అన్నాడు రంగడు. అసలు సందేహిస్తూ, సందేహిస్తూనే అడిగాడు శాస్త్రుల్లుగారు. అనుకొన్నంతా అయింది. సంధ్యావందనం వేళ అయిందంటూ గబగబా ఇంటికి వెళ్ళిపోయాడు.

రేవులవద్ద అమ్మలక్కలూ ఊరుకోలేదు. రంగడు తేవదీసుకువచ్చిన కొత్త స్త్రీ గురించి, ఎన్నో రహస్యాలను బైటపలాగారు. అది ఇప్పటికి ఇద్దరితో ఉందనీ, ఈ పాపిష్టి వెధవను పట్నాల్లో ముంచుకుందనీ తీర్పుచెప్పారు. అసలది ఎవరినీ పెండ్లిచేసుకోలేదనీ, వ్యభిచారమే దాని వృత్తి అనీ కొందరన్నారు. దాని మొహం చూస్తేనే పంచమహాపాతకాలు చుట్టుకొంటాయని ఒక పెద్దామె అంది.

"ముఖం బాగా ఉంటుందట...పచ్చని పసిమిట...అసలు వాళ్లకులందిలా లేదుట" అని ఇంకోఆమె తగ్గు స్వరంలో దాని అందాన్ని ప్రశంసించింది.

"ఆ! అలాంటివాళ్ల ముఖాలు అలాగేఉంటయ్" అని కటువైన సమాధానం ఇచ్చింది పెద్దామె.

అంతరంగికుడైన మిత్రుడు కంసాలి కిష్టాయ్ మునసబుగారితో చెప్పాడు. "సాక్షాత్తు......రంభ! మెడనిండా నగలుకూడా నండి......వీడి అదృష్టం మంచి."

మునసబు ఈరంభయొక్క అదృశ్య అందాన్ని మానసికంగా ఆస్వాదిస్తూ, "ఒక కంట కనిపెట్టుతూ ఉండు...వీడు బందిపోటుదొంగ...ఇవాళ......ఇంత డాబుసరి...పెళ్లాం...నగలు...వీడి ఠీవి...అసలు వీడు రోజూ రాత్రిళ్లు ఊళ్ళోనే ఉంటున్నాడో...లేదో...కొంచెం వాకబుచేస్తూఉండు." అని తన సందేశాన్ని, ఆదేశాన్ని విన్పించాడు.

"రాఘవయ్యగారూ! నేను మరచిపోయానా...? పొలంగట్టున అడ్డీకి అడ్డుగా నిలబడి, వట్లూపై తెలియకుండా, తమపై ఆ వెధవ కర్ర ఎత్తటం...నేను మరచిపోలేదు. తండ్రి, వాళ్ళు కాళ్లమీద పడగానే, మెత్తని హృదయంకాబట్టి, ఊరుకున్నారు. వాడికి శాస్తి జరగనంతవరకూ..." అని ఆగాడు కిష్టాయ్.

ఈ గతపరాభవాన్ని గుర్తుకు తేగానే, అభిమానరోషాలు కలిగి, "శరభయ్‌గారి బిడ్డను కానూ... వాడికి శాస్తి తప్పదు." అన్నాడు మునసబు.

ఒకరోజు బాగా చీకటిపడ్డాక రంగడు తలుపులు తట్టి, లోపల ప్రవేశించి, ఏదో గొలుసు చూపించి, బాగుచేయమన్నాడు. కిష్టాయ్ ఓరకంటితో చూసి, "ఎక్కడిది అల్లుడా గొలుసు?" అన్నాడు.

"దానికి వాళ్ల పుట్టింటివాళ్లు పెట్టారు." అన్నాడు రంగడు.

కాసేపుండి, దీపంవెల్తురులో గొలుసును చేతుల్లో తిప్పుతూ, "వాళ్లెవరో నీకు తెలుసా ?" అన్నాడు కిష్టాయ్.

రంగడి ముఖం క్షణమాత్రం వివర్ణమైంది.

"అదేంటి మావా ! అలా అడుగుతావ్ ?" అన్నాడు.

కిష్టాయ్ సంభాషణను పొడిగించలేదు. మరు నాడు బాగుచేసి ఇస్తా నన్నాడు.

ఈ వృత్తాంతం కిష్టాయ్ చెప్పాక, మునసబు అన్నాడు. "అదే...నేను చెప్పలేదూ...దొంగబుద్ధి ఎక్కడకు పోతుంది! అందుకే ఓకంట కనిపెట్టుకూ ఉండమన్నాను."

తర్వాత కొంచెంసేపు మౌనంగా మునసబు ఏదో తీవ్రంగా ఆలోచిస్తూండడం చూసి, కిష్టాయ్ అడి గాడు. "దేన్ని గురించో..."

"అదే...రంథ అన్నానే...ఇవ్వాళ సాకల్లకు పండుగ...రేవులోంచి నీళ్లు తీసుకువెళ్తుంటే చూసే అదృష్టం కలిగింది." అన్నాడు మునసబు.

గుర్రంలా సకిలించి, "కిష్టాయ్ చెప్పిలే ఏమో అనుకున్నారు. సాక్షాత్తూ మీకళ్లతోనే చూశా రుగా..." అని, ముసిముసినవ్వులు నవ్వుతూ, "మన చేతుల్ని దాటి పోలేదు లేండి పిట్ట." అన్నాడు కిష్టాయ్.

అంతరంగికుని హామీకి మునసబుకు తృప్తికలి గింది.

ఊరిలో రంగడి పరిస్థితి కొంచెం బాగుపడ్డది. కుర్రకారులో కొంతమంది వాడికి శిష్యులుగా తయా రవుతున్నారు. కంసాలి కిష్టాయ్‌కూడా రంగడికి మిత్రు డయాడు. అంతేకాదు. ఊర్లో కొంతమందికి ఆశ్చ ర్యమూ, కోపమూకూడా కలిగిస్తున్న విషయం... కొత్తయువతితో కిష్టాయ్‌కి కొంచెం పరిచయమైంది.

మధ్యమధ్య మునసబు కిష్టాయికి కర్తవ్య జ్ఞానాన్ని బోధిస్తూనే ఉన్నాడు.

"నేనేదో దానితో స్నేహంగా ఉంటున్నా నని అనుకుంటున్నారు. ఈస్నేహమంతా దానిచుట్టూ అల్లుకున్న సాలీడుగూడు" అన్నాడు కిష్టాయ్.

మునసబుగారు అటూ ఇటూ చూసి, మెల్లగా అన్నాడు:

"ముందు వాడి పని పట్టించాలి. పక్కవూరి షేడవారింట్లో పెద్ద దొంగతనం జరిగిందిట. నగలు, వెండికంచాలు...రొక్కం పోయినయిట."

వెంటనే కిష్టాయ్ అందుకున్నాడు:

"మరి ఊరుకున్నారేం...ఇంకా...స్టేషన్‌కు కబురంపకపోయారా ?"

"కబురేమిటి ! చీకటి పడగానే పోలీసులే వస్తుంటే" అన్నాడు మునసబు దరహాసంతో.

గురువుగారి కార్యదక్షతకు మహదానందం పొంది, "నాకు తెలియదూ...రాఘవయ్యగారూ ! మీకంటపడ్డవాడూ, ఉండేలుదెబ్బ తిన్న పిట్టా సమానం అని." అని ప్రశంసించాడు కిష్టాయ్.

## 3

మూడురోజులైనా ప్రియుడు తిరిగిరాలేదు. ఆవేదనతో, నిరాశతో, అన్నపానాలు మాని, యువతి నిర్జీవంగా ఉంది. చూడవచ్చిన కిష్టాయిని బతిమాలు కుంది ఎలాగైనా సాయం చేయమని.

కిష్టాయ్ వెళ్లిపోగానే, రంగడి అన్న వెంకయ్య పావడిలోంచి వచ్చి, "ఉహూ !......అప్పుడే కిష్టాయ్‌తో ఏదో లలూచీ చేస్తున్నావే!" అన్నాడు.

గుండెలో బాకు పెట్టి పొడిచినట్టుంది ఆమెకు. నోరు తెరిస్తే పాములా విషం గక్కుతున్న ఈ పురు షుణ్ణి చూడగానే అసహ్యం, క్రోధం కలిగినయ్.

"ఇకనుంచి...నువ్వు గదిలోకి రావద్దు" అంది.

"అబ్బో...పతివ్రత..."

"ఛీ...పిచ్చిమాటలు..."అని, వెంటనే తోక తొక్కిన తాచై, "ఫో...దుర్మార్గుడా...ఇక్కడ నుంచి..."అని తీక్షణంగా చూసింది.

వెంకయ్య రోషావేశంతో ముందుకు రెండడుగులు వేశాడు. ఇంతలో పావడిలో ఏదో అడుగుల అలికిడి అయి, తండ్రిదగ్గ వినబడగానే, ఆమెకేసి రౌద్రంగా చూసి వెనక్కి తిరిగాడు.

అతని రౌద్రదృష్టి ఆమెకు పగపట్టిన పాములా ఉంది.

తన మొందటిరోజులు గుర్తుకు వస్తున్నయ్ ఆమెకు. ఆ దుఃఖం, కష్టాలు, అసంతృప్తి గట్టెక్కినాయనుకుంది. కాని మళ్లీ తన బతుకు రాళ్లపాలయేట్టుంది.

మొందటిరోజుల్లో భర్త తాగివచ్చి, పైబడి కొట్టేవాడు. పనికిమాలిన మాకనంతా చుట్టూ పెట్టుకొని, తాగుడుతందనాలతో తనను హింసించేవాడు. భర్త అసమర్థ్యం అలుసుగా తీసుకొని, మిగతావాళ్లూ తన మెడచుట్టూ చేతులు చుట్టేవారు.

ఆ దృశ్యాలు కళ్లలో మెదలగానే, ఆమెకు గుండె జలదరించింది. ఆ నరకకూపంలోంచి ఎలాగో బైటపడ్డది. అత్తింటికి, పుట్టింటికి దూరమై దేశం తిరిగింది...గతానుభవాలన్నీ తలపుకు రాగానే, గాయాలను కెలికినట్లయింది. వెధవ బతుకు...ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటే, ఇప్పటి కష్టాలూ, గతస్మృతీ ఏవీ తనను బాధపెట్టలేకపోయేవి. ఛీ! ఏమిటో పాడు ఊహలు!

పావిట్లో కిష్టాయ్, రంగడి తల్లిదండ్రులూ, అన్నదమ్ముల మాటలు గుసగుసలుగా వినబడుతున్నయ్. కొద్దిసే పయాక, పావడిగుమ్మందగ్గ అలికిడిఅయి, కిష్టాయ్ లోపలకువచ్చాడు. రక్షించమని మళ్లీ బతిమాలుకుంది.

కిటికీలోంచి బైట చీకట్లోకి చూస్తూ, "నాకూ నిద్రపట్టలేదు...నిన్ను చూస్తుంటే...రక్షించగలిగిన వాడు ఒక్కడే ఉన్నాడు." అని అన్నాడు కిష్టాయ్.

ఆతురతతో అడిగింది: "ఎవరు?"

"ఆ...ఎవరేముంది...నువ్వు చూసేఉంటావు...మునసబు." అన్నాడు ఆమెకళ్లలోకి చూస్తూ.

అతని చూపూ, స్వరమూ ఆమెను కలతపెట్టినయ్.

ఆమె మెల్లగా అంది—గాద్గదికస్వరంతో:

"ఇప్పుడు వెళ్దాం...పదండి...ఆయన కాళ్ల మీద పడి మొర పెట్టుకుంటాను...కావాలంటే డబ్బు..."

"డబ్బు ఎందు కాయనకు?...ఎబ్బె...అదేం అక్కర్లేదు. ఈపాటి భాగ్యానికి నువ్వాయన కాళ్ల మీద పడాలా?" అన్నాడు కిష్టాయ్.

ఆమె ఏమీ తోచక, భీతితో నిలబడ్డది.

కిష్టాయ్ ఆరంభించాడు:

"ఇంకా నలభయ్ దాటలేదు మునసబుకు. మంచివాడు...బాణాకర్ర పుచ్చుకుంటే పదిమందికి జవాబు చెప్పతాడు."

ఆమె ఏమీ మాట్లాడలేదు. మళ్లీ కిష్టాయ్ చెప్పకుపోతున్నాడు:

"నిన్ను ఒకరోజు రేవుకద్ద చూశాడట...నీ అందం చూసి, నీపై చాలా జాలిపడ్డాడట...నీ కన్ను ఆయనమీద పడివుంటుందిలే."

యువతి గుండె దడదడ కొట్టుకుంది. కిష్టాయ్ ముఖాన్ని చూడగానే కంపించింది. గదిలో దీపం తటాలున ఆరిపోయి, ఆ కారుచీకట్లో తన్నెవరో బాహువుల మధ్య బంధించినట్టుంది. రేవుదగ్గర చూసిన మునసబు గుర్తుకు రాగానే, ఆపాదమస్తకం వణికిపోయింది.

"పొద్దుపోయింది...రేపు వస్తాను." అంటూ లేచి వెళ్లాడు కిష్టాయ్—తన మాట లామెలో గాలి దుమారాన్ని రేకెత్తించినాయని గ్రహించి.

కొంతసే పయాక పావట్లోంచి మాటలు వినబడుతున్నయ్.

"వీళ్ల కత్తెకు వాడసేమిటి, వీడసేమిటి? కిష్టిగాడు చెప్పినదానికి 'ఊ' అంటే, రే పీపాటికి రంగడు వచ్చేస్తాడు." అని.

రంగడి అన్న వెంకయ్య అంటున్న ఆ మాటలు వినబడగానే, వెనకరోజు అతను తనవైపు ఉద్రేకంగా

రావటం, పగపట్టిన పాములా చూసి వెనక్కు తిరిగి వెళ్లిపోవటం ఆమెకు గుర్తువచ్చినయ్.

ముసలితల్లి అంటోంది: "ఛీ...ఈ మునసబు ఎక్కడ దాపరించాడో...బజారులో ఆడది తలెత్తుకొని వెళ్లటానికి వీలులేదుగదా."

మరునాటిరాత్రి రంగడి అన్న వెంకయ్య మళ్లీ గదిలో అడుగుపెట్టి అన్నాడు:

"ఆ కిష్టాయ్‌తో బింకానికి పోయావుటగా... ఈ సంగనాచివేషాలు కట్టిపెట్టు...రేపిపాటికి మావాడు వచ్చేస్తాడు...గొప్పకు పోకు...పాపం వాడు అగ్నిసాక్షిగా పెళ్లిచేసుకొన్నదానివయ్యె." పగ దీర్చుకుంటున్న వెంకయ్యను..."ఛీ...దరిద్రుడా...ఇక్కడనుంచి...ఫో" అంది. తన్ను దొడ్లోంచి కేకవేస్తున్న తల్లిమాటలు విని, అంతలో అతను వెళ్లిపోయాడు.

కొంచెంసేపయాక కిష్టాయ్ వచ్చాడు. ఆమె ముఖంలో విముఖత్వం చూసి, మెల్లగా అన్నాడు:

"వీడు...రంగడు...వట్టి వెధవ...తాగుబోతు...దొంగ...గజదొంగ...నువ్వేదో నమ్మి వాడి గోతిలో పడ్డావు."

నిజమే. కాని ఈ ఏడాదిలో తనదగ్గరకు వచ్చాక రంగడు పూర్తిగా మారిపోయాడు. తాగుడు మానాడు. దొంగతనం మానా నన్నాడు. తనెప్పుడూ మోసం చెయ్యలేదు.

కిష్టాయ్ ఆరంభించాడు:

"మునసబుగారికి నీపై జాలి కలగటం, కన్నుపడటం నీ అదృష్టం."

ఆమె నిర్జీవిలా చూసింది.

కిష్టాయ్ ఉత్సాహంగా—

"ఏముంది?...ఆయనకోరిక తీర్చటం నీ కంత కష్టం కాదు. నీకూ మేలు కలుగుతుంది" అని చెప్పి, వెళ్లిపోయాడు.

ఆరాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు.

పగలల్లా అనేకఆలోచనలతో ఆమెమనస్సు కలత చెందింది. కిష్టాయ్‌సలహా, వెంకయ్య అజ్ఞ, జైలులోని ప్రియుడు—ఈతలపులతో నిష్పమ్మగ్నమంచున్నట్టుంది ఆమెకు.

వాళ్లన్న మాటలు? తాను వీధికత్తె! నిజమే... మొగుడ్ని విడిచిపెట్టింది. తర్వాత తన్ను దగ్గరకు తీసుకొన్నవాడే తన్నొక సత్రంలో దింపి అకస్మాత్తుగా పరారయ్యాడు. మళ్లీ ఈరంగడు ఎదురయాడు—ఒక స్టేషన్‌దగ్గర. మరి ఇప్పుడు తనంటే అందరికీ ఎంత అలుసు? తాను రంగడిభార్య అన్న విషయం ఎవరూ మనస్సుకు పట్టించుకోరు. మొగుడిని విడిచి, మరొకడితో ఉంది కాబట్టి, ఎప్పుడూ ఇక అంతే అని వాళ్లంతా అంటున్నారు!

ఆత్మహత్యకై పాడునూతివద్ద నిలబడిన ప్రాణి ఆ అగాధంలోకి ఒక్కసారి చూసినట్టు, ఆమె తన దుఃఖమయ కళంకజీవితంలోకి చూస్తుంది. నిగ్రహానికతీతమైన దుఃఖంతో మూలిగింది.

నిశిరాత్రి అయింది...సావడి నిశ్శబ్దంగా ఉంది. గుమ్మంవద్దకు వెళ్లి చూసింది. అక్కడ ఎవరూ లేరు. వసారామూలనుంచి ఏవో గుసగుసలు స్పష్టాస్పష్టంగా వినబడుతున్నయ్. ఇంటిచుట్టూ దొంగలు దాక్కున్నట్టు తోచింది ఆమెకు. తీవ్రభయ మామెను ఒక్కసారిగా పెనవేసుకుంది. గాలికి సావడి చీకట్లో దండెం మీద గుడ్డ ఏదో అల్లల్లాడగానే, వెంకయ్యనీడ అనుకొని, గిలలో పాతుకుపోయింది.

వీధితలుపులు తట్టిన చప్పుడయింది. ఉలిక్కిపడి, వెనక్కు తిరిగి, మెల్లగావెళ్లి తలుపులు తీసింది.

అనిమేషంలో కిష్టాయ్‌వెనక నున్న వ్యక్తిని చూడగానే, ఆమెగుండె ఝల్లుమంది. కుడిగుండాల్లోకి జారిపోతున్నట్టుంది.

"బాబుగారే......నీదగ్గరకు వచ్చారు......నీ అదృష్టం" అని కిష్టాయ్ కొంటెగా చూసి, వీధి చీకట్లో లీనమయాడు. తలుపు గడియవేసి మునసబు మీదికి వచ్చాడు.

అతని కళ్లలో వేటకుక్కలు ఆకలితో అలమటిల్లుతున్నట్టుంది ఆమెకు.

కొలదిక్షణాలయాక ఆ పాకలో దీపపుకాంతి తగ్గింది.

పరపురుషుడు తనను చీకట్లో అదిమి పట్టుకోగానే, ఆమెకు శరీరం అంతా దహించుకుపోయి నట్లయింది. హంతకుని గుప్పిట్లో ఉన్నట్టుంది.

౪

విడుదలైన రంగడు జైలుబైట తనకోసం నుంచొనివున్న ప్రియురాలిని చూడగానే విస్తుపోయాడు.

"నేను రావటం కనుక్కున్నావా?" అన్నాడు.

ఆమె ఈమాటలు వినిపించుకున్నట్టు లేదు. జవాబేమీ ఇవ్వలేదు.

తేజస్సు ఉడిగిన ఆ ముఖాన్నీ, కళ్లనూ చూసి, "విడిచిపెట్టేశారుగా......ఇంకా ఎందుకు అలా ఉన్నావు..."అన్నాడు.

ఆమెకి ఏమీ వినబడినట్టు లేదు.

"నేను మళ్లీ దొంగతనాలు చేస్తాననుకున్నావా?... ఇదివరకే నీకు మాట ఇచ్చాగా! నమ్మవూ"అని అడిగాడు రంగడు.

ఆమె పెదవులు కదిలినయ్. కాని మాటలు వెలువడలేదు.

చెట్టుకింద సామానుతో ఉన్న ఒంటెద్దుబండీ కేసి ఇద్దరూ వెళ్లారు.

"ఎక్కడికి ప్రయాణం?"అని, "చూశావా... పాపం మళ్లీ మునసబే విడిపించాట్ట...పోలీసు చెప్పాడు" అన్నాడు రంగడు.

వెంటనే ఆమెకళ్లు అశ్రుసముద్రాలైనయ్.

"బస్తీకి వెళ్దాం...ఇక్కడ వద్దు"అన్నది ఆమె.

అధికారులు తిరిగి ఇచ్చివేసిన నగలమూట చూపించి, "మనవి మళ్లీ మన కిచ్చేశారు"అన్నాడు రంగడు సంతోషంతో.

అతని సంతోషంగాని, దక్కిన నగనాణ్యాలు గాని ఆమెకళ్లకు కనపడ్డంలేదు.

రైలు సాగిపోతోంది. ఎదురుగా బెంచిమీద కూర్చొన్న ప్రయాణీకులు...ఇద్దరు ముగ్గురు ఆమెకేసి చూశారు. ఆచూపులు చూడగానే, ఆమెహృదయంలో స్మృతిసముద్రం ఒక్కసారి హోరుమంటూ ఉప్పొంగింది.

పెట్టెలోంచి ముఖం తిప్పుకొని, బైట చీకట్లోకి చూస్తోంది ఆమె. వంతెనకిందనుంచి నది నిశ్శబ్దంగా ప్రవహిస్తోంది. పగలల్లా నావికులు పెట్టే సంక్షోభకు నదీహృదయం ఇప్పుడు సేదతీర్చుకుంటూ ప్రశాంతంగా ఉంది. చంద్రకిరణాల్లో అలలు మెరుస్తున్నయ్.

అశ్రుపూరితనయనాలతో ఆ మహాప్రవాహంకేసి చూస్తోంది ఆమె.



# రాజకీయ బాధితుడు

(ఐన ఓ ప్రణయకవిదురంత ఉదంతం)

★

శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

ఆ సుకర్ము డాఫీసరాగ్రేసరుండు
అఖిలభారతనిర్వహణాధికారి.
కాగితంపు దుర్భిక్షమేఘాళి కతడు
చండచండాతిచండ ఝంఝానిలుండు.

సకలపత్రక్షయాబ్జహేణాంకు డతడు
అఖిలపత్రక్షయాబ్ధితీక్ష్ణాంశు డతడు.
అకలాపవిలాసవిన్యాసమే, కు
లాసగా అంటె తెనుగుహాల్లీసకాల;
కాగితపు కర్వసేటి వంకాయ కతడు
బకుడి వంటింటి రోకటిబండగాడు.

వారు ఆఫీసు స్వీకరించారో లేదో
అఖిలభారత శ్వేతపత్రాళి, పొదుపు
పాలసీ ఓటి ఓంకారపరచినారు
దిగ్దిగంతదుందుభులు దిర్దిరిగిపోవ.
"కాగితం ఖర్చుచేయబోకండి మీరు"
"ఖర్చుచేకండి" "చేయనీకండి మీరు"
అంచు వాలుపోస్టర్లు వేయించె అచ్చు
విశ్వరూపాలవంటివి వేయి కోట్లు.

నవనవోన్మేషకుశ్యవిజ్ఞాపనమ్ము
పత్రరక్షణపాలసీప్రథమచర్య
కంటికిం దగిలి జనాళి వంటబట్టు
వంటబట్టదా గోడకే పట్టినపుడు.

అంచు రైటంచు ఆహ్లాద మందినాము.
కాని
చాంతో నిలవున్న సర్వపత్రాళి కెల్ల
అమరమంజులమంగళహార తోడవి
దుర్భరంపు దుర్భిక్ష మావిర్భవించె.
లేవులే యింక కాగితా ల్లేవు, లేవు
బిల్సుకైన అంటించు లేబిల్సుకైన
నోటుకైనను ప్రాంశరీనోటుకైన
లార్డులాంటి మా నోటీసుబోర్డుకైన.

సరుకు దేశాన పూర్ణానుస్వార మయ్యె
అంటె అడుగు మన గవర్నమెంటు స్టోరు
అయ్యెనో లేదు చిన్నిముక్కైన, మంత్రి
శెలవు వ్రాయ, ప్రధాని రిసైనుజేయ.
అంతియేగాదు యీ ప్రళయాంతకమున
భారతాధ్యక్షుకే లేదు పావుతావు
కార్యధారంధరుండు దీక్షావిభాసి
ఆ సుఖర్ముడి డిస్చార్జి ఆర్డ రేయ.

** ** **

ఈ ప్రణయకవిబాధ యింకెట్లు తీరు
ఉన్న సఖియ దూరాన యిరుక్కుపోయె
ప్రణయకావ్యమ్ము వ్రాయ పత్రాలు లేవు
ప్రణయలేఖైన వ్రాయ పత్రమ్ము లేదు.

---

చెప్పవచ్చును. బుద్ధులు, బోధిసత్వులు, దేవదేవతలు, గంధర్వులు, విద్యాధరులు, కిన్నెరులు, నాగులు, చక్రవర్తులు, మునులు, భిక్షువులు, యోధులు, ఆటవికులు, నాగరికులు, నానాజాతి పురుషులు, స్త్రీలు, మృగములు, గజములు, అనేక ఇతరజంతువులు, పక్షులు, పుష్పములు, వృక్షములు, వేయేల దృశ్యాదృశ్యజీవజీవము లన్నియు వీధులందు, అంతఃపురములందు, వనములందు, అడవులందు, నదీసాగరములందు, కొండలపయిన, గగనపథమున, ఇలాగు అనేకరంగములందు తమ జీవననాట్యాంశములను ఈ దివ్యకుడ్యములపయిన అతిరసవంతముగా సల్పుతూ కానవచ్చును. ఈ నాట్యము వట్టి అనుభావపరమయిన బాహ్యరూపప్రదర్శనముమాత్రమే కాక, పర్యాంతర్గతులతో గభీరమయి, మనోహరముగా ఉండును. నిశ్చయముగా, అజంతాశిల్పులు బాహ్యరూపసౌందర్యమును ఒక ప్రబలమైన పెంపద్చి, నిజఅంతర్గత ఆధ్యాత్మికరహస్యములను సారూప్యముగా, రసవంతముగా ప్రదర్శించిరి. ఈ అఖండమహాకుడ్యములనుంచి ఒక దివ్యతేజోమయమయిన మహాజ్యోతి ప్రసరించి, ఆ చిత్రముల నవలోకించు జీవిని ఏకముగా ముంచివేయును. నిజము!

నాటినుంచి నేటివరకు ఈ అజంతాచిత్రములు సవర్ణముగా, సుశోభితముగా నిలిచిఉండుటయే ఆశ్చర్యకరమయిన విషయము. ఈ చిత్రములు అనంతకాలము మనయు రహస్యము బహుశా ఆ రంగులు తయారుచేయు విధానమందేగాక, చిత్రరచనకు పూర్వము గుహాముఖమంతటికి పూసి పనముచేసిన లేపనమందు సయితము ఉండిఉండవచ్చును. మన పూర్వులు ఈ లేపనమును తయారుచేయు ఒక పద్ధతి విష్ణుధర్మోత్తరమందు చెప్పిఉన్నది. బహుశా అనేక ఇతరప్రాచీనగ్రంథములందు సయితము ఈ విధానము చేర్చాని ఉండవచ్చును. ఇంతేగాక ఈ రంగులు అనంతకాలము ప్రకాశమానముగా తొలిరీతిన నిలిచియుండుటకు, ఆ రంగులతో మిశ్రమముచేయవలసిన ఒక వజ్రలేపనమునుగూర్చి కూడ మన పురాణగ్రంథములందు ప్రసంగించిరి. విష్ణుధర్మోత్తరము, ఇటువంటి తదితర గ్రంథములు అజంతాలందు చిత్రరచన మొదలిడిన కొన్ని శతాబ్దములకు తర్వాతనే రచన లయినందున ఈ రంగుల రహస్యములను ఆ గ్రంథకర్తలు ఆంధ్రశిల్పులనుంచియే గ్రహించి ఉండవచ్చునని కూడ చెప్పవచ్చును. పండితకర్కరిచ్ గారు ఈ వజ్రలేపనమును గూర్చిన ప్రసంగము బృహత్సంహిత, అభిలాషార్థచింతామణి, శిల్పరత్నము అను ప్రాచీనగ్రంథములందు కలదని వ్రాయుచూ, అది తయారుచేయు విధానమును వర్ణించిరి. ఎనుముచర్మమును మంచినీట వెన్నవలె మెత్తగా అగునరకు ఉడికించి, ఆ నీరంతయు అరిపోయి, అది గట్టిగా బిళ్లకట్టినతర్వాత, ఆ బిళ్లను వలయునపుడెల్ల మట్టికుండయందు మంచినీట కలయ ఉడికించి, రంగులతో మిశ్రముచేసిన, ఆ రంగు లెన్నటికిని చెడవట. నిజముగా ఈ పద్ధతులను ఈ నాడు మరల తరిచి, శోధించి చిత్రలేఖనమందు వినియోగమునకు తెచ్చు ఆవశ్యకత కలదని మరిమరి చెప్పనక్కరలేదు. అయినను అటువంటి చిత్రకారులు ఇప్పు డేరీ!

అజంతాచిత్రములు సంపూర్ణ షడంగవిలాసములు. ఈ చిత్రములు తిలకించినంతనే ప్రథమమున దృష్టిని ఆకర్షించునది రేఖ. చిత్రములందు రేఖాంగము పండితానందదాయక మని మన పూర్వపు వక్త లనిరి. కాని అజంతాచిత్తరువులందలి రేఖ, పండితపామరులకు సయితము ఆహ్లాదకర మగునది అయిఉన్నది. ఈ రేఖ పూర్ణవిన్యాసపరమయి, అఖండగుణమును పూర్తిగా కలిగిఉన్నది. సాధారణముగా మంచి నునుపయిన చదరపుప్రదేశముమీదనే, అత్యుత్తమశిల్పిమాత్రమే చిత్రములందు రేఖలకు ఈ అఖండవిన్యాసలక్షణమును ఈయగలడు. అజంతాలందు చదరప్రదేశ మేర్పరచిన నిలువుకుడ్యములమీదనే గాక, వంపుతిరిగిన కప్పుంతయుకూడ, చిత్రములను సంపూర్ణముగా ఈ దివ్యలక్షణయుతమగు రేఖచేతనే అలంకరించిరి. పెట్టిన కుంచెను ఎత్తకుండ, ఒకే విసురున గీచినట్లు, ఈ రేఖలు మహాశిల్పులకు సయితము ఆశ్చర్యమును కొలుపునవి అయిఉన్నవి. ఈ చిత్రములను లిఖించిన కళాకర్తలకు అనుమానము కాని, సందేహము కాని ఎప్పుడూ కలిగినట్లు తోచదు. రేఖలందు అణుకు, అపు

దల వెతికినా కానరాదు. సర్వచిత్రములకు రూపము తీర్చరచిన ఈ దివ్యరేఖ అజంతాచిత్రకారుల నైపుణ్యము నేటికినీ అద్వితీయ మనియే తెలుపు చున్నది.

అజంతాచిత్తరువులందు రేఖాంగము సంపూర్ణము. శిల్పి ఉద్దేశించిన రూపము యావత్తు సంపూర్ణముగా ఈ రేఖమాత్రముననే ఇంపుగా స్పష్టపడు చున్నది. ఎక్కువ వర్ణము, వర్తనా (*Light and shade*) విశేషము ఆవశ్యకత లేకనే, రేఖప్రక్కగా కొలది ఛాయతోడనే, ఆ రూపముయొక్క ఘనత, అందు విదముకావలసిన నిమ్నోన్నతములు స్పష్టపడు చున్నవి. ఈ దివ్యరేఖ వట్టి హస్తనైపుణ్యావగతరచన భాగముమాత్రమే గాక మహదాంతర్యమున ఉద్భవించిన కల్పనాభాగ మయియున్నది. ఎందుకనగా రేఖకల్పన చేతనే చిత్రమును రచించుట సద్యోకవనమువంటిది. రేఖాకల్పనమాత్రముననే ఉత్తమచిత్రము జనించదు. ఉత్తమకళాకోవిదుని అంతర్యమున జనితమయిన రూపమంతయు పొంగముగా సంపూర్ణ మయియుండును. అందుచేత మహాకవి ఛందస్సునుకాని, మహాశిల్పి రేఖలనుగాని వేరుగ ఆలోచించి నిర్ణయింప నవసరము లేదు. మహదాంతర్యముననే ఉద్భవించిన ఈ దివ్య రేఖ చిత్రమందలి రూపములను స్పష్టపరచువదియే గాక, రూపములందు ఉద్దేశించిన చేష్ట, అనుభావ ములన్నింటిని విదిత మొనర్చును. ఇట్టి దివ్యరేఖలే అజంతాచిత్రములందు కానవగును. నిశ్చయముగా చిత్రరచనలందు రేఖరూపము, విలువ, వినియోగము, తత్త్వము తెలిసికొనుటకు, శిల్పులకు అజంతాచిత్రము లకు మించిన గురుపాఠము ఏదియు లేదని గట్టిగా చెప్ప వచ్చును.

అజంతాచిత్రములందు అనేక రూపములు చిత్రితమయిన వని ఇంతకుముందే వచించనైనయినది. వీటన్నిటియందును మానవరూపములే ముఖ్యమయి నవి. అజంతాలందు కానవచ్చు మానవరూపములు అనేకవిధములు. వీటన్నిటియందును రూపభేదము అతి స్పష్టము. చక్రవర్తి మొదలు భిక్షువువరకు, బోధిసత్త్వుల నుంచి విద్యాధరులవరకు, శిల్పి ఉద్దేశించిన వయో వర్చస్సులతోసహా, ఆ రూపము చూచినంతనే తెలియనగుచున్నది. ఇంతేగాక చిత్రకారు డుద్దేశించిన మనోరీతులుసయితము ఆ రూపములందు ప్రతి అంశమందునూ ప్రతిబింబిత మగుచున్నవి.

అజంతాశిల్పులు మానవాకారరచనలందు కను పరచిన సామర్థ్యము వర్ణనాతీతము. వివిధఅవయవ ముల మానప్రమాణములు కాని, రూపస్వరూపములు కాని, ఆ చిత్రకారులు ఎంచి తూచి, కృషిచే ఏర్ప రచినట్లు ఏమాత్రము కానుపించదు. అతిస్వేచ్ఛన చేతి కొచ్చినరీతి, కండ్లు మూసికొని లిఖించి పారవేసిన చిత్రములవలె ఇవి కన్పడును. అయినప్పటికీ ఈ మాన వాకారరచనలందు ఏవంకరకాని, పొరపాటు కాని, లోటుకాని వెతికి చూచినను కానుపించదు. సరిగా ఉండవలసినరీతి, సర్వావయవములు, అవయవభాగ ములు సమముగా ఏర్పడి, రమ్యాతిరమ్యములయిన మానవస్వరూపములే ఈచిత్రములందు కానవచ్చును.

నిశ్చయముగా కృషిని మరపించునదియే కళ యగును. అజంతాలందలి చిత్రములందలి మానవాకార ములను తిలకించునప్పుడు, కళాకర్తకృషి యే మాత్రము కానరాదు. అతడు ఉద్దేశించిన రూపములు, భావ ములు మాత్రమే గోచరించును. భావన, కల్పన రచన లన్నీ ఏకముగా ఒకే క్షణమందు శిల్పమందు అతిసునా యాసముగా ఉద్భవించిన రీతి ఈ చిత్రములు కాన వచ్చును. ఇదే ఉత్తమశిల్పమునకు ఒక మహాలక్షణము. ఈ లక్షణ ముండిననే కాని ద్రష్ట శిల్పమందు శిల్పితో ఏకమవుట సంభవింపదు. ప్రథమమున ఆంధ్రశిల్పులు ఈ లక్షణావసరతను గుర్తించి, మానవాకార రచన లందు సాధిచిరి. శిల్పమం దీలక్షణము కుదురుటకు వట్టి హస్తనైపుణ్యము ఎంతయినను చాలదు. శిల్పి భావన రూపొనర్చిన కల్పనము గూర్చిన ప్రబలఉద్వేగ మొకటి అతని హృదయమును ఆవరించి, అతని తత్త్వమందు ప్రసరింపవలసియుండును. ఈ మహాశిల్పలక్షణసరి సర్వత్ర అమరావతి శిల్పములందు స్పష్టముగ కాన వచ్చును. తరువాతి శిల్పులు ఈ మహాలక్షణమును అవ గాహనము చేసికొని, అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా లందు మానవాకారరచనలందు పూర్తిగా ఈగతిని అను

సరించిరి. ఇంతేగాక చీనా, జపాను మొదలయిన సర్వప్రాగ్దేశములందును శిల్పులు సయితము ఈ లక్షణమును ప్రాధాన్యముగా కొని, ఒక అద్భుత చిత్రశైలిని ఉద్భవింపజేసిరి. దాదాపు ఒక శతాబ్దమునుంచి పాశ్చాత్యచిత్రకారులు చీనాజపానుచిత్రములందు ఈ మహాలక్షణమును గుర్తించి, తమ చిత్రకళయందు ప్రవేశపెట్టుటకయి ప్రబలకృషి చేయుచున్నారు. అంతవరకు ఉత్తమపాశ్చాత్యచిత్రములందు చిత్రకారుని ప్రబలకృషి చిత్రములకు విలువ నిచ్చు అంశములందు ఒక ప్రబలస్థానము వహించినమాట వాస్తవము.

అజంతాలందు మానవాకారములలో, అత్యాకర్షణీయమయినవి స్త్రీరూపములు. పండిత గ్లాడ్స్టను గారన్నట్లు, ఈ స్త్రీరూపములను పుష్పములవలె అజంతాచిత్రకారులు వాడినమాట వాస్తవము. నిశ్చయముగ అజంతా స్త్రీరూపములు దివ్యపరిమళమయములయి, మిక్కిలి మనోరంజకము లయినవి. చక్రవర్తులను, రాకుమారులను, ఈ దివ్యస్త్రీరూపములు పుష్పమాలలరీతి పరివేష్టించి ఉండును. అట్లు లేనపుడు వీధులందు, గవాక్షములందు, సౌధములందు, వృక్షచ్ఛాయలందు విదజల్లిన పుష్పములరీతి ఒకటిగాను, రెండుగాను, విడివిడిగాను వికసించుచు కానవచ్చును. ఈవిధముగ స్త్రీరూపములను ఇంత విరివిగా వినియోగించుట ఆంధ్రశిల్పులు పాంచిస్థూపములందు ప్రవేశపెట్టిన విలాసమయరతిభావగతిపర్యవసానమే కాని వేరుకాదని చెప్పనక్కరలేదు. నిజముగా ఆంధ్రకళ శృంగారపర మనక తప్పదు.

అజంతాచిత్రకారులు స్త్రీరూపములను అనేక భంగిమలందు చిత్రించిరి. రాతిశిల్పమందు ఈ భంగిమలన్నియు కానరావు. అపారమయిన చిత్రకారుని స్వేచ్ఛ అజంతాలలో స్త్రీరూపములందు పూర్ణముగా కానవచ్చును. కృష్ణనర్మోత్తరమందు చెప్పిన ఋజ్వాగత మొదలయిన తొమ్మిది భంగిమలందే గాక, అనేక ఇతరదివ్యవిలాసమయభంగిమలందు సయితము స్త్రీరూపములను ఈ శిల్పులు చిత్రించిరి. ఈ భంగిమలందు నిర్దేశించిన స్త్రీరూపము వట్టి భంగిమఆభాసము వలె ఏమాత్రము కనుపించదు. నిజముగా స్త్రీయే ఆ భంగిమయందు రూపొందినరీతి కానవచ్చును.

స్త్రీరూపమందలి రమ్యత వట్టి ఆకారమందే కాక మానసికముకూడ. కాని స్త్రీమానసికసౌభగు అప్పుడప్పుడు మెరపుతీగవలె మెరసి, అంతలోనే అదృశ్యమయి చిక్కరానిదయి ఉండును. అయినను అజంతాశిల్పులు ఈ దివ్యఅంతర్గతసౌందర్యమును సయితము చిక్కబట్టి, వారు చిత్రించిన ప్రతిస్త్రీరూపమందును నిలిపి ప్రదర్శించిరి. ఇది సామాన్యచిత్రకారులకు ఏమాత్రము సాధ్యముకాదు. ఏలనన వట్టి హస్తనైపుణ్యమే ఈ కార్యమునకు చాలదు. నిజముగా, స్త్రీల సహజమానసికసున్నితసౌందర్యము అతి సునాయాసముగా బాహ్యరూపరచనలందు పూర్ణముగా ప్రదర్శింపగలిగిన ప్రాచీనఆంధ్రచిత్రకారుల ప్రజ్ఞను మనము కొనియాడలేము.

అజంతా స్త్రీరూపములందు సయితము వక్ష, జఘనభాగములందు ఒకింత అతిశయోక్తి కానవచ్చును. నిజముగా ఈ అతిశయోక్తి సమస్తహైందవకళలందునూ అలంకారభాగమయియున్నది. ఈ భాగములందు అతిశయోక్తి లావణ్యపరముగా ఆంధ్రశిల్పులు పాంచి తోరణశిల్పములందే ప్రవేశపెట్టిరి. అజంతాలందు స్త్రీరూపములందు ఈ అతిశయోక్తి మరింత రమ్యత నిచ్చునదియే అయియున్నది. కాని స్త్రీరూపమునందు ఏమాత్రము వికృతమును ఆపాదింపలేదు.

అజంతారచనలందు, పాశ్చాత్యశిల్పులను, విమర్శకులను ఏకముగా ఆశ్చర్యచకితులను ఒనర్చినవి హస్తములు, నయనములు. హైందవకళయందు ప్రతి పాశ్చాత్యవక్త పొగడ్తల కన్న అంశము హస్తనిర్మాణము. మానవహస్తమందలి వేలు, గోరు, ప్రతిభాగములు సమముగా, చాల ఇంపుగా ప్రదర్శించుట హైందవశిల్పిసామ్యము. ఇంతే గాక కళాకర్త చిత్రరూపమునకు ఉద్దేశించిన మానసికభావములను వ్యక్తపరచుటకు మన శిల్పులు హస్తములను వినియోగించిరి. భారత, పాంచిస్థూపశిల్పములందు మానవహస్తములకు ఈ సొంపు, అర్థము కానము. బహుశా ఆ శిల్పములు

అతిచిన్నవి అయినందున, వీలులేక హస్తములను అంత ప్రత్యేకముగా నిర్మింపలేదని తోచును. కాని అజంతాలందు విశాలముగా చిత్రించిన దివ్యరూపములందు ఆంధ్రశిల్పులు స్వేచ్ఛానువర్తిని అతిసొంపుగా ఈ హస్తములను ప్రదర్శించిరి.

గాంధారశిల్పమునకూడ ఈ హస్తములు అతి ఇంపుగా కానవచ్చును. కాని మానవహస్తపూర్ణవికాసము అజంతాచిత్తరువులందే కానవచ్చును. అజంతా చిత్తరువులందు ఆంధ్రశిల్పులు రచించిన హస్తరూపములు అద్వితీయములు. కవులు వర్ణించిన రీతి, కమల రేకుల రూపమున వేళ్లను కలిగిన ఈ హస్తరూపములందు ప్రథమదృశ్యమున ఒకింత అతిశయోక్తి తోప వచ్చును. కాని రసికుడయి, సర్వ మెరిగిన పండితునకు అందమయిన వేళ్ల నిజరూపము అదిగాక వేరుకాదని వెంటనే తెలియగలదు. ఇంతేగాక అజంతాహస్తములందు ప్రతివేలు జీవము కలది అయి, లయపరమయి, ప్రత్యేక నాట్య మొనర్చుచున్నటు లుండును. విశ్వమందలి సర్వలావణ్యము ఇమిడిన ఈ అజంతాహస్తములు తన్నిర్మాతలయిన ఆంధ్రచిత్రకారుల దివ్య హస్తరూపములను గూర్చిన ఆలోచనలు పురికొల్పక మానవు.

అజంతాల తర్వాత, హైందవశిల్పమందంతటను హస్తములను అతినిపుణతతోను, భావపరముగాను రచించుట పరిపాటిఅయినది. కాని అజంతాహస్తములందలి సోసు, లావణ్యము, సౌకుమార్యము ప్రత్యేకము. హస్తములందీశైలి ప్రత్యేకముగ ప్రాచీన ఆంధ్రకళా భాగమనే చెప్పవలయును.

అజంతాహస్తరూపములవలెనే అచట చిత్రితములయిన నయనరూపములు నయితము చాల ప్రత్యేకము. ఈ నయనరూపకల్పనలను గూర్చి పండిత ఆక్నలుజారెలుగారు ఈరీతిన పలికిరి : "తెలియని పామరునకు ఈనయనరూపములు ప్రకృతికి వేరయి, వికృతముగా తోపవచ్చును. కాని రసికుడయిన పండితునకు ఈనయనరూపరేఖలు మానవ నయనమును మాత్రమే ప్రదర్శింపగలవని తప్పక తెలియును. ఇంతేగాక, ఈ నయనరూపములు తిలకించినంతనే, అజంతాశిల్పుల మానవనయనరూపావగాహనము పరిపూర్ణమని వెంటనే తెలియగలదు. నిజముగా ఈరీతిన ఆనాటి శిల్పులు నయనస్వరూపమును తెలిసికొనకలిగి ఉండుటయే ఆశ్చర్యకరము." ఈ మహాశయుం డన్న వాక్యములు సత్యములు. ఇందతిశయోక్తి ఇసుమంతయును లేదు. నిశ్చయముగ, అజంతా చిత్రకారుల నయనరూపప్రదర్శనము వట్టి ఆకారఆభాసమును మించి భావగర్భిత మయినది. హస్తములను మించి చిత్రకారుడు ఆరూపమునకు ఉద్దేశించిన మనోగతి ఈ నేత్రములందు స్పష్టముగా ప్రదర్శిత మగుచున్నది. అతిసోగగా, ఇంపయిన ఈ నయనరూపములను ఈనాటి చిత్రకారు లెందరో అజంతాలరీతిన ప్రదర్శించుటకు పెనగులాడినమాట వాస్తవము. కాని నిజ అంతర్దృష్టి కానము లేమిచే, వార లెందరో నయన రూపములందు ఈ సొంపు, గభీరత ఏకముగా ప్రదర్శింపలేక భంగపడినమాట వాస్తవము.

మానవాకారచిత్రరచనలందు తదనుసారితవసనములను చిత్రించుటకు కూడ చిత్రకారునికి ప్రావీణ్యము అవసరము. వసననిర్దేశమందు, లోనున్న శరీరాకారమును స్పష్టపరచుచూ, వసనములందు ఏర్పడు ముడుతలు సరిగా ప్రదర్శించుటకు శిల్పి చాల నిపుణుడయి ఉండవలయును. అజంతాచిత్రకారులు వసనములు చిత్రించునపుడు, ఈ రెండంశములను చక్కగా పాటించి, అనంతలావణ్యమును కూడ పొందుపరచిరి. అత్యవసరములయిన కొలదిరేఖలతోడనే, వసనములను ఏమాత్రము భార మొనర్పక, మహా ఇంపుగా, మంచి నేర్పరితనముతో, ఈ వసనములను చిత్రించిరి. వసనములతో పాటు అనేక దివ్యాభరణములతో, ఆ శిల్పులు స్త్రీపురుషరూపముల నెల్ల అలంకరించిరి. రూపమునకు తగినయట్లు అనేక వింతవింత ఆభరణములు ఈ చిత్రములందు కానవచ్చును. ఈనాటి విశ్వకర్మలు ఈ దివ్యాభరణముల రూపములనే మరచిన ట్లున్నది. వారొకపారి అజంతాచిత్తరువులను తిలకించుట చాల మంచిది. ఇంతేకాక చిత్రకారుడు ఉద్దేశించిన స్థూల చలనములను స్పష్టపరచుటకయి, అజంతా

చిత్రకారులు, ఈ ఆభరణాలంకారములను అతి నిపుణతతో వినియోగించిరి. ఆపయిన విరివిగా వాడిన ఈ ఆభరణాలంకారములే అజంతా గుహాకుడ్యములకు ఒక దివ్యరూపమును కల్పించినవి. చిత్రములందు ఆభరణముల సంపూర్ణ వినియోగము మన పూర్వపు శిల్పులు ఎరుగుదు రనుటకు ఏ సందేహము లేదు. నిజముగా తర్వాత రానురాను శిల్పమందు ఆభరణప్రదర్శనము హైందవశిల్పమందు ఒక ప్రధాన లక్షణ మయినమాట వాస్తవము.

మానవాకారకల్పనలందు అజంతాచిత్రకారులు కనుపరచిన వివిధకేశబంధములు సయితము మనలను ఆకర్షింపక మానవు. స్త్రీపురుషులందరు అందమును ఇనుమడించుటకు కేశములను పూర్తిగా పూర్వము వినియోగించినట్లు అజంతాచిత్తరువులే ప్రబలతార్కాణము. ఈనాడు చూచటకూ కానరాని అతిదివ్యకేశబంధములు, శిరోభూషణములు అజంతా స్త్రీపురుషశిరస్సులందు కానవచ్చును. ఈనాటి స్త్రీలు, విగ్గులు చేయువారు అజంతాలందు చిత్రితములయిన కేశబంధములను తప్పక చూడవలసియుండును.

మానవస్వరూపము ఇంత చక్కగా ఎరిగి, పరిపూర్ణవికాసముతో అజంతాశిల్పులు చిత్రించినప్పటికి, కాళ్లు కొలది నీరసించినట్లు కానరావచ్చును. పాశ్చాత్యవక్తలనేకులు ఈరీతినే, బలిష్ఠమయిన పిక్కలు ఏర్పడక కాళ్ల రూపములు అజంతాలందు నీరసించిన వనిరి. కాని ఇది చాల పొరపాటు. లావయిన పిక్కలు కలిగిన పాశ్చాత్యదేహరూపము లకు, పాశ్చాత్యశిల్పములకు అలవాటుపడినవారికి ఈ కాళ్లు నీరసించినట్లు తప్పక తోచును. కాని సోగగా, చివరకు సన్నమయి, జింకలకాళ్లవలె నుండు కాళ్లు అతిశయించిన వేగమును ఈయగల వని హైందవ సంప్రదాయము. అజంతాచిత్రకారులు తమ రచన లందు ఈ అనాదిసంప్రదాయమును అనుసరించే, మానవ రూపములకు కాళ్లను నిర్మించిరి. ఈ సంప్రదాయము పట్టి అజంతాచిత్రములందే కాక, ఎలిఫెంటా, ఎల్లోరా మొదలయిన సర్వహైందవశిల్పములందును కానవగును. నేటికిని, సర్వహైందవశాలిములందు అనాదినుంచి సంప్రదాయపరమయిన కసరత్తుగరిడీలు సయితము కాళ్లకు ఈరీతిరూపమునే ఒసంగును. హావెలు, గ్రిఫిత్తు మొదలయిన కొలది పాశ్చాత్యవక్తలు ఈ అనాదిహైందవసంప్రదాయము నెరిగి, కాళ్ల నిర్మాణ మందు అజంతాశిల్పులు ఏ పొరపాటు ఒనరింపలేదని నుడివిరి.

అజంతాచిత్రములందు మానవరూపరచన చర్చ పాశ్చాత్యమర్మజ్ఞుడయిన పండిత లారొన్జో సికొర్కనీగారి వాక్యములను కొన్ని ఉదహరించి ముగించెదను. అజంతాలందు ఒకటవగుహలో చిత్రిత మయిన ప్రఖ్యాత అవలోకితేశ్వరపద్మపాణి బోధిస త్వుని చిత్రమునుగూర్చి వా రీరీతిగ అనిరి: "ఇనుమం తయు వార్నిషు తైలము వాడకయున్నను, వెనుపర్వ తమురీతిని ఉన్న ఈ మహాబుద్ధచిత్రము అద్భుతమయి నది. దివ్యరూపరేఖాయుతమయి, ఈ చిత్రము మైకేలు అంజిలోచిత్రములను, సిస్టయినుఛాపెలుచిత్రములను స్మృతికి తెచ్చుచున్నది. ఇం దేర్పడిన దేహవర్ణము అతి స్వచ్ఛమయి వర్ణనా (*Light and Shade*) విశేషమందు ఏర్పడిన నీడలు అతి చేటనయి, కరెగియో చిత్రములందువలె ఉన్నవి. ముఖకల్పన, అందు విదితమగు భావపరంపరలు అతి అమోఘమయినవి. శిల్పరచనావిశేషమందలి కైశాల్యము, అపారత ఈ చిత్రమందలి విజప్రకృతిరూపనిర్దేశపరిపక్వత, ఇటలీ రినాజాన్సుకాలమందలి మహాశిల్పుల చిత్రములకు సమాన మొనర్చుచున్నది. ఇందు బుద్ధచిత్రమునకు కుడి వైపున ఉన్న స్త్రీరూపమునయితము అతి చేటనయి, ఇంత ప్రావీణ్యమును ప్రదర్శించుచున్నది. పుష్పమును ధరించిన కరము అతిఇంపుగా బహుప్రజ్ఞతో శిల్పి చిత్రించెను. ఈ చిత్రమందలి తక్కిన అంశములన్నియు ఇదేరీతిన అతిసొంపుగా చిత్రితమయినవి. రూపములు, రచనశైలి ఇం దతిస్వచ్ఛములు. ఇందలి వర్ణికాభంగిమ యావత్తూ ప్రకృతి కనుగుణ్యమయి, అతిలావణ్య మయము. ఈ చిత్రమందు ప్రధానముగా కానవచ్చు రజతనీలవర్ణద్వయము మేళవింపు అతిసొంపు."

అజంతాలందు చిత్రితములయిన జంతురూప ములు సయితము అతిఇంపుగా మహాప్రజ్ఞతో రచన

లందినవి. ఈ జంతురూపములందు అతిరమణీయమయినవి ఏనుగులు, లేళ్లు. గజరూపరచనయందు హైందవ శిల్పుల ప్రావీణ్యత అద్వితీయమని అనేక పాశ్చాత్య వ్యక్తులు కొనియాడిరి. నిశ్చయముగా, అజంతాగజరూపములు ఏనుగుల మానసికరాగములన్నియు అతి స్పష్టముగా తెలుపునవి అయి ఉన్నవి. ఏనుగుహృదయము మానవహృదయమంత విశాలమే గాక, సున్నితమని కూడ అజంతాచిత్రములందు తేటమగుచున్నది. ఈ చిత్రములందు ఏనుగులు అతి సుందరముగా అనేక భావభంగిమలందు విహార మొనరించుచున్నవి. అజంతాలందు లేళ్ల రూపములు పయితము సొంపును సూర్తీభవించును. మన కళాసంప్రదాయమందు లేళ్లు శృంగారమునకు అనుబంధములు. అందమయిన స్త్రీలకు భీతహరిణనేత్రము లుండును. పసిపిల్లలచందమున కల్లా కపట మెరుగని, విమలమయి అతిసున్నిత మయిన మనస్సు జింకలది. ఈ జింకలు ఋషుల ఆశ్రమములను అలంకరించును. అజంతా లేళ్లు ఈ పై గుణముల నన్నింటిని కలిగిఉన్నవి. ఈ లేళ్ల రూపములు ప్రకృతిని ప్రతిబింబించురీతిన అనేక చిత్రవిచిత్ర భావభంగిమలందు అతిఇంపుగా అజంతా శిల్పులు చిత్రించిరి.

అజంతాచిత్రములందు పక్షిరూపములు పయితము అతిసుందరములు. పక్షులు విశ్వప్రచ్ఛాదనమయిన ఆకాశమునకు సజీవాభరణములు. పక్షులు వాలిన స్థలముల నెల్ల అలంకరించును. ఎంత చక్కటి ఉద్యానవనమయినను, పక్షులు లేకున్న నిర్జీవమయి అందమున కొలుపదు. అజంతాచిత్రకారులుకూడ అందమును ఇనుమడించు సజీవాభరణములచందమున బ్రహ్మవలె పక్షిరూపములను వినియోగించిరి. పక్షులందు కానవచ్చు సహజకోమలము, మృదుత్వమును అజంతాచిత్రకారులు చిక్కబట్టి ప్రదర్శించిరి. ఈ పక్షులు అనేకభంగిమలందు, అతి విలాసముగా కనుపించును. కొన్ని పక్షి రూపములందు మాత్రము ఒకింత అతిశయోక్తి కానరావచ్చును. అయినను అలంకారమునకయి ఆభరణములరీతి చిత్రించిన ఈ పక్షిరూపములు చూచినంతనే, వాటి అందమును మాత్రము గమనించి అతిశయోక్తిభాగమును మరిచిపోదుము. నిజము!

అజంతాలందు చిత్రితమయిన అచలప్రకృతిభాగములయిన చెట్లు చేమలు కొండలయినవి కూడ చాల అందమయినవి. ప్రకృతి అంతర్యము నెరిగి, అనురాగమనస్కులయి చిత్రించిన రూపములే ఇవి కాని, బాహ్యరూపమును మాత్రమే గమనించి రచించిన పట్టి హస్తనైపుణ్యప్రకటనచిత్రములు ఏమాత్రమును కావు. అచలప్రకృతిభాగములయి, సర్వప్రకృతివికాసమును సంపూర్ణముగా వ్యక్తపరచు పుష్పముల రూపరచనలందు అజంతాశిల్పులు తమ ప్రజ్ఞను అనంతముగా వినియోగించిరి ఎంకివలె పూల మనస్సులు, పూల బాసలు సంపూర్ణముగా ఈ శిల్పు లెరుగుదురు. పూలయందలి సొంపు, కోమలత, స్వచ్ఛత, వర్ణముల ప్రకాశము, వికాసము, వికాసము, పరిమళముతో అజంతాచిత్తరువులందలి పుష్పములు విరాజిల్లుచున్నవి. నిజముగా పుష్పరాజములయిన కమలముల రూపరచనలందు అజంతాశిల్పులు సిద్ధహస్తులు. అజంతాకమలములకు మించిన సొంపు కలిగిన కమలరూపములను, ఈనాటివరకు ఏ ఇతరశిల్పియు చిత్రించలేదనుట అతిశయోక్తి ఏమాత్రము కాదు. కమలములు దేవతాసనములని అజంతాకమలములను తిలకించినంతనే తోపక మానదు

అజంతాలందు కానవచ్చు దివ్యరూపములందు అలంకారయుతపద్మములు, కల్పలతలు కూడ చాల ముఖ్యమయినవి. ఇటువంటి రూపములు ప్రకృతియందు ఎందునూ కానరావు. అందుచేత ఈరూపకల్పనలకు చిత్రకారుని మనోవికాసమే ప్రధానము. అజంతాచిత్రకారుల మనోవికాసము అంతు లేనిది. ఈ అపారమనోవికాసమునకు తగినటువంటి హస్తనైపుణ్యము అజంతాచిత్రకారుల సొమ్ము. ఈ విషయమంతయు అజంతాలందు రచనలయిన అలంకారచిత్రములందు పూర్తిగ విదితమగుచున్నది.

అజంతావర్ణచిత్రము లొక మహాప్రపంచము. ఆ మహాశిల్పులు రచించిన రూపములు అనంతములు.

అయినను అజంతావర్ణచిత్రములందు పునరుక్తిదోషముగ కానను. ఘనశిల్పములం దున్న కల్పనలు కొన్ని వర్ణచిత్రములందు కానవచ్చునే కాని, వర్ణచిత్రములందు పునరుక్తిదోషము కన్పించదు. నిశ్చయముగ అజంతా శిల్పుల ఆంతర్యములు విశ్వసమానములు.

రేఖలు, రూపములు తిలకించినంత, అజంతా చిత్రములందు వర్ణములను ఒకింత గమనింపక తప్పదు. ఈ చిత్రములందలి వర్ణికాభంగిమ అనేకమంది శిల్పులను, పండితులను ఆశ్చర్యచకితులనుగా ఒనర్చె నని ఇదివరకే అన్నాను. ఈ ఆశ్చర్యమునకు కారణము, ఆ వర్ణములు ప్రకాశవంతముగ తొలి స్వచ్ఛతను ప్రకటించుచూ నేటివరకు నిలిచియుండుటే కాదు. అజంతాచిత్రములందు అనేకవర్ణములు కానుపించునప్పటికిని, ఆ శిల్పులు వాడిన రంగులు అయిదు మాత్రమే. ఎరుపు, పసుపు, నీలము, తెలుపు, నలుపు. ఈ అయిదు మూలవర్ణములతో, అతినేర్పున అజంతా శిల్పులు ప్రకృతియందలి సర్వవర్ణములను అనేక ఛాయలందు ప్రదర్శించిరి. అజంతాలందు ప్రదర్శితమయిన వర్ణికాభంగిమయొక్క సొంపు ఏ ఇతర ప్రాచీనచిత్రములందును కానరాదు. ఈ సందర్భమున ఫ్రెంచిపండితుడయిన ఆక్సెల్ గారన్న కొన్ని వాక్యములు తప్పక ఉదహరింపతగినవి: "అజంతాలందలి వర్ణములు అతిస్వచ్ఛములయి, ఇతరదేశములందు ఇటువంటి చిత్రములన్నిటియందుకంటె అతిప్రకాశవంతమయినవి. ఈజిప్టునందు కాని, పాంపేగృహచిత్రములందు కాని, ఇటలీచర్చిల కుడ్యములపై లిఖించిన చిత్రములందు కాని వర్ణములకు ఈ సొంపు అబ్బలేదు. శతాబ్దములు గడచినను, అతినిపుణతతో ఏర్పరచిన ఈ వర్ణికాభంగిమ అతిఇంపయి, కన్నులపండువగా నున్నది." నిజముగా మహాశిల్పికి ఎక్కువ వర్ణముల అవసరత లేదని అజంతాచిత్రములు స్పష్టముగా తెలుపును. ఇంతేగాక అజంతాలందలి వర్ణికాభంగిమ అతిసున్నితముకూడ. చిత్రరూపమునకు తగిన వర్ణములు వాడుటయే గాక, తనుగేతిన వర్ణములందు తేజప్రమాణములు (*Tones*) ఏర్పరచి, స్థాయీలపరముగ అనేకచ్ఛాయలందు పొందుపరిచిరి. నిజముగా ఈనాడు అజంతాలందు చిత్రములను తిలకించుటకే, వెలుతురు ఒక్కొక్కచోట చాలదు. అయినప్పటికీ, ఆ గుహభాగములందలి చిత్రములందు సయితము వర్ణములు అతిసమముగాను, సూక్ష్మముగాను వాడి, దివ్యచిత్రములను రచించిన ఆ శిల్పుల దృష్టి దివ్యమనియు, ప్రజ్ఞ అపారమనియు అనుటలో ఏ సందియము లేదు.

రేఖ, రూపము, వర్ణరచనలందే కాక, సంకలన, సాదృశ్యతలందు (*Composition and Perspective*) సయితము అజంతాశిల్పులు అతినిపుణులు. ఈ చిత్రములందు సంకలనము అతిసుందరము. అజంతా చిత్రములందు, సంకలనమందు ఒక గొప్ప విశేషము కానవచ్చును. చిత్రమందు ఏర్పరచిన ప్రతిరేఖ, వర్ణము, వర్తనావిశేషము (*Light shade*), రూపముల కూర్పు అన్నియు ఒక పద్ధతిన మన దృష్టిని చిత్రమందలి ప్రధానాంశమునకు ఈడ్చుకపోవును. చిత్రములందీ గుణమును పాశ్చాత్యవక్తలు పిక్టోరియల్ ఆర్కెస్ట్రేషన్ (*Pictorial orchestration*) అని అందురు. గానమునకు రాగమువలె, చిత్రమునకు ఈ గుణము ప్రాణమువంటిది. చిత్రసమ్మేళనరాగ మని మనము దీనిని అనవచ్చును. చిత్రమునకు ఈ రాగము ఏర్పరచుటకు చిత్రకారుడు చిత్రమునందు సదు ద్రష్ట దృష్టికి ఒక నిశ్చితపథమును ఏర్పరచవలయును. ఈ పథము ఒక నిశ్చితగతిన చిత్రమంతటను కలయతిరిగి, చివరకు చిత్రకేంద్రమయిన ప్రధానాంశమందు (*Ultimate point of rest*) లీనమయిపోవలయును.

ఈ రాగము లేని చిత్రము ఖండఖండములుగా చూడవలసివచ్చి, ఒక్కొక్కప్పుడు చిత్రకారుడు ఉద్దేశించిన కొన్ని అంశములు దృష్టి కానక, ఏకత్వము లేనిదయి, రసవంతము కాని దగును. రాగము లయభాగము. రససృష్టియే చిత్రరచన ఉద్దేశముగా కలిగిన అజంతాచిత్రకారులు ఈ చిత్రసమ్మేళనరాగ ప్రకృతిని బాగుగా ఎరిగి, తమ చిత్రరచనలందు పాటిసిరి.

పాశ్చాత్యవక్తలందు ఆక్సెల్ జారల్ గారు అజంతాచిత్రములందు ఈ రాగగతిని ప్రథమమున

గుర్తించిరి. కాని ప్రాగ్దేశీయులయిన చీనా, జపాను చిత్రకారులు అనాదిసే ఈ రాగమును అజంతాచిత్తరువులందు గమనించి, చిత్రకల్పనయందు ఈ మహాలక్షణ అవసరతను గుర్తించి, తమ చిత్రములందు ఈ దివ్య లక్షణమును ఒక పరిపక్వమునకు తెచ్చిరి. ఇటీవల, దాదాపు ఒక శతాబ్దమునుంచి, చీనా, జపాను చిత్తరువులను చూచి పాశ్చాత్యశిల్పులు తమ చిత్తరువులందు ఈ లక్షణమును ఏర్పరచుటకయి అనంత కృషిని సల్పుచున్నారు. సంకలనచిత్రములకు పరమ లక్షణమని ఈనాడు మహావక్తలు గుర్తించిన చిత్ర సమ్మేళనరాగమునకు ఆదిస్వరకల్పన ఒనర్చిన ఆంధ్రశిల్పులు శిల్పబ్రహ్మలనక తప్పదు.

ఇంతేగాక సాదృశ్యన్యాయములందు క్షయ వృద్ధిన్యాయము [*Foreshortening Principle*] అనాడే ఆంధ్రశిల్పు లెరిగి, తమ చిత్రరచనలందు చక్కగా పాటించిరి. పాశ్చాత్యదేశములందు క్రీస్తుకు తర్వాత పన్నెండుశతాబ్దములు గడచినవెనుక వచ్చిన మహాశిల్పులు ఈ క్షయవృద్ధిన్యాయమును గుర్తించి, ప్రథమమున తమ చిత్రములందు ఈ న్యాయమును ప్రవేశపెట్టిరి.

అజంతాచిత్తరువులందు మరొక చిత్రవిశేషము కలదు. పెద్దచిత్రములు చిన్నవాటికన్న ఎక్కువ సొంపు, మెరుగు కలిగియున్నవి. చిత్రము పెద్దదయిన కొద్ది, రచనకు ఎక్కువ స్వేచ్ఛ కలుగును. కాని ప్రదేశ మెక్కువ అయినందున, ఆ ప్రదేశమును సమముగా నింపుటకు శిల్పికి అతిశయించిన కల్పనాచాతుర్యము అవసరము. కాని స్వేచ్ఛన రాణించుటే ఆంధ్రుల ప్రధానగుణము. అందుచేత ఎక్కువ స్వేచ్ఛ నొసగు పెద్ద చిత్రములందు, కల్పనాభాగము భారమయినప్పటికీ, ఆంధ్రశిల్పుల చాతుర్యము అతిశయించినది. నిశ్చయముగా, రూపురేఖలు, తదితర సర్వశిల్పలక్షణము లందును స్వేచ్ఛాకల్పనశైలి ఆంధ్రశిల్ప లక్షణము లందు ఒకటి. తక్కిన సర్వహైందవశిల్పశైలులందును ఈ గుణము ప్రధానముగ కనుపడదు. మహాపండిత గ్రిస్వీడెలుగా రన్నట్లు, బంగారు, వెండి, దంతపు శిల్పముల నొనర్చు విశ్వకర్మలరీతి, ఆభరణములను పోలు సూక్ష్మాలంకారము ప్రధానముగా ఇతర హైందవశిల్పములందు విదితమవును.

సిద్ధహస్తులయిన అజంతాశిల్పులు ఇంత నిపుణతతో రచించిన ఈ దివ్యచిత్రములందు సయితము ఒక్కలోటు తప్పక కానవచ్చును. చిత్రములకు వెనుక భాగమందు ఏర్పడు హర్మ్యరచనలందు సాదృశ్యము (*Perspective*) చక్కగా పాటించినట్లు అగుపడదు. బహుశా పట్టణమునకు దూరమయిన తత్పరివ్రాజక శిల్పులకు సౌధములందు ఒక అంతరాత్మ కానరాక, సర్వ ప్రకృతియందు ఏర్పడిన అనురాగము వారి మనస్సులందు ఏర్పడియుండకపోవచ్చును. అందుచేత హర్మ్యరూపములను, సంప్రదాయపద్ధతులను మాత్రమే అవలంబించి, భావప్రదర్శనము మాత్రమే ప్రాధాన్యముగా వారు చిత్రించియుండవచ్చును.

అజంతావర్ణచిత్రములందు మరొక గొప్ప విశేషము కలదు. ఈ చిత్రములన్నియు గుహల వాస్తువును పూర్తిగ అనుసరించి, వాస్తుభాగము లయినవి. కుడ్యములపైన గాని, కప్పుయందు కాని, స్తంభములపైన కాని రచన లందిన చిత్రము సంపూర్ణముగ ఆ భాగముయొక్క వాస్తురూపమును ప్రబల మొనర్చుచుండును. గుహలోనికి ప్రవేశించుచున్న ద్రష్టకు ప్రదర్శించురీతి, బయటకు నిష్క్రమించుచున్నపుడు ప్రదర్శించవలసిన రీతి గమనించి, ఆ శిల్పులు ఈ దివ్యచిత్రసముదాయమును చిత్రించిరి. ముఖ్యముగా ప్రచ్ఛాదనముపయిన చిత్రితమయిన కల్పనలందు ఈ గుణము ప్రత్యేకముగ కానవచ్చును. గుహయందు ఎచట నిలచినను ప్రచ్ఛాదనాలంకారము లందు ఏ వికృతము గోచరించదు. యూరపునందు రెనేజాన్సుకాలమున, అనగా క్రీస్తుతర్వాత పదమూడు, పదునాలుగు శతాబ్దములు గడచినతర్వాత చిత్రించిన శిల్పులు సయితము ఈ శిల్పలక్షణమును పూర్తిగ గమనింపలేదు. ఆనాడు కప్పులందు చిత్రితములయిన కొన్ని చిత్రములు హర్మ్యమందు కొన్ని స్థలములనుంచి తల్లక్రిందులుగా కానవచ్చును. అట్టి చిత్రములు హర్మ్యతి

మందు ఒక నిర్ణయస్థానమునం చే చూడవలసియుండును. అజంతాచిత్రములందు ఈ దోషము కనుపించదు. ఈ చిత్రములందు మరొక ఘనవిశేష. ఏమన, ఇవన్నియు వాస్తుభాగములుగానే రచన లందినను, విడివిడిగాకూడ రసవంతములు.

ఇక అజంతా చిత్రకారులు అనుసరించిన కొన్ని ప్రత్యేకసంప్రదాయములను ఒకింత గమనింపవలసియున్నది. బహుశా ఆనాడు ఈ సంప్రదాయములు సర్వ హైందవచిత్రకళయందును సామాన్యమే అయియుండవచ్చును. హిమాలయములందుకాని, ఇతర పర్వతములమీద కాని దృశ్యములను ప్రదర్శించినపుడు ఈ పర్వతములను ఒక విచిత్రపద్ధతిన అజంతాశిల్పులు సూచించిరి. అమర్చిన ఇటుకలవలె కొన్ని చదరములను అతిచిత్రముగా ఏర్పరచి, ఈ చిత్రములందు పర్వతభాగములను సూచించిరి. ఈ ఇటుకరూపములను ఒకటి, రెండుపార్శ్వములు ముదురుఛాయను, నలుపుగానో, లేక నీలవర్ణము కలిసిన ఆకుపచ్చవర్ణముతోనో చిత్రించి, మిగిలినవయిపు లేతఛాయను చిత్రించిరి. అది కొండప్రాంత మని స్పష్టపరచుటకు ఒక్కొక్కప్పుడు పక్షులను, లేక కోతులను, మరొకప్పుడు పర్వతవాసులగు ఆటవికులను, మరికొన్నిచోట్ల సంప్రదాయపరమగు కిరాత గుహ్యక కిన్నర తదితర రూపములచే అలంకరించిరి. ఇంతే గాక ఒక్కొక్కప్పుడు సెలయేళ్లు, వృక్షములు సయితము ఈ చిత్రముల నలంకరించును. ఈ పద్ధతిననే ప్రాచీనవైదిక శిల్పమందు కూడ పర్వతప్రదేశప్రదర్శనము కానవగును. ముఖ్యముగా, ఎలిఫెంటా, ఎల్లోరాలందు సయితము, రావణుడు కైలాసము నెత్తుట ప్రదర్శించు శిల్పములందు ఈ సంప్రదాయము కానవచ్చును. నదులు, సముద్రములు సయితము ఇదేరీతిన సంప్రదాయపరముగనే అజంతాశిల్పులు చిత్రించిరి. ఒక్కొక్కప్పుడు తీరము రాతిమయముగకూడ కన్పడును. ఈ రూపరచనలందు కల మత్స్య, శంఖ, నాకరూపములు చిత్రకారుని ఉద్దేశమందది నదీప్రదర్శనమో, లేక సముద్రపదర్శనమో వెంటనే తెలుపగలవు.

సౌధద్వారములు సయితము ఇచట ఒక నిశ్చితసంప్రదాయము ననుసరించే ప్రదర్శించిరి. అజంతాచిత్రములందు ఈ ద్వారములన్నియు దాదాపు ఒకేతీరున కానవచ్చును. సన్నటి రెండు నిలువుకంబములపయిన, అర్ధచంద్రాకారమున అడ్డవాసమును నిలిపి, ఈ అడ్డవాసమునకు ఇరువయిపుల చిన్నచైత్యరూపగవాక్షములచే నలంకరించిరి. సాధారణముగా ద్వారము ప్రక్కన ద్వారపాలకుడు నిలిచియుండును. ఒక్కొక్కప్పుడు ద్వారముగుండా ఒక మనిషి లోపలికో, లేక వెలుపలికో వెళ్లుచున్నయట్లు చిత్రించి ద్వారభావమును విపుల మొనర్చిరి.

సాదృశ్యన్యాయములను తప్పిన వెనుకభాగమందు ఏర్పడిన సౌధరూపములు, చిత్రపూర్వభాగమందు ప్రదర్శించిన సౌధములు సయితము ఒక సంప్రదాయము ననుసరించే చిత్రితమయినవి. సన్నటి స్తంభములపయిన ప్రచ్ఛాదనమును చిత్రించి సౌధము సూచించిరి. ఈ ప్రచ్ఛాదనము ఒక్కొకప్పుడు చిత్రమందలి మానవరూపముల శిరస్సులపైన చాల దగ్గరగా చిత్రితమయి ఉండును. సాధారణముగా సౌధనిర్దేశమందలి స్తంభశిరస్సులుమాత్రము నీలవర్ణమున కనుపించును. అనేకచిత్రములందు ఈ హర్మ్యములఇరువయిపులా రెండు గదులు, మధ్య నొక పెద్ద చావడి, ముందు వరండాకూడ కానవచ్చును.

ఇవన్నియు కాక, మానవరూపరచనలందు వసనములు సయితము సంప్రదాయముల ననుసరించే చిత్రించినట్లు బర్గెసు మొదలయిన పాశ్చాత్యపండితు లనిరి. కాని వసనాభరణములందలి సంప్రదాయములు చిత్రకళకు చెందినవి కాక, నిజముగా ఆనాడు వసనధారణయందు కలవి అనియే చెప్పవలయును. చక్రవర్తులు, సంపన్నులు మొదలయిన ధనికవర్గమునకు చెందు మానవులందరు కొలదివసనములను ధరించుటయే గాక, ఉన్నతమకుటము, అనేకదివ్యాభరణములతో అలంకృతు లయియుందురు. సామాన్యజనులు దేహమందు ఎక్కువ భాగమును వస్త్రములు కప్పుకొని, తక్కువఆభరణములను ధరించెదరు. పరివ్రాజకులు, భిక్షువులు వారికాటీలందు కానవచ్చెదరు. రాణులు మొదలైన సంపన్నగృహ

ములకు చెందిన స్త్రీలు, వారి చెలికత్తెలు అనేక ఆభరణములను ధరించెదరు. కాని వారి స్థితి ననుసరించి వారి ఆభరణములు వేరగును. రాణులుమాత్రము చప్పున చూచినంతనే నగ్నముగ ఉన్నరీతి కానవచ్చెదరు. కాని కొంత గమనించినయెడల, అతిసన్నమయిన బట్టను వారు ధరించినట్లు అజంతాచిత్రకారులు అతినేర్పుగా చిత్రించినట్లుగా తెలియగలదు. నాట్యకత్తెలందరు తీరాడుచున్న వర్ణవర్ణముల వసనము లనేకములు ధరించెదరు. దాసీలు మొదలయిన స్త్రీలు ఒక కంచుకము ధరించి, నడుముచుట్టు ఒక చీరను ధరించెదరు [కంచుకమును ధరించునది కాన కంచుకి]. ఈ చీర అడ్డపట్టికలచే అలంకృతమయి ఉండును. నిజముగా అజంతాలందు చిత్రితములవు వసనాభరణములు ఆనాడు మన దేశమున సంప్రదాయపరమయినరీతులే కాని వేరు కాదు. అందుచేత అజంతాచిత్రములు చరిత్రార్థులకు కూడ ఒక మహా సంపద అనుటకు ఏ సందేహము లేదు.

అజంతాగుహాలయములు ఎంత మహత్తరమయినవయినను, వీటియందు వాస్తుప్రదర్శనమున కార్లీగుహవంటి చైత్యముకాని, నాసికునహపానుని గుహవంటి విహారము కాని లేదని చెప్పవలయును. ఈ అజంతాల ప్రదేశము ఆంధ్రసామ్రాజ్యభాగమయి ఉన్న కాలమున ఆంధ్రశిల్పులు నిర్మించిన ప్రథమగుహలు ఆరేడుమాత్రమే అని ఇదివరకే అన్నాను. ఈ గుహలన్నియు అజంతా వీథికి మధ్యన ఉన్నవి. తర్వాత నిర్మించిన గుహలు ఈ ప్రథమగుహలకు అటునిటు వరుసగా నిర్మించి, శిల్పులు ఈ వీథిని పొడుగొనరించిరి. ఈ గుహలు పూర్వచివర నుంచి లెక్కించుట పరిపాటిఅయినందున, అదేరీతిన ఈ గుహలను ఈ వ్యాసమందు పేర్కొనడమయినది

ఆదిమ ఆంధ్రశిల్పులు ఈ గుహలను మలుచునాట బౌద్ధమతమందు మహాయానవిధము కేర్పడలేదు. అందుచేత ఆ శిల్పుల ఆధ్యాత్మికజీవితవిధానము నిర్వాణలక్ష్యమే ప్రధానముగా కొని, స్వచ్ఛగతుల ప్రసరించుచుండెడిది. అందుచేత ఈ గుహలన్నీ హీనయాన సంబంధితమే అయిఉన్నవి, ఈ గుహలు నిర్మించి చిత్రించిన శిల్పులు తమ రచనలందు ఏగతి ఉద్దేశించినను, ఆ గతి అతిస్వచ్ఛమయి, పవిత్రహీనయానమునకు అనుబంధముగానే పరిణమించినమాట వాస్తవము.

అజంతాగుహలన్నియు బౌద్ధులు మలిచినవే. వీటియందు మనము ప్రస్తుతము అవలోకించు గుహలు ఎనిమిదవగుహనుంచి పదమూడవగుహవరకు ఉన్నవి. ఎనిమిదవగుహ అతిప్రాచీనమయినది. ఇది ఒకవిహారము. ఈ గుహాముఖము శిథిలమయి పడిపోయినది.

తొమ్మిదవగుహ ఒకచైత్యము. ఒకభాజచైత్యగుహతక్క, హిందూదేశమందు పశ్చిమప్రాంతమందున్న ఇటువంటి ఇతర చైత్యగుహలన్నిటికంటె ఈ గుహ అతిప్రాచీనమయినదని చెప్పవచ్చును. ఈ గుహ ప్రాచీనతను తెల్పు అంశములు అనేకములు కలవు. గుహాంగణభాగమును, చైత్యగర్భమును విభాగించు కుడ్యము కలపతో నిర్మితమయినది. ఈ గుహాంగణమందు ఎదురు భాగమున రూపశిల్పము లేమియు లేవు. ఇందలి అలంకారశిల్పమంతయు కలపనిర్మాణరీతుల ననుసరించినది. ఇంతేగాక ఈ చైత్యనిర్మాణ క్రమము చదరము. చైత్యగృహమందు నయితము నట్టింటి కప్పు (*Nave*) పార్శ్వభాగముల కప్పునయితము వంపు లేక చదరముగా ఏర్పడి ఉన్నది. ఇందు పార్శ్వభాగములకు కలయు వెలుతురుకొరకు ప్రత్యేకగవాక్షములు కలవు. పార్శ్వ భాగములను నట్టింటిని విభాగమొనర్చు స్తంభములు కొద్ది ఏటవాలున నిర్మితములయి ఉన్నవి. ఇవన్నియు ఈ గుహప్రాచీనతను తెల్పు ముఖ్యాంశములు.

ఈ గుహాముఖము నాసికచైత్యగుహను సర్వవిధముల పోలి ఉన్నది. అయినను నాసిక చైత్యమునకన్న ఇదే ప్రాచీనమయినదని పండితాభిప్రాయము. అనగా క్రీస్తుకు పూర్వము కనీసము రెండు వందల సంవత్సరములక్రితము ఈ గుహ నిర్మాణము నంది ఉండవచ్చును. ఈ గుహయందు గమనింపతగిన వాస్తు విశేషములు ఇంకను కొన్ని ఉన్నప్పటికిని, అవి ఏవియు కాలగమనగతిని సూచింపగలిగిన అంశములు కావు.

ఈ గుహనయితము వర్ణచిత్రములతో నలంకృతము. కాని అక్కడక్కడ కొన్ని చిత్రములక్రింద

వేరు చిత్రము లున్నయట్లు స్పష్టముగా తెలియవచ్చును. ఈ అడుగు చిత్రములు గుహమలిచిననాటి తొలి రచన లని చెప్ప నవసరము లేదు. ఇప్పుడు కానవచ్చు చిత్రములందు ప్రధానమయినవి వామకుడ్యమున ఉన్న బుద్ధ చిత్రములు. ఇవి కనీసము ఆరు కనుపించును. ఈ సర్వ బుద్ధచిత్రములందును శిరస్సుపైన మూడంతస్తుల ఆతపత్రము కనుపించును. చిత్రములందు వెనుక భాగమున, హార్మ్యరూపములను నిర్దేశించి రని చూచాయగా తెలియనగును. ఎందుకనగా ఈ చిత్రములు అతి పాతవయి, మాసిపోయినవి. ఈ గోడముఖమంతయు గౌతమ బుద్ధుడు అనేకరీతుల శిష్యులతో సంప్రదించుచున్నట్లు చిత్రించిరి. కొన్ని చిత్రములందు స్తూపము తదితర బౌద్ధచిహ్నములను ఉపాసకులు కొలుచుచున్న రీతి చిత్రితమయినవి. ఈ చిత్రములన్నియు ఉత్తమ కళాప్రదర్శనమే నని పండిత బర్గెసుగారు సయితము సెలవిచ్చిరి. ఎదురుగోడన చిత్రములు శిథిలములయి రాలిపోయినవి. గుహయందు మరొకభాగమున శిబిజాతకము చిత్రితమయినట్లు తెలియుచున్నది.

పదవగుహ ఒక మహాచైత్యము. ఇంతకన్న పెద్ద చైత్యగుహ అజంతాలందు ఇంకొ ఒక్కటి మాత్రమే కలదు. ఈ గుహాముఖముకూడ పడిపోయినది. ఇది తొమ్మిదవగుహకన్న కొంచెము ఎత్తుగా మలిచియున్నది. ఈ గుహయందు స్తంభములు వట్టి అష్టకోణకంబములు. వేరు వాస్తుప్రదర్శనమేమియు వీటియందు కనుపించదు. అయిన ఈ స్తంభముఖములన్నియు వర్ణచిత్రములతో ప్రకాశించుచుండెడివి. కాని ఆ చిత్రములన్నియు నేడు శిథిలములయి రాలిపోయినవి. కొన్ని స్తంభములు సయితము విరిగిపడిపోయినవి. ఈ గుహయందు గమనించు వాస్తువిశేషము లేమియు లేవు. నట్టిగృహము [nave] యొక్క కప్పుకు వాసములు కలపతోడనే నిర్మించిరి. అవి ఇప్పుడు అదృశ్యమయినవి. వాటి చాళ్లు మాత్రమే నేడు కాననగును. కాని పార్శ్వభాగములందు కప్పులకు కర్రవాసములవలెనే రాతియందే మలిచిరి. అందుచేత, తర్వాతనిర్మాణమయిన సంపూర్ణశిలావాస్తుప్రదర్శనగుహలకు ఇది ప్రథమసోపాన మయి ఉండవచ్చు నని పండితులు ఊహించిరి. ఆంధ్ర శిల్పులు ప్రథమశిలావాస్తురూపపరీక్ష ఈ గుహయందే కావించియుండవచ్చును. ఆంధ్రశిల్పచరిత్రయందే కాక, సర్వభారతశిల్పచరిత్రయందును ఈ గుహ అతి ముఖ్యముగా ఎంచనగును.

ఈ గుహచైత్యము అనేకవర్ణచిత్రములచే అలంకృత మయినది. ఈ చిత్రములు ముఖ్యముగా గమనింపవలసిన కారణము ఏమనగా, ఈ చిత్రములందలి వసనాభరణముల శైలి సంపూర్ణముగా ఆంధ్రశాతకర్ణిరాజుల నాటిది. ఈ గుహాచిత్రములందు రూపరేఖరచన అతి సరసమయి, చాల స్పష్టమయినది. ఈ రేఖరచనయందు, సామర్థ్యముచే చిత్రకారునికి సమకూడిన సాహసము బాగుగ విశదమగును. ఎడమగోడన ఒక జనవాహిని చిత్రితమయినది. ఈ వాహినియందు అశ్వముల నధిరోహించి కొందరు, కాలినడకన కొందరు కలరు, వీరందరు వివిధఆయుధములను ధరించియుందురు. ఈ వాహిని మధ్య అక్కడక్కడ స్త్రీసమూహములు సయితము కానవచ్చును. మరొకచోట ఈ కుడ్యముమీదనే బోధిద్రుమచిత్రము కానవచ్చును. ఈ వృక్షమంతయు భక్తులు చెల్లించిన అనేక కానుకలచే అలంకృత మయియున్నది. ఈ దివ్యవృక్షమును అనేకమంది ఉపాసకులు భక్తిని పూజించుచుందురు. ఈవిధమయిన చిత్రములు సాంచితోరణశిల్పములందును, అనేక ఇతరచోట్లను కూడ కాననగును. మరొకచోట రెండు సౌధద్వారచిత్రము లున్నవి. ఈ ద్వారరూపములు సాంచితోరణములను స్మృతికి తెచ్చును. ఈనాడుకూడ మాళవదేశమందు వివాహాది శుభకార్యములందు తోరణములను ఈరీతినే నిర్మించు అలవాటు కలదట. ఆంధ్రుల సామ్రాజ్యమునాట మాళవదేశమందు నాటిన శిల్పరూపము నేడొక విశేష ఆచారమయినది. మాళవదేశమందా నాటి ఆంధ్రవిజయము సంపూర్ణము. మాళవదేశమందు నాటి ఆంధ్రవిజయధ్వానములు నేటికిని మారుమ్రోగుచునే నిలిచియున్నవి.

కుడిగోడన ఏనుగులతో సహా ఒక జనసమూహము నడచుచున్నరీతి చిత్రితమయినది. ఈ చిత్రమునకు కుడిపార్శ్వమున ఒక హార్మ్యచిత్రము కలదు. ఈ

హార్మ్యమును చెక్కుల్లు అలంకరించును. ఒకరాజు, రాణి పరివారముమధ్య కూర్చొనియుందురు. వీరికయిపునకు ఇద్దరు పురుషులు నడిచివచ్చుచుందురు. అందొకడు భుజముపయిన కావడి నుంచుకొని, కావడికి ఇరుప్రక్కల ఏవో మూటలు తగిలించి మోయుచుండును. ఈ కల్పనకు ప్రక్కగా ఇదే చిత్రము మరల చిత్రితమయినది. కాని ఈ రెండవచిత్రమందు, రాజుపైపునకు వచ్చుచున్న ఇద్దరు పురుషులు రాజురాణిదాపునకు వచ్చియుందురు. వారు కావడి క్రింద నుంచి నమస్కరించుదురు. ఈ గుహయందు అనేకశాసనములుసయితము కలవు.

ఈ గుహాచిత్రము లందలి వసనాభరణముల శైలి సాంచితోరణ శిల్పములందే కాక, కార్లీ గుహా స్తంభముల బోధికశిల్పములందును భేస్స గుహాస్తంభ బోధికశిల్పములందును, నాసికు గుహలందును, మధుర యందు కానవచ్చిన అతిప్రాచీన శిల్పములందును, అనేక ఇతరస్థలములందు సయితము కానవచ్చునని ముందొకసారి చెప్పడమయినది. ఇతరలక్షణము లెటులయినను, ఈ శైలిన వసనాభరణములు వీర్పడిన ప్రాచీన శిల్పమంతయు సంపూర్ణముగ ప్రాచీన ఆంధ్ర మని తప్పక చెప్పవలయును. ఇందు సందేహము ఏ మాత్రమును లేదు.

స్త్రీల కంఠమున బరువయిన హారము వేసల్పయి, పెద్ద పతకముతో సహా కానవచ్చును. స్త్రీల చెవిపోగులు సయితము అతి పెద్దవయి, ఒక్కొక్కప్పుడు పూర్ణవలయాకారమున కాక, పొడవుగా కూడ ఏర్పడి భుజములవరకు వ్రేలాడుచుండును. స్త్రీల మణిబంధములకు బరువయిన మురుగులు, కాళ్లకు ఘనమయిన కడియములు కానవగును. స్త్రీల కుండలముల ముందుభాగమందు ఒక ప్రత్యేక పద్ధతిన అలంకృతమయి, ఫాలమందు పీతవర్ణతిలకము కానవచ్చును. పురుషులు పెద్ద తలపాగ ధరించెదరు. ఈ తలపాగకు ఎదురున ఒక విధమయిన పెద్ద ముడి ఉండును. సంపన్నులందు స్త్రీపురుషులు సయితము కటిబంధమునకు పైభాగమున వసనము లేవియు ధరింపరు. కాని ఆభరణములు తప్పక ధరించెదరు. సిఫాయీలు ఈటెలు, విల్లంబులు మొదలగునవి ధరించెదరు. ఈ వసనాభరణముల రూపములు సరిగా నెరుగుటకు ప్రాచీనాంధ్రశిల్పములను చూచిన మంచిది.

ఈ గుహాప్రచ్ఛాదనముపైన ఒక అలంకార పద్మమును చిత్రించి, ప్రతిరేఖనందు ఒక బుద్ధరూపమును చిత్రించిరి. ఈ చిత్రము ప్రాచీన మయినది కాదు. బహుశా క్రీస్తుశతర్వాత ఆరువందల సంవత్సరములకు ఇది రచనఅయిన దని పండితాభిప్రాయము.

ఈ గుహాచిత్రములు అతి ప్రాచీనఆంధ్రకళకు చెందినవయి ప్రాచీన ఆంధ్రకళారూపమును తెలుపునవియే గాక అనేక అనాటి ఆంధ్రుల రీతులను తెలుపునవి అయియున్నవి. అయినను ఏకారణముచేతనో ఈ చిత్రముల ప్రతులను పూర్తిగా ఎవరును తయారుచేయలేదు. త్వరలో దొరతనమువారు ఈ పనికి పూనుకొనవలసియుండును. లేకున్న శిథిలమయిపోవుచున్న ఈ అమూల్యచిత్రసంపదను కొలదికాలములో మనము పూర్తిగ కోలుపోదుము.

పదునొకండవగుహ యొక విహారము. ఈ గుహకు ముందు వరాండా కలదు. ఈ వరాండా నాలుగు అష్టకోణముల స్తంభములపై నిలిచి ఉన్నది. ఈ స్తంభముల శిరోభాగమందు ఆభరణయుక్తమయిన శిల్పమేమియు కానుపించదు. కాని స్తంభములకు పీఠముగా ఒక అడ్డగోడ నిర్మితమయియున్నది. ఈ అడ్డగోడ బాహ్యముఖము పలకలుగా మలిచి ఉన్నది. వరాండా ప్రచ్ఛాదనము స్తంభములను మించి చాల ముందుకు వచ్చి ఉన్నది. ఈ వరాండాకప్పు పూర్తిగా వర్ణచిత్రములచే నలంకృతమయినది. ఈ చిత్రములందు అనేక పక్షిరూపములు ఇతర రేఖాలంకారములు (*geometrical*) అంకశాస్త్రయుతముగా కానవచ్చును. ఈ వరాండాకు ఇరుప్రక్కల రెండు గదులు కలవు. వరాండాయందు కుడిపై పుష్యము మూడు భాగము లొనర్చి, భాగమున కొకటి చొప్పున మూడు బుద్ధరూపములు మలిచి కలవు. ఉపాసకులు, భక్తులు పరివేష్టించి రెండు బుద్ధరూపములు కానగును. ఈ శిల్పములందు బుద్ధుని చుట్టు వేష్టించి యుండును. మూడవబుద్ధుడు నిలిచియుండును. ఈయనకు ఇరువయిపుల రక్షకులు కలరు. ఒక రక్షకుడు చామరధారి. గుహాద్వారమందు అలంకారశిల్పములు ఎక్కువగా లేక సామాన్యముగా ఉండును.

ఈ విహారమందు లోపలనయితము నాలుగు అష్టకోణ స్తంభములు కలవు. స్తంభములు నిర్మితమయిన ప్రథమవిహారగుహ ఇది. ఎప్పటివలె నీవాస్తుపరీక్షయందు ముందంజ వేయు సహజగుణమును ఆంధ్రశిల్పులు ఈ విహారగుహయందు కూడ కనుపరచిరి. విహార వెనుక భాగమున, సింహాసనముపయిన కూర్చున్న బుద్ధప్రతిమ యొకటి మలిచి ఉన్నది. ఈ ప్రతిమ ప్రాచీన శిల్పములవలె గాక గోడనుండి వేరయి ఉన్నది. సింహాసన ముఖమున ధర్మచక్రమునకు ఇరువయిపుల రెండు లేళ్లు, లేళ్ల వెనుక రెండు సింహములు అతి ఇంపుగా మలిచి ఉన్నవి. ఈ శిల్పమునకు ఎదురుగా ఒక పురుషుడు భిక్షుకపాత్రను చేత పట్టుకొని, మోకాళ్లపయిన కూర్చొని ఉన్న రీతి శిల్పమయి ఉన్నది. ఈ శిల్పము ప్రకృతిని సంపూర్ణముగా ప్రతిబింబించుచూ, అతి స్వచ్ఛతన మహారసవంతమయినదని పండిత బర్గెసుగారనిరి. కాని దుష్టులెవరో ఈ దివ్యశిల్పమునందు ముఖమును మాత్రము ఛేదించి ధ్వంసము చేసిరి.

ఈ గుహ క్రీస్తుకు తర్వాత ప్రథమశతాబ్దారంభమునందే నిర్మితమయిన ఆంధ్రవాస్తువు. ఇందు కల బుద్ధరూపశిల్పములన్నియు గుహానిర్మాణమయిన వెనుక ఒక శతాబ్దము గడచిన తర్వాతనే మలిచినవి. ఇవన్నియు తొలి మహాయానగతినే అనుసరించి, ఆంధ్రస్వచ్ఛతను కోలుపోలేదు.

పన్నెండవ గుహ కూడ అతిప్రాచీనమయిన విహారము. దీని ముందుభాగము పడిపోయినది. లోపల శాలచుట్టూ, గోడకు నాలుగు చొప్పున, మూడు గోడలన పన్నెండు ఉపగదులు కలవు ఈ గదులందు అరుగులు పెద్దవి. అరుగులపైన ఒక ప్రక్కన దిండ్లవలె రాతియందే మలిచి ఉన్నవి. ఈ గదుల ద్వారబంధములకు ప్రక్కగా చిన్నగూండ్లు తొలిచి, కొయ్యతలుపుల ఏర్పాటు కానవచ్చును. ద్వారబంధములకు పైగా, ఒక శ్రేణియందు చైత్యరూపగవాక్షరూపములు, మధ్య మధ్య బౌద్ధప్రాకారరూపము అలంకారయుతముగా మలిచి ఉన్నవి. ఈ గుహశాల ౩౬ అడుగుల పొడవు, వెడల్పు కలిగిన నిండుచదరము.

పదమూడవగుహ కూడ అతిప్రాచీనమయినది. ఇది విహారము, చైత్యము కాక, చిట్టి భిక్షుకగృహము. దీని ముందుభాగము పడిపోయినది. ఇందు గమనించ తగిన శిల్పవిశేష మేమియు లేదు.

ఆంధ్రసామ్రాజ్యకాలమున, శాతకర్ణిచక్రవర్తుల ఏలుబడిలో మలిచిన అజంతాగుహలు ఇవి మాత్రమే. ఈ గుహలు మలిచినతర్వాత దాదాపు నూట ఏబది, రెండువందల సంవత్సరములు మన దేశమందంతటను ఈ గుహల నిర్మాణము ఆగిపోయినది. అమరావతీ నాగార్జున కొండస్తూపములను అలంకరించుటకయి, ఏకముగా స్వదేశమయిన ఆంధ్రదేశమునకు శిల్పులందరు తరలివెళ్లినట్లు తోచును. ఎందుకనగా దాదాపు ఆకాలమందే ఆ దివ్యశిల్పనిధియంతయు తయారయినది. ఇంతేగాక ఆ శిల్పనిధి అపారము సయితము. తర్వాత క్రీస్తుకు తర్వాత మూడవశతాబ్దమున ప్రారంభించిన అజంతా గుహల నిర్మాణము అయిదవశతాబ్దమందు ఆగి, తిరిగి ఆరు ఏడు శతాబ్దములందు మరొక ఊపున ప్రారంభమయి, చాల దివ్య గుహల నిర్మాణకారణమయినది.

ఈ గుహలన్నిటియందును శిల్పమందు రాను రాను మహాయాన గతులు అతివిరివిగా ప్రవేశించి, శిల్పము తొలిస్వచ్ఛతను క్రమముగా కోలుపోయి, కళాభాగము నీరసించినది. అయినప్పటికీ ఈ గుహలందు ౧, ౧౬, ౧౭, ౨౬, ౨౭-వ గుహలందు వర్ణచిత్రముల సంపద సర్వ పాశ్చాత్య ప్రాగ్దేశ శిల్పపండితబృందములను ఏకముగా ఆకర్షించి ముగ్ధులను చేసినది. ఈ సర్వగుహల శిల్పసంపద శైలిగతుల ననుసరించి, సంపూర్ణముగా ఆంధ్రశిల్పమే. ఈమాట వాస్తవము. ఈ శిల్పమంతటినీ వర్ణించుటకు ఒక మహాగ్రంథము సయితము చాలదు. కాని ప్రథమ ఆంధ్రశిల్పములందున్న స్వచ్ఛత, పుష్టి, స్వేచ్ఛ, ఉత్సాహము క్రమముగా నీరసించి, పూర్తిగా నశించిపోవుట ఈ అజంతా చిత్రములందు వరుసగా తెలియనగును. చివరకు అఖరున నిర్మించిన గుహలందలి చిత్రములు, శిల్పము, అనేక రూపవర్ణరేఖా సంకలనములయిన నిర్జీవ ఆభరణముల రీతి, ఉచ్ఛిష్టభావములతో, ఎక్కువ తళుకున ప్రకాశించుట సయితము ఈ అజంతాలందు కానవగును. నిశ్చయముగ ప్రాచీన ఆంధ్రశిల్పశైలిచరిత్ర ఈ అజంతామహాప్రాసాదములందు సంపూర్ణఖితము. అయినను ముందు వర్ణించిన ప్రథమ అజంతా గుహలయిన తర్వాత ఆంధ్రశిల్పము మహోన్నత్యము నందిన అమరావతి, నాగార్జునకొండశిల్పములను పరిశీలించి ప్రాచీనాంధ్రశిల్ప కృష్ణకక్షమును అవలోకించుట మంచిది.

# ★ పిచిక కథ ★

[కథానిక]

శ్రీ భమిడిపాటి రామగోపాలం

అనంతుని బామ్మ అతనికి ఈవిధంగా కథ చెపుతున్నది. అనంతుడు ఆమె చెప్పతున్న కథ వాతావరణములో పూర్తిగా విలీను డగుటవలన ఆ పిల్లవాని ముఖం భయాన్ని తొణికిస్తూఉన్నది.

"ఆ రాక్షసుడు రాజకుమారుణ్ణి ఒక పెద్ద మఱ్ఱి తొఱ్ఱలోంచీ తీసుకుపోయి, శవాలూ కపాలాలూ మాంసపుముక్కలూ అపరిమితంగా ఉండే, వాడి గుహలో పెట్టేటప్పటికి, రాజకుమారుడు పూర్తిగా తెలివి తప్పి పడిపోయాడు...

"చాలాసేపు అలా పడిఉన్న తరవాత, రాక్షసుడు ఆపిల్లవాడిమీద ఏదో మందు జల్లి, లేపాడు. రాజకుమారుడు భయంతో 'నన్ను చంపేస్తావా?' అని అడిగాడు.

"రాక్షసుడు పెద్ద కేకలు వేస్తూ పళ్లూ కళ్లూ మిటకరించి, 'నిన్నా? ఒక్క కబళంలో మింగేస్తాను' అన్నాడు. రాజకుమారుడు ఎంతోసేపు వాళ్లమ్మనీ నాన్ననీ తల్చుకుని ఏడ్చాడు. 'నన్ను చంపేస్తే నీ కేంటి లాభం?' అని అడిగాడు రాక్షసుణ్ణి. రాక్షసుడు ఊరుకోలేదు. కళ్లు మిటకరించి, ఆ పిల్లాడు భయపడేటట్టుగా అరుస్తూ 'నిన్ను చంపి, నీ దెయ్యాన్ని నా హక్కులో పెట్టుకుని, మీ నాన్ననూ మీ అమ్మనూ చంపించుతాను.' అన్నాడు. రాజకుమారుడు ఎంత ఏడ్చినా వాడు వినలేదు. ఆపిల్లాణ్ణి అమాంతంగా చంపి, వాడి పచ్చిమాంసాన్ని తినేశాడు......"

ముసలిబామ్మకూడా ఈవిషయాన్ని చెపుతున్నప్పు డప్రయత్నంగా కాస్త కన్నీరు కార్చింది; అక్కడ కాస్త ఆగింది. అనంతుడు "చెప్పు—" అన్నాడు. ఆస్వరంలో ఏమాత్రం గాద్గద్య మున్నదీ బామ్మకు తెలియలేదు.

"ఆపిల్లాడు దెయ్యం అయిపోయాడు. ఆ దెయ్యాన్ని రాక్షసుడు పిలిచి, ఒక ఎముకముక్కతో దాని తలమీద కొట్టి, అదివరకూ వాడికి వొచ్చిన మంత్రాల్తో వశపర్చుకున్నాడు. ఆవెనక ఫలానాఫలానా దేశంలో ఫలానారాజున్నాడు, అతనిభార్యకూడా ఉంది, వెళ్లి వాళ్లని, ఇబ్బందిపెట్టవలసిందీ అన్నాడు.

"దెయ్యం అంది—'వాళ్లు పూర్వజన్మంలో నాకు తల్లిదండ్రులుకదా, వాళ్లని ఎలా హింసపెట్టేదీ' అని. 'తల్లిదండ్రులయ్యేరి దేవుడయ్యేరి, హింసపెట్టవలసిందే' అన్నాడు రాక్షసుడు.

"దెయ్యం వెళ్లి ఆరాజ్యంలో ప్రవేశించింది. ఒకనాటి పొద్దుణ్నే రాజుని పట్టింది. రాజుకి దెయ్యం పట్టిందని తెలియగానే భూత వైద్యులూ వాళ్లూ వొచ్చారు. ఎన్ని ప్రయత్నాలు చేసినా దెయ్యం వదల్లేదు. చివరకి దెబ్బకి దెయ్యం జడుస్తుందన్నారెవరో— అక్కడినుంచీ రాజుగార్ని కొట్టడమా అని విచారించేరు మంత్రులూ వాళ్లూను. కొంతసేపు ఆలోచించి, కొట్టకపోతే దెయ్యం వదల్దుగనక, కొట్టడం మొదలు పెట్టారు.

"తన తండ్రినే అలా కొడుతూ ఉండడం చూసి రాజకుమారుడు ఊరుకోలేకపోయాడు. లేచి వెళ్లిపోయి ఓచోట ఏడుస్తూ కూచున్నాడు. రాక్షసుడు ఇదంతా కనిపెట్టి రాజకుమారుడి దయ్యాన్ని నానాహింసలూ పెట్టడం మొదలుపెట్టాడు......"

ఇక్కడ అనంతుడు లేచిపోయే సూచనలు కనిపించగా అతని బామ్మ అడిగింది.

"ఏంరా నాయనా! లేచిపోకు. కూచో. ఇక్కడి నుంచే కథ బాగుంటుంది. కూచోవూ?"

"నా కక్కర్లేదుపో!" అని అనంతుడు లేవబోయాడు.

బామ్మ అతని హస్తాన్ని మృదువుగా స్పృశిస్తూ "పోనీ కూచో. పొడిమాటల్లో చెపుతాను." అన్నది.

కాని, ఎన్నిసార్లు భయంకరమైన ఈకథ వినినా, రాజకుమారుడి దయ్యాన్ని రాక్షసుడు హింసపెట్టేటంతవరకే వింటాడుగాని, తరువాత ఆ రాజకుమారుని సోదరి దైవప్రసాదములైన వరముల బలిమిని పురస్కరించుకొని ఆ రాక్షసుణ్ణి ఎలా పరాభవించినదీ వినడు అనంతుడు. ఈవిషయమునుగూర్చి ఎంత ఆలోచించినా బామ్మకు ఏమీ అందలేదు.

ఇంతే కాదు. బామ్మకు సుఖాంతములూ, దుఃఖాంతములూ అయిన కథలు చాలా తెలుసును. ఆమె ఆ పిల్లవానితో, ఎన్ని కథలు చెప్పబోయినా, దుఃఖమూ, రక్తసంబంధితములైన రసములు ఎక్కువ వచ్చే కథలే వింటాడుగాని, మిగిలిన సుఖాంతములను వినడు. అనంతుని బామ్మకు పిల్లవాని మనస్తత్వం అగ్రాహ్యంగానే ఉండిపోయినా, ఆమె అందుకని ఆట్టే ప్రయత్నాలుకూడా చెయ్యలేదు.

కాని అనంతుని తల్లిదండ్రులతో మాత్రం ఆమె అప్పుడప్పుడు ఈవిధంగా అంటుంది: "ఏమిటో, ప్రపంచకం అంతా ఎప్పుడూ ఒకరకం అవదు. చూడండి, అనంతం అందరిలాగే సరదాగా ఉండడు. అయితే వాడి బ్రతుకు సరదాగా ఉండదని ఎవరనగలరు? తోటికుర్రాళ్లతో సరదాగా ఆడకపోయినంతమాత్రంలో మనం ఏమీ చెప్పలేం. ఇంకోమాట—మిగతావాళ్లందరికన్నా ఇలాంటివాళ్లే ఎక్కువ సరదాగా ఉంటారు ముందుముందు. ఎప్పుడూ మనం దేన్నిగురించీ ఇదీ అని సరిగ్గా చెప్పలేము."

అనంతుని తల్లిదండ్రులకు లోకంతో చాలా వరకూ సంబంధమున్నది. ముసలిఅయిన బామ్మ రేపో నేడో ఆసంబంధాన్ని త్రెంచుకోకతప్పదు. అనంతుడు బాలుడవడంవల్ల ఇంకా అతని సంబంధం గట్టిదేమీ కాదు. కనుక ప్రపంచంతో అసంబంధితులైన వీరి ఇరువురి విషయమై వారు ఏమీ ప్రత్యేకశ్రద్ధ చూపించడం లేదు. అందుచేతనే వారిరువురూ, బామ్మ చెప్తుంటే మాటలకు ప్రతివచనం పలుకలేదు. కనీసం వారి పుత్రుడు సదా విచారాభిలాషియై, విచారాక్రాంతుడై ఉన్నాడని వారు గుర్తించలేదు. ఒకవేళ గుర్తించినా "అబ్బాయీ! నీ యీ వాటం ఏమీ బాగలేదు. ఇలా ఉండడం మంచిది కాదు. తోటిపిల్లలతో సరదాగా ఆడు. పాడు." అని చెప్పేస్థితిలో లేరు.

బామ్మ అనంతుని కథాశ్రవణోత్సుకుని గా చేయడానికి చేసిన ప్రయత్నంగురించి చెపుతున్నాను; ఆసమయంలో అనంతుడు లేచి తన చిన్న మంచంమీదికి వెళ్లిపోయాడు.

ఒక రాక్షసుడు తనను తీసికొనిపోయి చంపడానికి సిద్ధంగా ఉన్న సమయంలోనూ, తాను దయ్యమై తన తండ్రిమీద వాలినపు డాతనిని మంత్రవేత్తలు దండింపబోవు సమయంలోనూ, తనకు అక్కలుగాని చెల్లెళ్లుగాని లేనందున ఆ రాక్షసుని బారినుండి తన తల్లిదండ్రులను రక్షించే దిక్కులేక వారు నశింపబోవు సమయంలోనూ, అనంతునికి నిద్రలో మెలకువ వచ్చింది. అతడు ఆ సమయాల్లో బేలపడి కేకలు వేయలేదు. ధైర్యంగా, విచారం అనుభవిస్తూ, వెలుగుతున్న దీపంవేపు చూశాడు. ఎంతో సేపు ఆవిధంగా చూడగానే ఆదీపపు కళికచివరనుండి వస్తున్న పొగలోంచి ఒకరాక్షసుడు వస్తున్నట్లు గమనించి అనంతుడు కళ్లు మూశాడు. మళ్లీ నిద్రపట్టిన మరుక్షణంనుంచీ కలగంటూనేఉన్నాడు.

* * *

మరునాటి సాయంకాలం వేణు అనంతుని దగ్గరకు వచ్చాడు. అప్పటికి అనంతుడు వీధిఅరుగుమీద

అవనతముఖుడై కూర్చునివున్నాడు. అతని మనసు ఎక్కడవుందో అతనికి తెలియకుండానే ఉండిపోయింది. అంతసేపూ. ఆవిషయానికి అనుగుణంగానే ముఖభంగిమ ఉన్నది.

'ఏడుస్తున్నావేమిరా ?' అని అడిగాడు వేణు.

అనంతుడు మాటాడలేదు.

'ఏంరా అనంతం, ఏడుస్తున్నావ్ ?' అని తిరిగి అడిగాడు వేణు.

తనకు తెలియకుండానే ఏడుస్తున్నట్టే, తనకు తెలియకుండానే రుమాలు పెట్టి ఆనీటిని తుడుచుకున్నాడు అనంతుడు. వేణుముఖంవైపు ఒక మారు చూచి అవనతశిరస్కుడైనాడు.

'ఒరేయి అనంతం!' అని తిరిగి పిలిచాడు వేణు. అనంతుడు తన స్నేహితుడికి 'వెళ్లిపొమ్మ'న్నట్లు హస్తచాలనం ద్వారాన సంజ్ఞ చేశాడు.

వేణు వెళ్లిపోలేదు. అనంతుని ముఖాన్ని రెండు చేతులా పట్టి ఎత్తి అతని కళ్లల్లోకి మామూలుగా చూస్తూ 'లేరా! ఇవాళ ఇంజనీయరుగారి వాసూ అమ్మలూ కృష్ణవేణీ వొచ్చారు. ఆడుకుందాం రా! లేరా! రాకూడదురా ?' అన్నాడు.

'నువ్వెళ్లు. నేను రాను!'—ఏదో పోగొట్టుకున్న వాడిలా మొహంపెట్టి అన్నాడు అనంతుడు.

వేణుకి అనంతుడి సంగతి చాలా తెలుసును. 'పదరా!' అన్నాడు.

అనంతుడు వికారంగా మొహంపెడుతూ 'ఊఁహూఁ!' అన్నాడు.

వేణుకి అనంతుని తిరస్కారమేమీ నచ్చలేదు. అసలు అనంతుడు వహిస్తున్న గంభీరముద్ర నచ్చలేదు అతనికి. వెంటనే వెళ్లి మరినలుగురు పిల్లలతో తిరిగి వచ్చాడు. అందరూ అనంతుని చుట్టూ చేరారు. కృష్ణవేణికి అనంతుడంటే యిష్టం.

ఆ పిల్ల అనంతుడి ముఖందగ్గరగా తన ముఖం పెట్టింది. అతడి కళ్లల్లోకి చిలిపిగా చూస్తూ "ఏం ఏడుపుముఖం పెట్టావు ?'.అన్నది.

'ఎందుకే అంత వడిచస్తావు ?' అంటున్నప్పుడొక తాత్కాలికహాసం అనంతునిముఖంమీద వెలసింది. కాని మరుక్షణంలో అది మాయమై కోపరేఖలు ఆ స్థానాన్ని ఆక్రమించుకున్నవి. 'పో! దూరంగా' అంటూ ఆపిల్లబుగ్గలు గిల్లి వేశాడు.

కృష్ణవేణి 'పోయికాలపు కక్కగట్టా! ఎలా గిల్లేవురా ?' అంటూ బుగ్గలు నలుపుకుంటూ వెనక్కి వెళ్లిపోయింది. కాని వాసు—కృష్ణవేణిఅన్న— ఊరుకోలేదు 'ఓరి వెధవా! ఆడపిల్లని అలా కొడతావురా ?' అని విజృంభించబోయాడు.

వేణు అడ్డుపడి 'ఒరేయి! వాళ్ల వాన్నో అమ్మో కొట్టిఉంటారురా! ఇందాకట్నించీ ఏడుస్తున్నాడు. ఏమీ అనకండిరా!' అన్నాడు.

'ఏడిశేవుపోదూ! రొంలక్కి పిల్లిసాక్ష్యం!' అంది కృష్ణవేణిఅక్క అమ్మలు. ఇంకొక పిల్లవాడు అనంతుడికి దగ్గిరగా వెళ్లాడు.

ఈసమయంలో అనంతుడు వాళ్లందరివేపూ ఎఱ్ఱగా చూస్తూ అన్నాడు—'ఒరే! నన్ను కొడితే తిరిగి తన్నగల్ను. జాగర్త.'

పిల్లలందరికీ ఇదొక విచిత్రంగా తోచి పక్కుని నవ్వారు. ఆ నవ్వులో, వెనకనించి రెవరో అనంతుడి జుత్తు లాగారు. అనంతుడు వెనుదిరిగి చూచేసరికి ఇందాకట్నించీ ఏమీ భాగం తీసుకోకుండావున్న రమణ విరగబడి నవ్వుతున్నాడు. అనంతు డతనికేసి దీనంగా చాలాసేపు చూశాడు. అతడు భయపడి ముందుకే వచ్చేశాడు.

'పోదాం రండిరా! వీడు ఆడడు. ఎంతసేపూ ఏడుస్తూ కూచుంటాడు.' అన్నా డెవడో. అందరూ అనంతుడిని ఒక్కొక్క అవయవంచొప్పుననే పట్టుకుని లాగడం మొదలుపెట్టారు. రమణ, అతని ఎడమ చెయ్యి పట్టుకుని ఎంతగా లాగాడంటే, ఆ భుజసమీపంలో, ఇరుకుపట్టి, నొప్పి కలిగింది అనంతునికి.

'పోండి వెధవల్లారా! పోండి!' అన్నాడు అనంతుడు విడిపించుకుని. అందినవారినల్లా గట్టిగా దెబ్బలు

కొట్టాడు. దెబ్బలు ఎక్కువ తిన్నవాడు వాసు. అందరూ అనంతుడు కొడుతున్నప్పుడు పారిపోయారు గాని, వాడొక్కడే కూచుండిపోయాడు. ఎందుకంటే, వాడికి కాలిమీద కురుపు ఉంది. లేవలేక పోయాడు.

'వాడికి ఏడవడం ఇష్టం. అందుచేత అందర్నీ ఏడిపించడంకూడా వాడికి సరదావే. పదరా అన్నయ్యా పోదాం.' అన్నది కృష్ణవేణి. మిగిలిన ముగ్గురూ ఈలోగా ఒక ఉపాయం ఆలోచించి, ఒక్కసారిగా అనంతుడిమీద పడి తోచినన్ని దెబ్బలు కొట్టారు. అప్పుడతడేమీ చెయ్యలేకపోయాడు. వాళ్లు వెళ్లి పోయేటంతవరకూ ఏడ్వలేదుగాని, తరువాత కొంత సేపు మనస్సులోనే కుమిలిపోయి, కొంతసేపు గట్టిగా ఏడ్చాడు.

* * *

అనంతుడు తీరుబడిగా వున్న సమయాలన్నిటిలోనే ఏడుపూ దుఃఖమూ భయమూ అతనికి సహాయం చేస్తాయి. సుమారు ఒకటిన్నర సంవత్సరాలై అతనికి ఈరకం అలవాటయిపోయింది. చిన్నతనంలో పిల్లలు సంఘజీవనానికి అలవాటుపడడం, దానినే కోరడం ప్రకృతి. కాని అనంతుడికి తోడిపిల్లలతో కాలక్షేపం చెయ్యడం రాదు. అతడికి సంతోషమనేది సామాన్యం కాదు. మినహాయింపు.

అందుచేత తోడిపిల్లలతో అతను సరిగా ఉండలేకపోయాడు. ఇలా కొన్నాళ్లం దేసరికి అతడికి ఒంటరిజీవితం బాగా అలవాటయిపోయింది. వెందట ఏదో ఒకవిధంగా ఆలోచించి భయం పుట్టించుకుంటాడు. అసలు అతనికి తెలియకుండానే కళ్ళవెంబడి అపరిమితంగా నీళ్లు కారుతూఉంటాయి. ఇలాగే ఆపిల్లవాని రోజులు గడిచిపోతున్నవి. అతని మనఃప్రవృత్తులను గమనించడానికి పెద్దలు ఎవరూ తీరుబడి కలిగి ఉండలేదు. ఉన్నవాళ్లు గమనించలేదు.

సుమారు సంవత్సరంనర క్రిందట ఒకనాడు అతను అనవసరంగా తండ్రిచేత బాధింపబడ్డాడు. ఆనాడతనికి స్వయంగా ఏ ఆచరణనూ తలచుకుందికి అట్టే అధికారం లేకపోయినా, తానుకూడా ఒకరిని బాధ పెట్టవచ్చునని తలచుకున్నాడు. ఇతరులు విచారిస్తుంటే చూడడం బాలహృదయానికి ఒక అహ్లాదకరమైన విషయం. ఆప్రక్కనుంచే, ఇతరులు తమవలన సంతోష పడడంకూడా వారికి ఆనందమే. రెండు అనంతాలకీ మధ్యగా వెళ్లుతుంది బాలహృదయం. కొంతమందికి సంతోషాన్ని పదార్థంగా కల అనంతంవైపు మనసు పోతుంది; మరికొంతమందికి దుఃఖపదార్థం వైపు మనసు పోతుంది. అనంతుడు అప్పట్లో ఈ రెండవ తరగతికి చెందినవాడు. అయితే ఆనాడు అతని నిర్ణయం ప్రకారం అల్పజీవులనీ, తనకంటె చిన్నపిల్లలనీ కూడా బాధింపజొచ్చాడు అతను. కాని ఈ ఆచరణకి ఫలితంగా ఒకనాడు ఒక రోగగ్రస్తమైన కుక్క అతనిచే చంపబడింది. ఆనాడే అతనికి పాపచింత ఉద్బోధింపబడింది. బామ్మ అతనికి బౌద్ధమతసిద్ధాంతాలను కొన్నిటిని బోధించింది. ఆనాటినుంచీ అనంతుడు పాపం గురించీ, యమలోకంగురించీ చాలావిషయాలు తెలుసుకున్నాడు. ఇందువల్ల రానురాను అతనికి దుఃఖం విపరీతంగా కలగజొచ్చింది. ఆ దుఃఖమే నేడతనికి తీరిక సమయాల్లో సహాయంచేస్తూ కాలాన్ని గడపజేస్తున్నది.

ఒకనాడు ఎవరో అనంతుడిని కొంతసేపు గమనించారు. అతడికి కళ్లవెంట నీళ్లు కారడం కూడా గుర్తించారు. అనంతుడి తల్లిదండ్రులతో పిల్లవాడికి ఏదో కళ్లజబ్బు ఉన్నట్టుందని చెప్పారు. అనంతుడి తండ్రికూడా ఈ విషయాన్ని రెండుమూడురోజులలో ఋజువుచేసుకొని వైద్యుడి దగ్గరకు తీసుకువెళ్లాడు.

వైద్యుడు రెండుమూడు రోజులు అనంతుడిని పరీక్షించాడు. దృష్టిలోపం లేదని తెలుసుకున్నాడు. కాని ఈ కళ్లంట నీళ్లురావడానికి ఏం కారణం ఉందో తెలుసుకోలేకపోయాడు. మరొక ఇద్దరు వైద్యులు కూడా చెప్పలేకపోయారు. చివరికి ఒక మనస్తత్వవేత్త కొంతవరకు గ్రహించి పిల్లవాణ్ణి ఒంటరిగా వదిలిపెట్టవద్దని చెప్పాడు. అనంతుడి తల్లిదండ్రులు కొన్నాళ్లు ఆ నియమాన్ని పాటించారు. తరవాత క్రమంగా అది అశ్రద్ధ అయింది. అనంతుడు కళ్లంట నీళ్లు వస్తున్నప్పుడల్లా రుమాలు అడ్డంపెట్టుకుని వాటిని ఒత్తేస్తూ ఉంటాడు.

ఒకనాటి ఉదయం తెల్లవారకముందే అనంతుడికి నిద్రనుంచి మెలకువ వచ్చింది. అతని కప్పుడు కలలో ఒక పక్షి దయ్యమైనట్లు కనుపించింది. అందుకని సందేహనివృత్తికోసం, బామ్మను అడిగాడు. 'మామ్మా! పిట్టలు చస్తే దయ్యాలవుతాయా?'

బామ్మ దైవధ్యానం అయిపోయినవెంటనే 'ఏమన్నావ్?' అంది అనంతుడు తిరిగి ప్రశ్నించాడు.

'పిట్టలే ఏమిటి? చీమలూ మనుషులూ జంతువులూ అన్నీ! బలవంతంగా చచ్చినవన్నీ దయ్యాలై తీరుతాయి!' అని చెప్తూ బామ్మ నవ్వింది.

అనంతు డేమీ మాట్లాడలేదు. 'నేనూ దెయ్యం అవుతానుకబోలు.' అనుకొంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

'పిచ్చివాగమ్మ!' అన్నది బామ్మ.

ఆనాటి మధ్యాహ్నం, అలవాటుప్రకారం, బడికి ఒకగంట ముందుగా వెళ్ళాడు అనంతుడు. ఒకచోట కూర్చుని సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకొనిపోయిన కథ చదివాడు. వాచకకర్తలు ఆ పాఠాన్ని అంత దుఃఖజనకంగా వ్రాయలేదు. అయినా అనంతుడికి జటాయుమరణందగ్గిర ఏడ్పువచ్చింది. జటాయువు వృద్ధశకుంతం. అయినా రావణాసురుడు జాలితలచక జటాయువును చంపాడు. అంతే పడగొట్టాడు. తనుగూడా ఇలాగే అనారోగ్యంగా వున్న కుక్కని చంపేశాడు. రావణాసురుణ్ణి శ్రీరాముడు చంపాడు. కాని తనని చంపడానికి ఇంతవరకూ ఎవరూ ఉద్దేశించలేదు. పుస్తకం మూశాడు.

ఒక పిచ్చుకపిల్ల అక్కడ తిరుగాడుతూవుంది. ఆ పిచ్చుకపిల్ల అటూఇటూ తిరుగుతూ ధాన్యపుగింజలు ఏరుకొని తింటూ చిన్న చిన్న గెంతులు వేస్తూంది. అట్టే ఎగరనేర్చినది కాదు. పొద్దున్న బడి అవుతున్నప్పుడు ఉపాధ్యాయుడు ధాన్యపుకంకులు అక్కడ వెదజల్లిన సంగతి అనంతున కప్పుడు జ్ఞాపకంవచ్చింది.

అనంతుడు మెల్లమెల్లగా ఆ పిచ్చుకపిల్ల దగ్గరకు వెళ్ళాడు. ఆ పిచ్చుకపిల్ల అతనికి దగ్గిరగానే, అందకుండామాత్రం తప్పించుకుని గెంతుతూంది; ఇలా ఎంతోసేపు అటూ ఇటూ తిప్పింది అతనిని. ఎంతసేపైనా అలా తిప్పుతూ నేవుందిగాని దొరకడంలేదు. కాని ఇందుకు అనంతుడు కోపగించుకోలేదు. శాంతంగా ఆపిచ్చుకపిల్లకోసం ప్రయత్నంచేస్తూనే ఉన్నాడు.

అప్పటికి, ఊళ్ళో బాగా అల్లరిచేసి ప్రసిద్ధి పొందిన రౌడీఅబ్బాయి అప్పన్న అక్కడికి వచ్చాడు.

'ఏటి సేస్తన్నావు పంతులూ! పిట్టని పడతావేటి?' అన్నాడు.

అనంతుడు మొదట బిత్తరపోయాడుగాని వెంటనే తేరుకుని 'ఆఁ—పట్టరా చూస్తాను!' అన్నాడు. ఈమాట లంటున్నప్పుడు చిన్నినవ్వు నవ్వాడు. అప్పన్న వెంటనే అటు దుమికి, తువాలు ఆపిట్టఉన్న ప్రదేశంమీద పడవేసి, అతిసులభంగా పట్టుకుని చేతికి తీసుకున్నాడు ఆ పిచ్చుకపిల్లని. 'తూరీగని పట్టినట్టు పడితే వొస్తుందా పంతులూ! ఇలాగ!!' అన్నాడు విజయగర్వంతో.

అనంతుడు మెల్లిగా నవ్వుతున్నాడు. పిచ్చుకపిల్ల ఎగిరిపోడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ కిచకిచమంటున్నది. కీంక్రుకుంటున్నది. అప్పన్న దాన్ని ప్రతీక్షణమూ ఆపేస్తూ 'హేఁ!' అని వికటహాసం చేస్తూ ఆ పిచ్చుకపిల్లని నలిపేస్తున్నాడు.

అనంతుడికి ఈఅమానుషకృత్యం నచ్చలేదు. పిచ్చుకపిల్లని సున్నితంగా పట్టుకొని దారంకట్టి సరదాగా ఆడించాలని వుంది అతనికి. ఎప్పుడూ విచారార్థులాస్యరైవిచారాక్రాంతుడైఉన్న అనంతుడికి ఈ ఉత్సాహకరమైన ఆలోచన ఎందుకు జనించిందో మనకు తెలియదు. మన స్తత్వశాస్త్రజ్ఞాలు నిర్ణయించాలి.

కాని రౌడీ అప్పన్న చేతులలో ఆ పిచ్చుకపిల్ల అట్టేసేపు ఉండలేదు. నాలుగైదునిమిషాలు గడిచేసరికి నోట్లోంచి రక్తం రాగా, నలిగినలిగి చచ్చిపోయింది. కింద వదిలేసరికి విలవిలా కొట్టుకుంది. ఆ దృశ్యం చూస్తూంటే అనంతుడికి కంట నీరు ఆగింది కాదు. అప్పన్న 'ఛా! సచ్చిపోయింది!! ఎదవ

వయాల!!!' అని ఆ అల్పజీవిని ఇంకా ఏమో తిట్టి ఈలపాట పాడుతూ వెళ్ళిపోయాడు.

అప్పటికి ఆ పిచ్చుకపిల్ల చలనం లేకుండా పడిపోయింది. అనంతుడికి ఆ వేపు చూస్తూఉంటే చాలా భయం వేసింది.

అతని మనసులో యమదూతలూ యముడూ వెలిశారు. అనంతుడు చనిపోయిన తరువాతి వృత్తాంతం అది. యముడు చిత్రగుప్తుడిని ప్రశ్నించాడు. ఈ పిల్లవాడు ఏమైనా పాపం చేశాడా అని. చిత్రగుప్తుడు కోపించి జవాబు చెప్పాడు. 'అవును. గొప్ప పాపాలే చేశాడు. ఒక రోగగ్రస్తమైన, నిరపరాధి అయిన కుక్కను చంపాడు. తరువాత ఒక అమాయకపు పిచ్చుకపిల్లను, వీడిని ఏమీ చెయ్యకుండానే చంపించాడు. ఆ పిచ్చుకపిల్లచావుకి వీడే కారణం. ముమ్మాటికీ వీడే కారణం. అందుచేత వీడికి పెద్దశిక్ష విధించాలి.' యముడు ఉగ్రుడై అదేదో నరకం పేరు చెప్పి అందులో తోసెయ్యమన్నాడు. యమభటులు అనంతుని ఆ దిశకు తీసుకొనిపోతూ ముందే చెప్పారు. ఆ నరకంలో అగ్నిస్తంభాలని కౌగలించుకోవాలనీ; ఇంకా ఎన్నో బాధలు పెడతారనీ.

నిజంగా తానే ఆ పిచ్చుకపిల్లచావుకి కారకుడు. రాడీఅప్పన్నని, తాను, పిట్టని పట్టమనకపోతే వాడు పట్టడు. పిట్ట చావనూచావదు. చక్కగా రేపటెల్లుండికి, లేదా మరిరెండురోజులకి, పెద్దపిచ్చుక అయిఉండేది. తాను ఎంతో పాపం చేశాడు నిజానికి. జీవి ఎక్కడికుంచైనా తప్పించుకోగలడుగాని చిత్రగుప్తుని పుస్తకంలోంచి తప్పించుకోలేదు. తనని, చనిపోయాక, నిజంగానే ఆ నరకంలో అగ్నిస్తంభాన్ని కౌగలించుకోమంటారు. ఆపని చేయకపోతే కొడ్తారు. కొరడాలతో కొడ్తారు. ఇంకా ఎన్నో హింసలు పెడ్తారు. నరకమంటే సామాన్యమా?

ఈరోజుఉదయం బామ్మ, పక్షులుకూడా, బలవంతంగా చచ్చిపోతే దయ్యాలవుతాయని చెప్పింది. బామ్మకు అన్నీ తెలుసును. అందుచేత అబద్ధం చెప్పదు. ఈరోజు సాయంత్రానికి ఈపిచ్చుకపిల్ల దయ్యమై తనను పట్టితే? మంత్రగాళ్లు వస్తారు. దెబ్బకిగాని దయ్యం జడవదని ఆలోచించి తనని కొడ్తారు. కొట్టకపోతే దయ్యం వదలదు. కొట్టినా వదులుతుందనే నమ్మకం లేదు. దయ్యం పట్టినప్పుడింకా ఎన్ని బాధలు పడాలో అతనికి తెలుసును.

ఈఆలోచనలతో కొంతసేపు గడచినతర్వాత అతని చేతిరుమాలు చాలవరకు తడిసినట్లు అనంతునికి తెలిసింది. వెంటనే పుస్తకాల దగ్గిరకు నడిచాడు.

కాని అతనికి అక్కడకూడా మనశ్శాంతి లభించలేదు. మృతిచెంది, చలనం లేకుండా వున్న ఆపిట్టవేపు మళ్లా బయలుదేరాడు.

ఈరోజు ఎంతో పాపకరమైనది. నిజానికి ఈవిషయం, పొద్దునే లేవగానే ఎవరి ముఖం చూస్తామో వారి మీద కూడా ఆధారపడిఉంటుంది. ఈ విషయం అనంతునికి సుగ్రాహ్యమే. కాని—కాని—కొన్ని సంవత్సరాలబట్టి అనంతుడు ఉదయం లేవగానే బామ్మముఖం చూడడం అవుతున్నది; ఈరోజుమాత్రమే ఇంత దుఃఖకరమైన సంఘటన జరగడమేమి? ఇది ఎంతసేపు ఆలోచించినా అనంతునికి అగ్రాహ్యంగానే ఉండిపోయింది. కాని అతను త్వరలోనే ఒక నిశ్చయానికి వచ్చాడు. బామ్మముఖం ఏవిధంగానూ చెడ్డది కాదు.

మళ్లీ ఇటు తిరిగి ఆపిట్టకేసి తదేకంగా చూసేసరికి అనంతునికి దుఃఖం ఆగలేదు. ఆ పక్షిమరణంనే డతని మనస్సును బాగా వికలంచేసింది. పైగా ఆ మరణం తాను కారణభూతుడుగా ఉండగానే అయిందనికూడా అతనికి తెలుసు. ఉన్నపాటున రెండు చేతులూ జోడించి భగవద్ధ్యానం చేశాడు. ఆపక్షి హృదయశాంతి కోరి కాదు. అతని ప్రశాంతహృదయం అంతవరకూ వెళ్లలేదు. అంతకంటె కొద్దిగా క్లిష్టసమస్య అయిన తన పాపశాంతికోసం.

బడిఆవరణలో ఎక్కడా శబ్దమన్నది లేదు. ఇందాక పిచ్చుకలు ఒకటిరెండు అటువేపు వచ్చి కిచకిచమని కొంతసేపు అరచి ఎక్కడికో వెళ్లిపోయాయి. ఇప్పుడా శబ్దం కూడా లేదు. వాతావరణం ప్రశాంతంగా వుంది. కొన్ని ఆవులుమాత్రం ఒక మూల

చేస్తున్నవి. ఇంత ప్రశాంతవాతావరణంలో కూడా అనంతుకి వ్యథిత హృదయం విముక్తి పొందలేక పోయింది. అది, అతనిని ఏవో ఆలోచనలలో చాల దూరం తీసుకు పోయింది.

అనంతుడా పిట్టవేపు చూశాడు. చాలా చీమలూ పురుగులూ అదిక్కుకు వస్తూ పోతూ ఉన్నవి. ఒక మాటు, ఆ పక్షిని హింసిస్తున్న ఆ పురుగుల్ని, చీముల్ని— అల్పప్రాణులు!—ఒక్క దెబ్బలో చంపెయ్యాలని పించింది. మరొకసారి ఆ పాపం కూడా ఎందుకు మెడకి చుట్టుకోవడమూ అనిపించింది. కాని ఇంకొక సారి తానుమాత్రం ఆ పిచ్చుకపిల్లని హింసపెట్ట డంలో ఏమంత తీసిపోయినవాడు కాదని తెలియ గానే అనంతుడికిశరీరం విద్యుద్ఘాతమైనట్లు జలదరించి పోయింది. అతడు హతబుద్ధుడై అమృతలోకంతంకేసి దీన—నిర్నిమేషదృష్టి సారించాడు.

*　　　*　　　*

బడిలోకి పిల్లవాళ్లు అందరూ వచ్చేస్తున్నా రన్న సంగతికూడా గుర్తించలేదు అనంతుడు. ఆపిట్టకేసి నిమగ్నమైయున్న అతని శూన్యదృష్టి మరొకదిక్కి ప్రసరించలేదు. బడిగంటకొట్టినా అలాగే ఉండి పోయాడు. బడిపిల్లలు అటువేపు ఎందుకు రారంటే, మిగిలినచోట్ల అంతకంటె ఆకర్షణీయంగా, పరి శుభ్రంగా ఉంటుంది నేల, వాతావరణంకూడా. అక్కడ పూలమొక్కలు లేవు. నేల శుభ్రంగా లేదు.

ఉపాధ్యాయుడు ఒకాయన అట్నుంచి వచ్చాడు బడికి. వస్తూనే అనంతుడిని, ఎదురుగా పిట్టనూ, ఆ సమీపంలోనే ఉన్న మరొక గచ్చురాయినీ చూశాడు. ఆయన, జరిగిన విషయాన్ని అమూలాగ్రంగా గ్రహించినట్లు అనుకుంటున్నాడు.

'ఏమిరా అనంతం ? ఇక్కడేం చేస్తున్నావు ?' అని అడిగాడు.

అనంతు డేమీ మాట్లాడలేదు. అతని చెవులలోకి ఆశబ్దం వెళ్లలేదు.

'నిన్నే ! ఏంచేస్తున్నావిక్కడ ?' అని గర్జించాడు ఉపాధ్యాయుడు. ఇంకా అనంతుడు పలక లేదు. మరొకమాటు గర్జించాడు.

అనంతుడు లేచి వెర్రిగా చూశాడు ఆయనకేసి.

'ఏమిట్రా చేస్తున్నా విక్కడా ?' అని ఉరి మాడు ఉపాధ్యాయుడు కోపంతో మళ్లీ.

అనంతుడు ఒక్క చచ్చిపోయి '...పిట్ట !...' అన్నాడు.

ఉపాధ్యాయుని సందేహం తీరిపోయింది.

'ఊఁ—పిట్ట చచ్చిపోయి ఉందేం ?' అని అడిగాడు.

అనంతుడు చాలాసేపు ఊరుకొని—'నేను వొచ్చేసరికి — పిట్టేమో—ఊఁ—గెంతుతూంది ...' అని ఏమో చెప్పబోయాడు.

'ఊఁ—రాయితో కొట్టి చంపావుకదూ! వెధవ !! మంకుగానే ఉన్నట్టుండి ఇలాటి పన్లు చేస్తావూ ?—నిన్నా ?—ఏం ? నువ్వేనా చంపేవ్ ?' అన్నాడు ఉపాధ్యాయుడు ఒడ్డంవచ్చి.

అనంతుడు అనంగీకారసూచకంగా తల ఊపాడు.

ఉపాధ్యాయు డతనిని రెక్కపట్టుకొని తీసుకు పోయి, దారిలో అందినప్పుడల్లా కొడుతూ ప్రధానో పాధ్యాయుని గది చేరాడు.

'చూశారండీ చేష్టాడూ ? వేలెడు లేడుగాని, గుంటడు, పిచుకపిల్లని రాయితీసి కొట్టి చంపాడండీ! ఎప్పుడూ ఏమీ ఎఱుగని వంగనాచిలాగ ఉంటాడు గాని ఇంతింత ఘోరమైన పన్లు చేస్తున్నాడు.' అని, అనంతుడితో 'వెధవా ! ఎన్నాళ్లబట్టిరా ఇలాగ ?' అన్నాడు.

'ఏమిటీ ? పిచుకని రాయి తీసి కొట్టాడూ ! చంపాడూ !' అని ఆశ్చర్యపడుతూ ప్రధానోపాధ్యాయు డన్నాడు.

'ఆఁ—నిజం. కావలిస్తే చూడండి.' అని ఆ చోటుకు తీసుకువెళ్లాడు. త్రోవలో ఎంతోమంది పిల్లలు వెంటపడ్డారుగాని వాళ్లందర్నీ బలవంతాన వెనక్కి పంపించారు.

చచ్చిన ఆ పిచ్చుకని చూసి ప్రధానోపాధ్యాయు డన్నాడు:

'పాపం...ఎలా తింటున్నారురా చీమలూ అవీ—ఏమిరా నీకింత బుద్ధిలేకపోయింది ?—...నిజంగా నీవే చంపేశావండీ ?'

'ఆఁ! నీవే. నే నొచ్చేసరికి బిక్కచచ్చిపోయి చూస్తూ కూచున్నాడు. ఏంచేస్తున్నావురా అని నూరు మాట్లడిగినా జవాబు చెప్పడు! నువ్వే చంపావా పిట్టనీ అంటే మాటాడ్డు. ఆహా ఇదిరా సంగతి అనుకున్నాను. ఏం చెయ్యడం బాబూ కాలం అలా అయిపోయింది—స్వచ్ఛమైన బ్రాహ్మణపిల్లవాడు—అమానుషకృత్యాలే చేస్తున్నాడు ఏకంగా!—ఊఁ! ఇంత చిన్నప్పుడే యిలా చేస్తుంటే ఏమిటనుకోవం ?—ఊఁ ?— ఏం చెయ్యడం వీణ్ణి ?' అని నానావిధరసాలా అభినయం చేస్తూ చెప్పాడు గురుదేవుడు ; మధ్యమధ్య అనంతుడిని బాగా కదుపుతున్నాడు ; అనంతుడి ఎడమచెయ్యి, భుజసమీపంలో కొలదిరోజుల క్రిందట ఇరుకుపట్టిందని చెప్పాను—ఆ చెయ్యిపట్టుకునే కుదుపుతున్నాడిప్పుడు ఉపాధ్యాయుడు. అడపాతడపా నొప్పికలిగిస్తున్నప్పటికీ, అనంతుడు బిగ్గరగా ఏడ్వలేదు. తాను చాలా కాలం కష్టపడి అలవాటు చేసుకుని ఉండడంవల్ల లోపల్లోపలే కుమిలిపోయాడు.

ప్రధానోధ్యాపాయుడు ఉగ్రుడై 'తప్పు ఒప్పుకునేవరకు చితక్కొట్టండి.—అంతే' అన్నాడు. పిల్లల శిక్షణలో పట్నమంతటికీ ఆయనది పెట్టింది పేరు. ఆయననిఘంటువులో శిక్షణ అంటే శిక్ష అని అర్థము.

ఉపాధ్యాయుడు అనంతుని చెవి పట్టుకుని తిప్పుతూ 'వెధవ—ఏం ? ఎప్పుడూ ?—నువ్వేనా ?—నువ్వేనా చంపేవ్ ?—నువ్వేనా ?—ఊఁ ?—చెప్పు—చెప్పు!' అన్నాడు.

అనంతుడు బిగ్గరగా ఏడ్చాడు. కాని ఏమీ జవాబు చెప్పలేదు. ఉపాధ్యాయుడు మళ్లీ కొడుతూ అన్నాడు. 'ఏం ? నువ్వేనా ?—చెప్పు !—వెధవ !—చెప్పు !—నువ్వేనా ?—ఇలా చెయ్యి చాపరా వెధవా ?—ఆఁ ?' అవి గర్జనలే నని చెప్పవచ్చు.

ఇక మరి ఆ ఉపాధ్యాయుడు అనంతుని కొట్టడంలో ఎంత ఘోరమార్గాన్ని అవలంబించాడో నేను వర్ణించలేను. అన్ని దెబ్బలూ కొట్టి ఆగిపోయి మళ్లీ ప్రశ్నించాడు: 'చెప్పు! చెప్పేదాకా కొడతాను—నువ్వేనా కొట్టావు ?—నువ్వేనా చంపేవు ?'

అనంతుడు ఘోరంగా ఏడుస్తూ 'నేనే—కాదు, రాడీ—అప్పన్న—కాదు—నేనే—నేనే—' అన్నాడు. చాలసార్లు వెక్కాడు.

'ఈమాత్రం చెప్పేందుకింతాలస్యం దేనికి ? ఇన్ని దెబ్బలు తినడం దేనికి ?' అనిమాత్రం అన్నాడు ప్రధానోపాధ్యాయుడు.

ఆయన స్వయంగా అనంతుడిని ఆ పిచ్చుకపిల్ల దగ్గరకు తీసుకువెళ్లి, దానిని తీయించి, పారవేయించి అనంతుడిని తిరిగి తరగతిలో కూర్చోబెట్టాడు. చెయ్యి కడుగుకుందికి నీళ్లు లేవు. ఆసంగతి చెప్పాడు అనంతుడు. ప్రధానోపాధ్యాయుడు ఆలోచించి 'సరే కూర్చో' అన్నాడు.

ఒకగంట పోయాకో ఎప్పుడో నీళ్ళు తెప్పించి పోయించారు. అనంతుడు చెయ్యి కడుగుకున్నాడు. కాని అతనికి చెయ్యివేపు ఎన్నిసార్లు చూడాలనిపించిందో లెక్కలేదు. ఎన్నిసార్లు చూశాడో లెక్కలేదు. కాని, ఎన్నిసార్లు అటు చూసినా అతనికి ఆ రక్తపుమరక, పిచ్చుకపిల్ల దేహం కనుపించేవి.

నాడు అతను మానసికంగా, శారీరకంగా బాగా దెబ్బలుతిన్నాడు.

* * *

నాటిరాత్రి అనంతునికి ఎన్ని కలలు వచ్చాయో చెప్పలేము. కాని, తెల్లవారి లేవగానే అతని ముఖం ఏదో అవ్యక్తవ్యథ మనసులో ఉన్నట్టు చెపుతున్నది. ఆరోజు అంతా అతను నవ్వలేదు.

క్రితంరోజు జరిగిన సంఘటనవలన ఎవరో కొందరు బాలురు అనంతుడిని ఆ రోజు వ్యథితుడినిగా చేయడానికి ఉపయోగించుకున్నారు. అనంతు డది చూసి చాలా బాధపడ్డాడు.

మరునాటి మధ్యాహ్నం అనంతుడు బడికి ముందుగానే వెళ్లి కూర్చున్నాడు. ఈసారి అతను, మురికిగా వున్న ఆ వైపుకు వెళ్లకుండా, వేరేగా కట్టబడివున్న ఇంటి వరండామీద కూర్చున్నాడు. ఏమాత్రం అలికిడిఅయినా పిచ్చుక దయ్యమై వస్తున్నదనే భ్రమపడిపోతున్నాడు. దృష్టి సారించి ఆ శకుంత మృతస్థానాన్ని తలుచుకుని చూసేసరికి అతనికి ఎంతో ఏడ్పు వచ్చింది. మనం ఎంత చిన్న జంతువునైనా చంప కూడదు. మనలో భూతదయ అపారంగా ఉండాలి అనే వాక్యాల్ని మనసా పట్టించుకున్నాడు అనంతుడు అదివరలో మనం ఏజంతువునైనా చంపేస్తే మనల్ని భగవంతుడు చంపేస్తాడనికూడా అతనికి తెలుసును. ఆ పక్షిని చీమలు కొరికి తినడం జ్ఞాపకానికి వచ్చింది వీటికితోడు. వెంటనే అనంతుడికి ఎక్కడలేని దుఃఖమూ పొంగిపొరలింది. కన్నీళ్లు అప్పటికే బుగ్గలమీదికి వచ్చాయి. అతడు ఇంక అక్కడ ఉండలేకపోయాడు.

అక్కడినుంచి అవతలి వరండావైపు నడిచాడు. అక్కడ పరధ్యానంగా కూర్చున్నాడు. అక్కడ ఒక ఈతట్టు ఇంటి మూలకు తగులుకొని, గాలి వీచినప్పుడల్లా కీచు కీచు మని అరుస్తున్నది.

అనంతు డక్కడ చాలసేపు కూర్చున్నాడు. ధ్యానమంతా పక్షిమీదనే ఉంది. ఈతిచెట్టుసంగతే అతనికి తెలియదు. ఎన్నో మారులు ఆ కీచు కీచు ధ్వని మాత్రం వినపడ్డది. అన్నిమారులూ ఆ పిచ్చుకపిల్ల దయ్యమై అరుస్తున్నదనే భావించాడు. ఆ దయ్యం ఇలా అరచింది:

"నేను ఏ పాపమూ ఎఱగనే, నన్ను ఆ రౌడీవెధవాయిచేత చంపిస్తావూ? నీకు దయా, దాక్షిణ్యమూ లేవూ? నేనూ నీలాంటి జీవిని కానూ? నా ఆత్మని ఇలా శాంతి లేకుండా ఏడిపిస్తావా? ఈ దయ్యంఅవస్థలో ఎన్ని సంవత్సరాలు ఉండాలో కదా నేను! ఆ దేమీ ఆలోచించుకోకుండా నన్నలా చంపించేస్తావుకదూ! కీచు కీచు.

ఎప్పటి కయినా నీకు శిక్ష జరగకపోదులే. నన్ను బలవంతంగా చంపించిన నువ్వూ బలవంతంగానే చస్తావు. నీకూ భగవంతుడు అలాటిచావే రాసిపెట్టాడులే దురాత్ముడా! కీచుకీచు."

అనంతుడు ఏడుస్తూ మనసులో అనుకున్నాడు— "నే నేంచేసేది? కోరికండి నిన్ను చంపించానా? అలా అయితే నువ్వు చెప్పినట్టే అవుతుంది. వాడిని నాసరదా కొద్ది నిన్ను పట్టుకోమన్నానుగాని చంపేయ్యమన్నానా? సరదాగా నీతో ఆడుకుందామని అనుకున్నాను గాని నిన్నుచంపేయాలనుకున్నానా? నే నేమీ ఎఱగను. ఒట్టు. దేముడితో చెప్పవూ నన్ను గట్టిగా కొట్టవద్దని? అగ్నిస్తంభం నేను కౌగలించుకోగలనా చెప్పూ?"

* * * *

నాటి సాయంకాలం కాగా చీకటిపడినతరువాత బామ్మను అనంతు డడిగాడు: 'మరి, దెయ్యా లన్నీ ఎక్కడుంటాయి?'

'ఏమో? ఎక్కడపడితే అక్కడే వుంటాయి. కొన్ని దెయ్యాలు ఎప్పుడూ అలా తిరుగుతూనే ఉంటాయి. వాట్ని తిరుగుడుదెయ్యా లంటారు. మరి కొన్ని తిరగవ్. స్మశానంలోనే ఎప్పుడూ ఉండి పోతయి. వాట్ని స్థలదెయ్యా లంటారు'.

'మరి స్మశానంలో పీనుగులూ అవీ వుంటాయి కదా, దెయ్యాలకి భయం వెయ్యదూ?' అని అప్రయత్నంగా అడిగేడు అనంతుడు.

'పీనుగులూ దెయ్యాలూ దెబ్బలాడుకోవు. అసలు పీనుగు లన్నవి ఎక్కడోగాని ఉండవు. పీనుగుల్ని సాధారణంగా కాల్చి బూడిద చేసేస్తారు. పాతిపెట్టిన శవాల్ని మాత్రం నక్కలు పీక్కుతింటయి.'

'మరి ఆ నక్కలూ దెయ్యాలూ దెబ్బలాడుకోవూ?'

'ఊఁహూఁ'.

చాలాకాలం క్రిందట మొదలెట్టాడు అనంతుడు —బామ్మను ఈ రకం ప్రశ్నలు అడగడం. 'తప్పు. అలాటివి మాట్లాడుకోకూడదు.' అని బామ్మ పల్లవాని

దృష్టి మరల్చ ప్రయత్నించింది. అనంతుడు అటువేపు నుంచి మరలకపోవడం చూసి మా బాబుకి గుండె ధైర్యం ఎక్కువ అని సమర్థించుకుంది. కాలక్రమాన వారిరువురికీ ఆతీరు అలవాటయిపోయింది. అందుచేతనే నేను అలా చెప్పగలుగుతున్నది బామ్మ.

'అయితే స్మశానంలో ఉండే దెయ్యాలు - స్తబ్ధు దెయ్యాలు రాత్రీ పగలూ అక్కడే ఉండిపోతయ్యా?' అని అడిగాడు అనంతుడు మళ్లీ.

'ఆఁ, అక్కడే ఉంటాయి. కాలం తీరకుండా తనంతట తాను చచ్చిపోయే మనిషి ఉన్నాడనుకో. వాడిదెయ్యం గాలిలో ఎప్పుడూ తిరుగుతూంటుంది ఆయుష్షు తీరిపోయేవరకూ. ఇక, కాలం తీరకుండా ఒకళ్లచేత చంపబడ్డవాళ్ళ దెయ్యాలు స్తబ్ధుగా అలా ఒకచోట, అంటే స్మశానంలో ఉండిపోతాయి.' అన్నది బామ్మ.

అనంతుడు మాట్లాడకుండా పడుకుండిపోయాడు.

స్మశానంలో ఎక్కడెక్కడ బలవంతాన చంపబడిన జీవుల దెయ్యాలూ కలుసుకుంటున్నాయి. అప్పుడే చీకటిపడుతున్నది. పగలల్లా శవాల్ని కాల్చడానికి వచ్చిన మనుష్యుల అలజడిని భరించలేకయితే నేం, శవం కాలిన పొగలు పైకి వెళ్లిపోతున్నప్పుడు పీల్చడానికి అయితేనేం చెట్లమీదా అక్కడా ఉండిపోయిన దయ్యాలు ఒక్కటొక్కటే పైకి రాసాగేయి. ఒకచోట చేరుకుంటున్నాయి అవన్నీ. మొత్తంమీద ఓ వందాయాభై దయ్యాలదాకా గుమిగూడేయి.

అవన్నీ కొన్ని భాగాలయిపోయాయి. పదేసి దయ్యాలో పదిహేనేసి దయ్యాలో ఒక్కొక్కచోట గుమిగూడుతున్నాయి. అన్నీ తమతమ గతజన్మ అంతం యొక్క వృత్తాంతాల్ని చెప్పుకుంటున్నాయి.

'నా గతజన్మం ఒక కుక్కజన్మం అన్నమాట. నేను రోగంతో కుళ్లి కుళ్లి చావడానికి సిద్ధంగా వున్నాను. అయితేమటుకు నాకు అప్పటికింకా చాలా ఆయుష్షుంది. ఒక పిల్లాడు పెద్దరాయి ఒకటి తీసి నన్ను చంపాడు. ఇలా దయ్యాన్నయిపోయాను. ఇంకా ఈ యవస్థలో ఎన్నాళ్లుండాలో!' అన్నది ఒక దయ్యం.

అనంతుడికి గబుక్కున మెలకువ వచ్చేసింది. తరవాత పిచ్చికపిల్ల దయ్యం తనమీద ఏం చెప్తుందోనని భయంగా ఉంది అతడికి.

* * * *

మరునాడల్లా అవూళ్లో ప్రచండమైన వర్షం కురిసింది. ఊరంతా చలి వేస్తూ ఉంది. సాయంకాలం నాలుగింటికి వర్షం తగ్గింది. కాని ఐదున్నరకి మళ్లీ బాగా విజృంభించింది.

రాత్రి సుమారు ఏడుగంటలకి అనంతుడి తండ్రి వంటింటివేపు వెళ్ళాడు. 'రోజూ ఈపాటికి భోంచేసి పడుకునేవాడు. ఔను, ఇవాళ అనంతం ఏం భోం చెయ్యలేదు?' అన్నాడు భార్యతో.

'మధ్యాహ్నం పడుకున్నాడు. ఇంకా లేవలేదు. ఎందుకు లేపడం అని వూరుకున్నాను.

'వెళ్లి లేపు. ఏదో ఇంత తిని పడుకుంటాడు.'

అనంతుడి తల్లి వెళ్లింది. తిరిగి వేగమే వచ్చి—

'ఎక్కడికి వెళ్ళాడో మీరుగాని చూశారా? గదిలో లేడు. పెరట్లో లేడు. అత్తగారిదగ్గరా లేడు.' అంటూ గాభరాపడ్డది.

అప్పుడే వీధిలోంచి ఇద్దరుమనుష్యులు అనంతుడిని ఒక బండిలో వేసి తీసుకువచ్చారు. అందులో ఒకడు బలిష్ఠుడు; యువకుడు. అన్నాడు 'పిల్లలందరితోనూ ఆడుకుందికి వెళ్లినట్టున్నాడు. పొలాలదగ్గర చెరవులో పడిపోయాడు. మేం మా పొలంలోకి నీళ్లు పెట్టుకుంటున్నాం. మేమూ అట్నుంచి వస్తున్నాం. మరో యిద్దరు పిల్లలు అక్కడినుంచీ అరుస్తున్నారు. వాళ్లు అల్లా ఎగువపేటవాళ్ల పిల్లలు. చెరువులో పడిపోయాడో అని అరుస్తుంటే మేం వెళ్లితీశాం. డాక్టరుగారి దగ్గిరకి తీసుకవెళ్లా నీళ్లో తీయించాం. రాత్రి పన్నెండుగంటలకి తెలివి వస్తుందిట. ఆయన చెప్పారు మీరు అదృష్టవంతులే. అట్టే నీళ్లు తాగలేదు పిల్లాడు.'

రాత్రిఅంతా అనంతుని తల్లి అతని మంచం ప్రక్కనే కూర్చున్నది. అనేకసార్లు అనేకరీతుల

అనంతుడు ఒక పిచ్చుకపిల్లనుగూర్చి పలవరించడం విన్నది. ఆమెకు అర్థమయినది ఒక్కటే. పిల్లవాడికి నిద్రలో కల వచ్చింది.

మరునాటి రాత్రికి జ్వరం కొంచెం తగ్గింది. అతని తల్లి అతని మంచానికి దగ్గరలోనే ఇంకొక మంచంమీద పడుకున్నది. తొలినాటి రాత్రి నిద్ర లేకపోవడంవల్ల కొలదిసేపట్లోనే నిద్రాపరవశురాలైంది.

సరిగా పదిన్నరగంట లయింది. అనంతుడు లేచి కారణరహితంగా శ్మశానం వేపుకి బయలుదేరాడు. ఊరి పొలిమేరలు దాటేడో లేదో, విపరీతంగా నక్కల అరుపులు వినపడ్డాయి. అనంతుడు వాటికి జడవలేదు. ఇంకా సాగిపోయాడు. శ్మశానం ఊరికి అట్టే దూరం లేదు. అతను కొలదిసేపట్లోనే అక్కడికి చేరుకున్నాడు.

* * * *

మర్నాటి ఉదయానికి అనంతుడు శ్మశానం సమీపంలో ఉన్న ఒక శివాలయంలో నిద్రపోతూ కనుపించాడు. బహిర్భూమికి అటు వచ్చిన గ్రామీణులలో దైవభక్తులైన ఒకరిద్దరు చూశారు. సాధారణంగా అక్కడికి పగలే ఏ పిల్లలూ రారు. అట్టిది రాత్రి వచ్చినట్టుంది - అనంతు డక్కడ ఉండడం వారికి చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆ పిల్లవాడు ఎవరి తాలూకు అనేది వారికి అందలేదు.

అచటికి చేరిన వ్యక్తులలో ఒకడు అనంతుని లేపబోయి శరీరంమీద చెయ్యివేశాడు. అతని శరీరం ఎంతో ఉష్ణం చూపుతూ ఉంది. వారికి సంభ్రమం తరువాత జాలికలిగింది. ఆ పిల్లవానిని పోలీసుస్టేషనుకు తీసుకువెళ్లారు. ఎవరైనా, పిల్లవాడొకడు తప్పిపోయినట్లు చెపుతూ వచ్చినట్లయితే చూడమని చెప్తూ అక్కడ పండుకోబెట్టారు.

పగలల్లా వెతికి వెతికి, అనంతుని తల్లిదండ్రులు, సాయంత్రం పెద్ద పోలీసుస్టేషనులో చెప్పారు. పిల్లవాడు పడివున్న చోటు చెప్పారు అక్కడివాళ్లు. వారు గాభరాపడుతూ అక్కడికి చేరుకున్నారు.

'పగలల్లా తెలివి రాలేదు. అలాగే పడివున్నాడు. అన్నమనీ దాహమనీ ఏమీ అడగలేదు. ఏవో పిచ్చుకలనీ దయ్యాలనీ పలవరిస్తూనే ఉన్నాడు. ఉష్ణం అపా తపా చూస్తూనే ఉన్నాం. జోరుగానే వుంది.' అన్నారు అక్కడి వాళ్లు.

ఆ రాత్రి డాక్టరుకూడా పలవరింపులు విన్నాడు. అసలుసంగతేమీ బోధపడక తికమకపడ్డాడు. కాని ఏదో అయిందని మాత్రం అనుకున్నాడు కాని అలా అనుకోవడంవల్ల ప్రయోజనం లేకపోయింది. జ్వరంకూడా ఆ ఉన్మాదావస్థతో సమాంతరంగానే పెరుగుతున్నది.

పదిహేను రోజులు గడిచాక పిల్లవాని స్థితి చాలా మారింది. తోటిపిల్లలందరిలోనూ బలిష్ఠుడయిన అనంతుడు సన్నంగా, ఊసపుల్లలాగా తయారయినాడు. పలవరింపులు యథాప్రకారంగానే ఉన్నవి. అప్పుడప్పుడు 'యమదూతలు, నేను చచ్చిపోతాను' అని కూడా అంటున్నాడు.

ఆనాటి రాత్రి బామ్మను అడిగాడు అనంతుడు.

'మామ్మా! నేను చచ్చిపోతానుగదా! దెయ్యాన్ని అవుతానూ?'

'ఒద్దురా బాబూ. తప్పు. అలాంటిమాట లనకూడదు' అన్నది బామ్మ ఖేదపడి.

'రాజకుమారుడి కథ చెప్పు మామ్మా!' అన్నాడు మరికొంతసేపాగి, అనంతుడు.

'ఒద్దమ్మా! పడుకో.'

'అబ్బా చెప్పూ -' మూలిగాడు అనంతుడు.

బామ్మ గాభరాతో చెప్పడం మొదలుపెట్టింది. మధ్యమధ్య కొన్ని వదిలేసిందికూడా సగంలో. అనంతు డన్నాడు—

'నా కీ కథ వొద్దు. పిచ్చికకథ చెప్పు.'

'చిక్కొచ్చిందే నీతో! - అయితే ఊకొట్టు. ఒకనాడు—అనగాఅనగా, పిచుకా కాకీ స్నేహం చేసుకుని వున్నాయిట—'

'ఛీ ఛీ ఇది కాదు. అప్పన్న పిచికని చంపెయ్యడమూ అదీ - ఆ కథ చెప్పు.'

బహుశా అది వాచకపుస్తకంలోని కథ కాబోలు ననుకున్నది బామ్మ.

'అయితే రేపు చెపుతానులే పడుకో.' అన్నది బామ్మ.

'రేపు తప్పకుండా చెబుతావా?'

'అలాగే చెబుతాను పడుకో.'

* * * *

మరునాడు అనంతుడు బామ్మను కథ చెప్పమని అడగలేదు. అనంతునిగూర్చి బామ్మ ఎందరితోనో చెప్పడంమాత్రమైంది.

# శివస్కందవర్మమహారాజు కానుకొల్లు తామ్రశాసనము

శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు

కానుకొల్లులో దొరికిన గొప్పశాసన మిది.* దీని కడియమును, రాజముద్రికను దొరికిన వెంటనే ధ్వంసము చేసినారు. బంగారమేమో యని భ్రమపడినారు. అందువలన ఎంత యపకారము! దేశచరిత్ర రచనకు తీరని అపకార మెంత జరిగెనో ఊహించుకొనవలయును. †

ఈ దానశాసనము నాలుగు రేకులమీద వ్రాయబడియున్నది. మొదటి, చివర రేకులమీద వ్రాత లోపలివైపున నున్నది. వెలుపలి తట్టున వ్రాత లేదు కాని మిగిలిన రెండు రేకులమీద రెండు వైపులను కూడ వ్రాత కలదు. పుస్తకములోని పుటసంఖ్యలట్లు వ్రాత గల రేకులమీద పుటసంఖ్య లున్నవి. ఆ పుటసంఖ్యలు రేకునకు ఎడమభాగమున, కడియమును దూర్చుటకు చేయబడిన రంధ్రమునకు ఎగువ నున్నవి. రేకులకు అంచులు లేవు; మందముగా నున్నవి. రేకుల పొడవు ౬ అంగుళములు; వెడల్పు ౨ అంగుళములు. నాలుగు రేకులను తూచగా ౬౦ తులముల బరువున్నవి. శాసనమును రేకులపై చెక్కించుటకు పూర్వమే కడియమును దూర్చుటకు వీలుగా రంధ్రములు చేయబడినట్లు ఊహించుకొనవచ్చును.

రాగిరేకులమీద వ్రాత చక్కగా నున్నది. చెడిపోలేదు. కాని యీ రేకులు ఏ లోహమో తెలుసుకొనుటకు, తరువాత వాటిపైనున్న వ్రాతను చదువుటకును బాగుగా అరిగిపోవునట్లు తోముటచేత కొన్ని అక్షరములు కొంచెము అరిగినట్లు కనబడును. ఈ శాసనభాష సంస్కృతము. గద్యాత్మకము. కడపటి శాసనములు మాత్రము శ్లోకరూపమున నున్నవి. శాసన లిపి నాలుగవశతాబ్దమునాటి ప్రాచీన వేంగిలిపి. అది విజయ దేవవర్మ ప్రాకృతశాసనలిపిని1, దామోదరవర్మ మట్టెపాడుశాసనలిపిని 2, అత్తివర్మగోరంట్లశాసనలిపిని3,

---

* మొదటిదానిని గురించిన వ్యాసము గత జనవరి భారతిలో ప్రచురితమైనది.

† దానశాసనములు రాగిరేకుల మీద వ్రాయబడును గాని బంగారపు రేకులమీద వ్రాయబడవు. ఆ విషయము లోకమునకు తెలియవలయును. మూర్ఖులు కొందరు శాసనపు రేకుల రాగి బహుప్రశస్తమైనదనియు, అది తామ్రభస్మములు చేయుటకును, ఔషధములం దుపయోగించుటకును తగినదనియు నొక పిచ్చిమతమును లోకమునందు వెల్లడించి శాసనపు రేకులు దొరికిన విషయముకూడ నెవ్వరికిని తెలుపక తామ్రభస్మమును గాని, రాగిచెగిసాలను గాని చేయించుకొనుటచే నశించినవి యనేకము. రాజమహేంద్రవరము మునిసిపలు మ్యూజియములో నుండిన అన్నదేవచోడుని అపూర్వ తామ్రశాసనమును తామ్రభస్మమునకై నాడు తెలిసినవారొకరు ధ్వంసముచేసినారు. గుడివాడ తాలూకా చినటపల్లి గ్రామమున దొరికిన రెండు గుదులను అనేకవిధముగా చెగిసా చేయించుకొనుట కుపయోగించుటయు జరిగినది.

1. ఎపిగ్రాఫియా ఇండికా. సం ౯. పుట ౫౪ మొ.

2. అదేసంపుటము ౧౪. పుటలు ౩౨౪ మొ.

3. ఇండియన్ అంటిక్వేరి. సం. ౯, పుట ౧౦౨ మొ.

స్కందవర్మకొండేరుశాసనలిపిని[4], విజయనందివర్మ పెదవేగితామ్రశాసనలిపిని[5] పోలియున్నది. అయినప్పటికిని, కొంత భేదము అస్పుటస్పుట కానవచ్చుటచేత ఈ దానశాసనము విజయదేవవర్మ దామోదరవర్మల శాసనకాలమునకు కొంచెము తరువాతికాలమువాటిదని నిర్ణయింపవలయును. ఇంతకంటెను సూక్ష్మతరముగా నుండు వ్యాఖ్యానమునందు కాలనిర్ణయము చేయ ప్రయత్నించెదను.

ఈ దానశాసనము శాలంకాయనస్కందవర్మ మహారాజుచే, వారిని విజయరాజ్యము ప్రారంభమయిన మొదటిసంవత్సరమున నొసగబడెను. విజయనందివర్మ పెదవేగితామ్రశాసనమువలె నీ శాసనముకూడ దానపతియొక్క వంశక్రమమును ప్రపితామహునివఱకును తెలుపుచున్నది. అందువలన ఈ శాసనమునం దొక విశేషమున్నది. దానపతియగు స్కందవర్మకు ప్రపితామహునకు మొదటిహస్తివర్మ, పితామహునకు నందివర్మ, తండ్రి గొంగన, లేక యుమ్మడిహస్తివర్మ. శాలంకాయన వంశక్రమమును చర్చించినపుడు ఈ దానశాసనముయొక్క విశేషము గోచరింపగలదు. నిజరాజధానియైన విజయవేంగిపురమునుండి స్కందవర్మమహారాజు, తాను పట్టాభిషిక్తుడైన మొదటిసంవత్సరమున, కార్తీకశుద్ధ పాడ్యమినాడు ఈ దానశాసనము ప్రకటించెను. ఇందు దానపతియొక్క పూర్వులు ప్రపితామహునివఱకు పేర్కొనబడిరన్న విషయ మొక్కటి తప్ప మిగిలిన అన్ని విషయములందును ఈ శాసనము కొమఱ్ఱాజులక్ష్మణరావుగారు ప్రకటించిన విజయస్కందవర్మకండేరుతామ్రశాసనమును పోలియున్నది. కావున నీ స్కందవర్మయు, కండేరుశాసనదాత యగు విజయస్కందవర్మయు నొక్కరే యగుదురా యన్న అనుమానము తోచును. ఈ శాసనమునందు ౧ మొదలుకొని ౬ వఱకు అంకె లున్నవి. ఈ యంకెలు గమనింపదగినవి.

4. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. ౧౧ పుట ౧౧౩ మొ.

5. భారతి. సం. ౧.

మాతృవంశసంబంధమును పేరుతో కలిపి తెలుపుకొను నాచారము వాసిష్ఠీపుత్ర, గౌతమీపుత్ర, హారీతీపుత్ర, మాఠరీపుత్ర యని తమ నామములకు చేర్చుకొను సంప్రదాయము శాతవాహనులనాటనుండి, ఇక్ష్వాకులకు తరువాత ఆంధ్రభూమి నేలిన కొన్ని రాజవంశములకు సంక్రమించెను. కాని ఆ సంప్రదాయము, ఆ ఆచారము క్రీ. శ. మూడవశతాబ్దము నడిమిభాగమునాటికి అంతరించెను. ఆనాటినుండి పైతృకవంశమును పితామహ, ప్రపితామహులవఱకును వంశక్రమము దెలుపు నాచారము రాజవంశములందు నెలకొనెను. ఆనాటినుండి "బప్పభట్టారకపాదపరిగృహీతస్య", "బప్పభట్టారకపాదభక్తస్య" అను విశేషణములు పల్లవ, శాలంకాయనాది రాజవంశముల దానశాసనములందు ఉపయోగింపబడుట ఆరంభమయ్యెను. అప్పటికి మూడవశతాబ్దము సగము గతించెను. బౌద్ధయుగము నిష్క్రమించి, దేవబ్రాహ్మణయుగము — క్షాత్రధర్మముతో జత కలుపుకొనుచున్న బ్రాహ్మణధర్మము—ఉజ్జ్వలమైన శక్తితేజములతో అవతరించిన కాలమది—యజ్ఞయాగాది క్రతువులు వేదోక్తకర్మలు యథావిధిగ మరల నాచరింపబడుటకు ప్రారంభించిన కాలము మూడవశతాబ్దపు రెండవభాగము. దేవబ్రాహ్మణ ధర్మములను పూర్తిగా నవలంబించి, ఆంధ్రదేశము నేలిన రాజవంశములలో మొదటివారు శాలంకాయనులు. పల్లవులు ఆంధ్రులు కాకపోవుటవలనను, వా రేలినది దక్షిణాంధ్రసీమ యగుటచేతను వారిని ప్రథములుగా పేర్కొనజాలము.

దానపతి స్కందవర్మ యిచ్చిన తన పూర్వుల వంశక్రమముతో మనకు తెలిసిన యితరశాలంకాయనులకు సంబంధమును కలిపి, యొక వంశక్రమమును ఏర్పఱచుట మనకు ఈ శాసనమిచ్చిన సమస్య. ఇంతవఱకు శాలంకాయనులవి ఏడు తామ్రశాసనములు, కొన్ని రాగినాణెములు లభించియున్నవి. వాటిని ఇట పేర్కొందును:

౧. నందివర్మమహారాజు కానుకొల్లు ప్రాకృత శాసనము.

౨. విజయదేవవర్మ ఏలూరు ప్రాకృతశాసనము.

౩. విజయనందివర్మ కొల్లేరుతామ్రశాసనము.

౪. నందివర్మ మహారాజు పెదవేగితామ్ర శాసనము.

౫. నందివర్మమహారాజు కంతేరుశాసనము.

౬. విజయస్కందవర్మ కంతేరుశాసనము.

౭. స్కందవర్మ యీ కానుకొల్లుశాసనము.

ఈ శాసనపట్టికల నన్నింటిని పరీక్షింపగా, శాలంకాయనవంశమందు ఒక విజయదేవవర్మ, యిద్దరు నందివర్మలు, యిద్దరు హస్తివర్మలు, ఇద్దరు స్కంద వర్మలు కానవచ్చుచున్నారు. విజయనందివర్మ పెదవేగిశాసనములో పేర్కొనబడిన నాలుగుతరముల వారిని, ఈ కానుకొల్లుశాసనమందు పేర్కొనబడిన నాలుగుతరములవారిని ఇరుప్రక్కలనుంచి పరికించిన, రెండు వంశక్రమములకును కొంత సంబంధ మున్నట్లు గనబడును.

వర్మకు కనీసము ఇద్దరు కుమారు లుండిన ట్లూహింప వచ్చును. ఈ కానుకొల్లుశాసనమున దెలుపబడిన రెండవ హస్తివర్మయు, పెదవేగిశాసనమునం దుదాహరింపబడిన 'ప్రతాపోపనతసామంతు'డైన చండవర్మయును ఈ ఇరువురును మూర్ధాభిషిక్తులయిన నృపాలురు. రెండవ హస్తివర్మకు వలె చండవర్మకుకూడ శాసనములందు 'మహారాజశ్రీ' పదము చేర్చబడినది. అదిగాక చండ వర్మనాగినాణెములుకూడ దొరికెను. తాత పేరు మనుమ నికి పెట్టుకొను సంప్రదాయము శాలంకాయనరాజ వంశమునం దున్నది గావున రెండవ నందివర్మకు రెండవ హస్తివర్మ పెద్దకుమారుడును, చండవర్మ రెండవకుమా రుడు నైయుందు రని యూహింపవచ్చును. లిపి సంకేతములను పరికించినపుడు స్కందవర్మ కానుకొల్లు శాసనము నందివర్మ పెదవేగి కొల్లేరుశాసనములకంటెను ప్రాచీనతర మైనదని నుడువవచ్చును. అట్టి సందర్భ మున, కానుకొల్లుశాసనదాత స్కందవర్మయనంతరము,

కానుకొల్లు శాసనము

మొదటి హస్తివర్మ
(అనేక సమరముఖ విఖ్యాతకర్మణః)
|
నందివర్మ (రెండవ ?)
(స్వప్రతాపావనీతాహితవర్మణః)
|
రెండవ హస్తివర్మ
(చతురుదధితిరంగాలింగితయశసః)
|
స్కందవర్మ

పెద వేగి శాసనము

హస్తివర్మ
(అనేక సమరావాప్తవిజయినః)
|
నందివర్మ
(వివిధ ధర్మప్రధానః)
|
చండవర్మ
(ప్రతాపోపనతసామన్తః)
|
విజయనందివర్మ (జ్యేష్ఠుడు) | ఇతరకుమారులు

పై నిచ్చిన రెండుపట్టికలలో మొదటివాడు— హస్తివర్మ—రెండింటను సమానుడుగ గన్పట్టు చున్నాడు. కావున ఆ యిద్దరు హస్తివర్మలును ఒక్కరే యని నిర్ణయింపవచ్చును. వారికి చేర్చబడిన విశేషణము లించుమించుగా నొకే భావమును స్ఫురింపజేయుచున్నవి. మొదటి హస్తివర్మకుమారు డైన నందివర్మయు వివిధధర్మప్రధానుడైన నంది వర్మయు నొక్కరుగానే నిర్ణయింపవచ్చును. ఇరు వురును హస్తివర్మమహారాజునకు తనయులే! ఈ నంది

అతని పినతండ్రి చండవర్మ సింహాసనము నాక్రమించు కొని పరిపాలించినట్లు ఊహింపవచ్చును. లేదా, స్కందవర్మబాల్యమును అవకాశముగా జూచుకొని, చండవర్మ, అన్నకుమారుని పదచ్యుతుని జేసి, రాజ్య మాక్రమించుకొని యుండును. ఇపుడు కానుకొల్లు, పెదవేగిశాసనపట్టికలలోని వంశక్రమములను రెండిం టిని కలిపి సమన్వయముజేసి, ప్రాకృతశాసనముల దాత లయిన నందివర్మవిజయదేవవర్మలను సంస్కృతశాసన దాతలకు పూర్వులనుగా భావించి యీ క్రిందివిధముగా

వంశక్రమమును నిర్ణయింపవచ్చును. ముం దొకసారి తెలిపినటుల, విజయదేవవర్మ, నందివర్మలలో నంది నందివర్మ ప్రాచీనుడని నిర్ణయించి, వంశక్రమమును విశదీకరింతును. మరియు, వెనుక నా ఆంగ్లగ్రంథము నందు* నిర్ణయించిన వంశక్రమమును కొద్దిగా మార్చ వలసివచ్చెను. ఇపుడు నూతనవిషయములతో సమన్వ యించి యీక్రింది వంశక్రమము చేర్పరిచితిమి. ఇది సరియైనది గావచ్చు నని నా యూహ. ముందుముందు క్రొత్తశాసనములు బయల్పడినచో ఈ వంశక్రమము స్థిరపడవచ్చును; లేదా యింకను మార్పు చేయబడ వచ్చును. ఈ కానుకొల్లుశాసనము ప్రస్తుతపు మార్పు నకు కారణ మయినది.

మొదటి హస్తివర్మ తన కుమారునికి నందివర్మయని పేరు పెట్టుటచేత అతని తండ్రి కానుకొల్లు ప్రాకృత శాసనదాతయైన నందివర్మను మొదటి నందివర్మను జేసి, అతనికి మొదటిహస్తివర్మను కుమారునిగా నూహించితిమి. నందివర్మ, విజయదేవవర్మలు ఇద్దరును తమతమ తండ్రుల పేర్లను తెలుపనందున వారిరువురిని సోదరులనుగా నూహిం చితిమి. వారిద్దరు సన్నిహితకాలమువా రగుటకూడ ఆ యూహకు తోడ్పడియెను. కాని వారిద్దరును తండ్రియు, కుమారులును కూడ గావచ్చును. ఈ రెండు ఊహల కును ఆధారము లేదు. సనుంజసముగా నుండునని వారి నిద్దరిని అన్నదమ్ములను జేసితిమి.

శాలంకాయనలను గురించి పాణినీయవ్యాకరణము

(శాలంకాయనవంశము)

అసలు పేరు తెలియని
౧. బప్ప భట్టారకుడు.

- ౨. నందివర్మ క్రీ. శ. ౨౭౦ - ౩౦౦ (కానుకొల్లు ప్రాకృతశాసనదాత)
  - శాలక మహారాజ కుమార ఖందపోత
  - ౪. మొదటి హస్తివర్మ. క్రీ. శ. ౩౩౦-౩౫౦ (సముద్రగుప్తుని సమకాలీనుడు; ఓడించినవాడు)
    - ౫. రెండవ నందివర్మ ౩౫౦-౩౮౦
      - ౬. రెండవహస్తివర్మ
        - ౮. స్కందవర్మ, లేక విజయస్కందవర్మ క్రీ. శ. ౩౯౦ - ౩౯౫
      - ౭. చండవర్మ క్రీ. శ. ౩౯౫ - ౪౦౫
        - ౯. విజయనందివర్మ లేక మూడవనందివర్మ క్రీ. శ. ౪౦౫—౪౨౦
        - మిగిలిన కుమా ర్లు
- ౩. విజయదేవవర్మ ౩౦౦-౩౨౫ (ఏలూరు ప్రాకృతశాసనదాత. అశ్వమేధయాజి.)

నందు గణపాఠములోనున్నది. శాలంకాయనులది గణ రాజ్యము. అనగా రిపబ్లిక్. పాణినివ్యాకరణముపై మహా భాష్యమునందు పతంజలి (V.I.58) "త్రికాః శాలంకా యనాః" అని వివరించియున్నాడు. పతంజలియుక్తి

* "*A History of the Early Dynasties of Andhradesa, Circa* 200-625 *A. D.*" (1942) పుట 356.

ప్రాయము శాలంకాయన గణరాజ్యమునందు మూడు శాలంకాయన చిన్న రాష్ట్రము లున్నవని గావచ్చును. 'కాశిక' యందు శాలంకాయనులు వాహీక దేశమందు నివసించియుండిరని యున్నది. వాహీక దేశ మనగా సింధునదియును, దాని యుపనదులు ఐదును ప్రవహించు పంజాబు రాష్ట్రము అని నిర్వచనము చేయదగును. ఉత్తర సింధు దేశముగూడ వాహీక దేశములో చేరినదే! శాలంకాయనుల గణరాజ్యము క్రీ. పూ. ౨౦౦ నాడు మంచి స్థితియం దుండెను. అది యెప్పుడు నశించిపోయెనో తెలియదు. శాలంకాయనుల గణరాజ్యము క్షీణించిన తరువాత నొకవంశము ఆంధ్ర దేశమునకు వలసవచ్చియుండును. శాలంకాయనులు శస్త్రోపజీవులయిన గణరాజ్యమువారు. వారు బ్రాహ్మణులు. శలంకు మహర్షి సంతతివారు.

శాసనమునందు తెలుపబడిన స్థలములు కొన్నింటిని గుర్తింపవచ్చును. వేంగిపురము ఎల్లరకును తెలిసినదిగావున వివరింపబనిలేదు. ఒకనాడు పెదవేగి, చినవేగి, దెందులూరు ప్రాంతమంతయు ప్రాచీన వేంగీ మహానగరముగా నుండెను. ఆ యూళ్లన్నియు నలభయి, యేభయి అడుగుల లోతు గల పాటిమట్టితో నిండియున్నవి. తరచుగా అక్కడ ప్రాచీన నాణెములు దొరకుచున్నవి. వాటిని మద్రాసునకు కొనివచ్చి, రహస్యముగా ఒకరిద్దరికిమాత్రము విక్రయించుటయు, ఆరీతిగా ధనార్జన చేయుటయు గుప్తముగా జరుగుచున్నది. అట్టి నాణెములు తెనుగువారి కంట బడకుండ దేశదేశాంతరములు గూడ దాటిపోవుచున్నవి. చండవర్మరాగినాణె మొకటి యిట్లో తప్పి జారి, బయట పడినది. నాణెములు దొరకినపుడు వాటిని పాడుచేయక కరగించి చెంబులు పోతపోయించుకొనక, ఇతరులకు రహస్యముగా బంగారముక్రింద విక్రయించక, తెలిసినవారికి చూపినచో ఎంతో చరిత్ర బయటపడగలదు. దత్తగ్రామము 'కొమ్ప్రెర', రథకారచారు వైద్యకు ఈయబడినది, నేడు కానరాదు. చేచిరాకయి యుండవచ్చును. కాదేని, కానుకొల్లుకు సుమారు పది మైళ్ల దూరమున తూర్పుగ నున్న కోమర్రు గ్రామమని నిరూపించవచ్చును. కోమర్రు చాలాపాడుగల ప్రాత గ్రామము. అది గుడివాడ తాలూకాలో పెద్దపేటికి సమీపముగనే యున్నది. 'రసకర'మని యింకొక గ్రామముకూడ నుండినట్లు శాసనమువలన దెలియుచున్నది. 'రథకరము' ఒక పేరు గావచ్చును, కాకపోవచ్చును. 'రసకరము' ఒక చిన్న గ్రామమునకు మారు పేరేమో తెలియదు. కొమ్ప్రెర కుద్రహారవిషయములోనిదని శాసనము తెలుపుచున్నది. ఈ కుద్రహారవిషయమును . పూర్వపు శాసనపరిష్కర్తలెవ్వరును సరిగా గుర్తించినట్లు అగపడదు. విజయనందివర్మ కొల్లేటిశాసనమును ప్రకటించిన డాక్టరు బర్నెల్ గారును,1 వారి పాఠమునే అంగీకరించిన డాక్టరు ఫ్లీటుగారును2 ఆ పేరును 'కుడుహార' మని చదివిరి. కాని సంశయముతోనే అట్లు చదివిరి. 'కుడుహార' 'కుదూహార' అని చదువులు చేసి, దానిని దేనికి ముడిపెట్టగలరో వారికి సాధ్యము కాకపోయెను. అస్పష్టతలో బడి, అదే ఇది యని నిర్ధారణ చేయలేకపోయిరి. విజయనందివర్మ కొల్లేటితామ్రశాసనమును డాక్టరు హుల్ష్ గారు ఒకానొక సందర్భమున పరిశీలించుట తటస్థించెను. అపు డాయన 'కుద్రహార' మని యా యక్షరములను సరిగా జదివెను.3 మన శాసనమందుకూడ నా పేరు 'కుద్రహార' మని యున్నది గాని 'కుడుహార' మనిలేదు. ఇప్పటివరకు 'కుద్రహార'మును 'కుడుహార'మని చదివినవా రందరును, ఆ పేరు బందరుకు సమీపములో నున్న 'గూడూరే కుదూహార, కుడుహార, కుడుహార' మని నిర్ణయించిరి. శబ్దసాదృశ్యమును బట్టి అదే ఇది అని నిశ్చయించినారే గాని ఆ పండితులు మిగిలిన విచారణ యేమియు చేయలేదు. బందరుకు గూడూరు సమీపముగా నుండుట, బందరు, అనగా మచిలీపట్నము చాల ప్రాచీనమైన పట్టణమగుటయు వారి యూహలను బలపరచియుండెను.

1. *South Indian Palaeography*, V. 135

2 ఇండియన్ అంటిక్వెరీ. సం. ౫. పుట ౯.

3. ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౯. పుట ౫౮. మరియు అదే సం. ౬. పుట ౩౧౬ నోటు ౪.

గూడూరు ప్రాచీనగ్రామమయిన కావచ్చును. అక్కడ ఆర్కియొలాజికలు శాఖవారు సంగ్రహించిన శాసనములు అనేకము లున్నవి. వాటియందా యూరిపేరు 'గుండూరు' అని యున్నది. రెండు మూడు శతాబ్దముల క్రిందటివఱకు గుండూరు అనియే ఆ యూరు వ్యవహరింపబడెను. ఇటీవలనే గుండూరు గూడూరని మారెను. కావున 'కుద్రహార'ము గూడూరు కాజాలదు. 'కుద్రహార'మునందు రెండుమాటలున్నవి- కుద్ర+హార అని. 'కుద్ర' అనునది అసలు పేరు— 'హార' అనుమాటకు విషయము అని అర్థము. విషయము అనగా నేటి 'తాలూకా, జిల్లా' అను అర్థమునకు సరిపోవును. ప్రాకృతభాషాయుగము దాటిన తరువాత 'కుద్రహార'ము ఒక్కటేమాట అయిపోయెను. 'కుద్రహారవిషయ' మని తరువాత వారు 'విషయ' పదమును కూడ దానికి జేర్చిరి. 'కుద్రహార'ము కొన్ని వందలయేండ్లు గతించువాటికి 'గుద్రహార' మయ్యెను. గుద్రహారము క్రమముగా ప్రాకృతమునుండి 'గుడివాడ' అని తెనుగురూపమును దాల్చెను. శాతవాహనులనాటినుండియో, అంతకింకను పూర్వమునుండియో గుడివాడ ఆ ప్రాంతమున ప్రసిద్ధమయిన మహానగరముగా నుండెను. ఆనాడు ఆ నగరము 'కుద్ర' మని పిలువబడుచుండెను. అది ఆవిషయమునకు ముఖ్యపట్టణము. దానినిబట్టి ఆవిషయమునకు 'కుద్రహార' మని పేరు వచ్చెను. ఆయూరిలో పెద్ద బౌద్ధస్తూప మొకటి యుండెను. దానిని ఆ కాలపు పి. డబ్ల్యు. డి. డిపార్టుమెంటుతాలూకు ఇంజనీర్లు ౧౮౭౦ లో నాశనము చేసి చలువరాళ్లను అన్నింటిని కాల్చి సున్నము చేసిరి. చివరకు దిబ్బనుకూడ నేలమట్టము చేసిరి. అందు నాలుగు మంజూషలు దొరికెను. దిబ్బ 'అండ' మందురు బౌద్ధపరిభాషలో. దిబ్బచుట్టు ఉండిన వేదికకూడ కానరాదు నేడు.

ప్రాతయూరికి పశ్చిమ దిశయందు జైనవిగ్రహ మొకటి దొరికెను. అది చాలకాలము భీమేశ్వరాలయమందుండెను. దానిని జైను లాయూరిలో నొక పెద్ద జినమందిరమును నిర్మించి దానిని అందుంచి మారువాడీ జైనులు పూజాదులు జరుపుచున్నారు. భీమేశ్వరాలయమునకు ఇంకను పశ్చిమదిశగా, పూర్వము కోటయుండెను. ఆ కోటదిబ్బమీద నున్నది రహదారీ బంగళా. అక్కడ అప్పుడప్పుడు ప్రాచీననాణెములు దొరకుచుండును. ఆ కోటభాగమును నాశనము చేసి రైలుమార్గము వేసి, రైలుస్టేషను కట్టినారు.* భీమేశ్వరాలయమునందున్న మహాదేవునకు పూర్వపు పేరు కుంభేశ్వరుడు. నిజానికి కాదేవాలయము కుంభేశ్వరాలయము. గుడివాడ బౌద్ధవాడలో ప్రాచీనాంధ్ర నాణెములు, లోహపు పూసలు, గాజుపూసలు, రాతిపూసలు—మంచి పనివానితనము చూపునట్టి చక్కని అందమైన పూసలు,—పూర్వకాలపు మట్టి కుండలు మొదలయిన వస్తువు లెన్నో లభించెను. 'కుద్రహార' మను పేరు ఈ క్రింది పట్టికలోని తామ్రశాసనములందు కానవచ్చుచున్నది.

౧. మొదటిజయసింహవల్లభుని పెణుకపఱ్ఱు, లేక పెద్దమద్దాలి శాసనము. ఏడవశతాబ్దము నాటిది. (ఇండియను ఆంటిక్వెరి, సం. ౧౩, పుటలు ౧౭-౫౮ పంక్తులు.)

౨. రెండవ విష్ణువర్ధనుని మట్టెవాడశాసనము. ఏడవశతాబ్దము నాటిది. (ఇం. ఆం. సం ౭ పుట ౧౯౧.)

౩. మూడవవిష్ణువర్ధనుని రెండుపల్లి శాసనము. (ప్రకటితముకాలేదు. ఇది మద్రాసు మ్యూజియములో నున్నది. గుంటూరుజిల్లా, తాలూకా పెదవలి గ్రామములో దొరికెను.)

౪. మూడవవిజయాదిత్యుని బందరుశాసనము. తొమ్మిదవశతాబ్దము నాటిది. (ఎపి. ఇండికా. సం. ౫, పుటలు ౧౨౨, పం, ౧౬.)

౫. రెండవచాళుక్యభీముని బందరు శాసనము. పదియవశతాబ్దము నాటిది (ఎపి. ఇం. సం. ౫. పుట ౧౩౪. పంక్తి ౨౯.)

౬. రెండవఅమ్మరాజు బందరుశాసనము. పదియవశతాబ్దము నాటిది. (ఎపి. ఇం. సం. ౫, పుట ౧౩౯, పం. ౨౨)

* గుడివాడనుగురించి ఇండియను ఆంటిక్వెరి సం. ౧, పుటలు ౧౫౨, ౩౪౬; ఇం. ఆ. సం. ౬ పుటలు ౨౭౬; అదే సం ౯. పుట ౬౧. చూడుడు.

వీటిలో ఐదవదానియందు తెలుపబడిన అకులమన్నాడు గ్రామముతప్ప, మిగిలిన ఐదింటియందును ఉదాహరింపబడిన గ్రామములు గుద్రహారవిషయ మనబడు గుడివాడతాలూకాలోని గ్రామములయి యున్నవి. పదిశతాబ్దములక్రిందట అకులమన్నాడు కూడ గుద్రహారవిషయములో చేరియుండెను. ఈ శాసనములు గాక, కుందేశ్వరాలయములోని ౧౨, ౧౩, ౧౪, ౧౫ శతాబ్దములనాటి శిలాశాసనములందు 'గుద్రహార'మని 'గుద్రవార'మని, 'గుద్రార'మని, చివరకు 'గుడివాడ'యని యీ యూరిపేరు గానవచ్చుచున్నది.[1] కావున పైన సూచించినట్లు ప్రాకృతనామము 'కుద్రహార'ము; దానికి సంస్కృతము 'గుద్రహార'ము. అది ఆంధ్రమున 'గుడివాడ' అయినది.

కుద్రహారము, 'కుదూహార'మును రెండును వేర్వేరు నగరము లని పైన వ్రాసినదానిని బట్టి గ్రహింపవీలగుచున్నది. కుదూహార, కూదూర, కూదూరపుర అను పేర్లతో బరగుచుండిన నగరము బృహత్పలాయనరాజవంశమునకు రాజధాని యని తెలియుచున్నది.[2] కూదూరము కూడ బందరుదగ్గర నున్న 'గూడూరు' కాజాలదు. అదే ఇది యని అనుకొనుట పొరబాటు. కూడూర, కూడూరపురము ఎక్కడనున్నదో విచారింతము.

యూరోపియను విద్వాంసులకు మచిలీపట్టణము సుపరిచితము. మచిలీపట్నము 'మయిసోల' అను నది యొడ్డున ఉన్నకారణమున దాని కాపేరు వచ్చెనని వారి యూహ. కాని నిజమునకు గ్రీకు నావికులు, చరిత్రకారులు ఉదాహరించిన 'మయిసోలసు' నది యొడ్డున లేదు మచిలీపట్నము. మయిసోలసు కృష్ణానదికి గ్రీకులు వాడిన పేరు. ఒకనాడు, అనగా క్రీస్తుశకారంభకాలమునాడు, మయిసోలసు బందరుకోట వద్ద సముద్రములో గలియుచుండెనేమో తెలియదు. ఏది ఎట్లున్నను, 'మయిసోలసు'కు, 'కుదూర'కు ఎట్టి సంబంధముకూడ యూరపియను పండితు లనుకొనినట్లు కానరాదు. ఆవిషయముటుంచి, గ్రీకు నావికుడు టోలమీ వ్రాసినదానిని పరిశీలింతము. టోలమీ ఇట్లు వ్రాసెను: "మయిసోలసు నదీముఖద్వారము—అక్కడ కొంటకొస్సయిల—కొడ్డూర—అల్లొసిగ్నె - అక్కడ నుండి క్రిసెఅను సువర్ణద్వీపమునకు ఓడలు బయలు దేరును." కుద్రహారము 'కూదూర', లేక 'కూహూర' కాదనియు, టోలమీ యుదాహరించిన 'కొడ్డూర'ము గుద్రహారముగాని, కుద్రహారము గాని, చివరకు బందరు దగ్గర నున్న గూడూరు గాని కాజాలదనియు, కూదూరను గూడూరుతో ముడిపెట్టి, అదే ఇది యనుట అసంబద్ధ మనియు మొదటినుండి ఫరాసుపండితుడు డా. జావెడు బ్రొయిలు వాదించుచున్నాడు. కొడ్డూర కుద్రహారము గాజాలదు- గూడూరును కాజాలదని అతని వాదము. అది యథార్థమైనది. బృహత్పలాయనజయవర్మ కొండముది శాసనము 'కుదూర' నుండి ఆజ్ఞాపింపబడెను. దత్తగ్రామము కుదూరహారములోనిది. కావున టోలమీ ఉదాహరించిన 'కొడ్డూర'మే బృహత్పలాయనరాజధాని 'కుదూర'ము కావలయును. దివితాలూకాలో కృష్ణా నదీసాగరసంగమమునకు సమీపమున ఒక ప్రాచీనమైన కోడూరుగ్రామ మున్నది. అక్కడనే శ్రీయజ్ఞశాతకర్ణి శిలాశాసనశకలము దొరికెనట! ఆ కోడూరు ఒకనాడు కృష్ణానదియొడ్డున నుండి ప్రసిద్ధకరపట్టణముగా నుండెను. అదియే టోలమీ చూచిన 'కొడ్డూర' కావలయును. అక్కడనుండి పడవమీద జనులు పూర్వము కంటకశైల మనబడి పేరుండిన ఘంటసాలకు పోవుచుండిరి. ఘంటసాల నేడు కృష్ణానది యొడ్డున లేదు. కృష్ణానది మాయలేడివలె, ఈ రెండువేల యేండ్లలో తన ప్రవాహమును ఎన్నెన్ని విధములుగ మార్చియుండెనో, ఎన్నెన్ని మహానగరములను కుక్షింబైచెనో చెప్పజాలము. ఒకనాడుండిన చోట లేదు నేడు శ్రీకాకులము. శాతవాహనులనాటి శ్రీకాకులము కృష్ణవేణమ్మ తన కడుపులో జీర్ణము చేసికొనెను. పూర్వము మొవ్వసమీపమున సముద్రగామియైన కృష్ణ పదిమైళ్లు పడమటకు జరిగెను.

---

1. *South Indian Inscriptions.* సం. ౫ పం. ౨౧౧–౨౨౦.

2. కొండముది తామ్రశాసనము, ఎపి. ఇం. సం ౬.

ఘంటసాలమాట చెప్పనక్కరలేదు. ఘంటసాల—కొంటకొస్సైల—కంటకసేల, నాగార్జున కొండ దక్షిణగా వచ్చిన ఉపాసిక బోధిసిరిశాసనమందు పేర్కొనబడెను. అచ్చట పూర్వ మొకవాడు—రెండు వేలయేండ్లనాడు మహాచైత్య మొకటి యుండెను. వీటినన్నింటిని టోలమీ క్రీ. శ. ౬౦-౮౦ సంవత్సరముల మధ్య నెపుడో వచ్చి సందర్శించిపోయెను. కావున కూడూరు కూమార కాదు. కుద్రహారము వేఱు; కూడురు, లేక కోడూరు వేఱు. రెండింటికిని నడుమ కృష్ణానది పాయలయి ప్రవహించుచుండెను.

దానప్రతిగృహీత పేరు తెలియదు. అతని పేరు శాసనమందు తెలుపబడలేదు. ఊరక చాతుర్వైద్య—చతుర్వేది అని పేర్కొనబడినాడు. నందివర్మ ప్రాకృత శాసన పరిగృహీతయగు రథకారచాతువెజ్జకును, ఈ శాసనపరిగృహీత రథకారచాతుర్వైద్యకును ఎట్టి సంబంధ ముండెనో తెలుపు సాధనము లేవియు గాన రావు. మొదటి పరిగృహీత వంశజుడు కాదగును రెండవపరిగృహీత అని మాత్ర మూహింపవచ్చును, ఉభయులును రథకారకులజా లగుటయు, ఉభయులును చతుర్వేదు లగుటయు, ఈ రెండుశాసనములు ఒక చోట లభించుటయు ఈ యూహకు బల మొసగు చున్నవి. లిపిపరిణామశాస్త్రదృష్టితో పరికించినపుడు ప్రాకృతశాసనమునకు, ఈ శాసనమునకు నడుమ ఒక శతాబ్దమువఱకు ఉండవచ్చునని యూహింపవచ్చును. ఆ కాలమున చతుర్వేదోపాధ్యాయులయిన రథకారకుల మొకటి ఆంధ్రదేశమున వర్ధిల్లియుండెననుటకు ఈ శాసనములు రెండును ప్రమాణములు.

## ఆంధ్రానువాదము

స్వస్తి. అనేకసమరముఖములందు విఖ్యాతములయిన వీరకృత్యములు నెఱపిన మహారాజశ్రీ హస్తివర్మకు ప్రపౌత్రుడును, తన ప్రతాపాతిశయముచేత శత్రువుల కవచములను భేదించిన (అనగా అనేకమంది శత్రువులను సంహరించిన) శ్రీనందివర్మమహారాజునకు పౌత్రుడును, నాలుగు సముద్రముల తరంగములచేత ఆలింగనము చేసికొనబడి వ్యాప్తమయిన యశము గల (రెండవ) హస్తివర్మమహారాజునకు పుత్రుడును, చిత్రరథస్వామి పాదములను ధ్యానముచేయువాడును బప్పభట్టారకపాదభక్తుడును, శాలంకాయనుడును అను శ్రీస్కందవర్మ మహారాజు కొంప్పెరవాస్తవ్యులయిన గ్రామస్థులకు ఈ విధముగా తెలుపవలసినదనుచున్నాడు. "ఇట్లు గాక! మా కులము, యశము, సిరి, విజయకల్యాణము అభివృద్ధి నొందుటకొఱకు ఆ గ్రామమును (కొంప్పెరగ్రామమును) రథకారవాస్తవ్యుడు చతుర్వేది సర్వపరిహారములతోడను, అనగా ఎట్టి పన్నుల బాధ్యతలు లేకుండ చేసి బ్రహ్మదేయముగా విడదీసి ఒసగినారము. ఈ వృత్తాంతమును తెలుసుకొని పూర్వమర్యాద ననుసరించి, ప్రతిగృహీతను ప్రేమతో ఆదరించెదరు గాక! మరియు, అన్ని నియోగములవారును, నియుక్తకులు, ఆయుక్తకులు (అనగా రాజకీయోద్యోగులు అందరును) ఆ గ్రామమును తమ అధికారములోనుండి తీసివేయుదురుగాక. ఈ పట్టిక ప్రవర్ధమాన విజయ రాజ్యసంవత్సరము ఒకటవయేడు, కార్తీకశుక్ల పాడ్యమినాడు ఒసగబడినది." అనేకమంది భూవాసులు అనేకవిధములుగా భూమిని దాన మిచ్చిరి. ఎవ రేరీతిగా దాన మిచ్చిరో వా రా రీతిగా అంతంత పుణ్యమును అనుభవించుచున్నారు.

# శాసనము

## మూలము [1]

### మొదటి రేకు — రెండవ ప్రక్క



౧. స్వస్తి [1*] విజయవేఙ్గ్యా [1*] అనేక సమరముఖ విఖ్యాతకర్మ (మా)ణః
౨. మహారాజ శ్రీ హస్తివర్మ్మణః ప్రపౌత్రస్య
3. స్వప్రతాపాపా [2] సీతాహితవర్మ్మణః మహారాజశ్రీ నన్దివ—
౪. ర్మ్మణః పౌత్రస్య చతురుదధితరఙ్గాలిఙ్గిత

### రెండవ రేకు — మొదటి ప్రక్క



౫. యశసో మహారాజశ్రీ హస్తివర్మ్మణః పుత్రస్య
౬. భగవచ్చిత్రరథస్వామిపాదానుధ్యాతస్య
౭. బప్పభట్టారకపాదభక్తస్య శాలఙ్కాయనస్య
౮. మహారాజశ్రీ స్కన్దవర్మ్మణో వచనేన కుద్రహారే

---

1. వాకడ నున్న రేకులమీద నున్న పాఠము.

2. మొదట లేఖరి 'పా' వ్రాసి దానిని 'పా' క్రింద దిద్దుటకు ప్రయత్నించెను. తరువాత మరల 'పా' వ్రాసి దానిని 'ప' క్రింద సవరించెను.

"స్వప్రతాపాపనీ" అని చదువుదు.

రెండవ రేకు — రెండవ ప్రక్క



౯. కొమ్బర గ్రామేయకా వక్తవ్యా । అస్తి అస్మాభి రస్మ
౧౦. త్కుల యశ శ్రీ (విజ) య కల్యాణాభివృద్ధయే
౧౧. ఏష గ్రామః రథకారవ(వా)స్తవ్యాయ చాతుర్వైద్యాయ

మూడవ రేకు — మొదటి ప్రక్క



౧౨. సర్వ్వ పరిహారేణ బ్రహ్మదేయం కృత్వా దత్తః
౧౩. తదవగమ్య పూర్వ్వమర్యాదయా సాధు ప్రేష
౧౪. ణం కర్త్తవ్యమపిచ సర్వ్వనియోగ నియుక్తాయుక్తకాశ్చ

మూడవ రేకు—రెండవ ప్రక్క



౧౫. తం గ్రామం పరిహరన్తు [।*] ప్రవర్ద్ధమాన శ్రీవిజయ

౧౬. రాజ్యసంవత్సరే ప్రథమే కార్త్తికమాస

౧౭. శుక్లః త్రః తిపది దత్తా పట్టికా [।*]

నాల్గవ రేకు—మొదటి ప్రక్క



౧౮. బహుభి బ్బహుధాదత్తా వసుధా వసుధాధిపైః

౧౯. యస్య యస్య యదా భూమిః తస్య తస్య తదా ఫలమ్.

# మాయావాదము

●

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౪

విచిత్రమగు నీ ప్రపంచమును జ్ఞానమెల్లపుడును ప్రకాశింపజేయుచున్నది. జ్ఞానమే జడమునకు, అనగా ప్రపంచమునకు ఆధారము. జ్ఞానముచేతనే జడము తెలియబడుచున్నది. జడమనునది యెల్లయు జ్ఞేయమే. మరియు ప్రకాశ్యమే. ప్రకాశ్యమయిన దానికంటె, జ్ఞేయమయినదానికంటె ప్రకాశము, లేక జ్ఞేయము విలక్షణము. కావున జ్ఞేయమయిన యీ సమస్తప్రపంచముకంటె దీనిని తెలిసికొను జ్ఞానమెంతయో విలక్షణమయిన దని అందరకును తెలియును.

ఈ జ్ఞానమే సకలప్రపంచమున కేకమాత్రాశ్రయము. దీని ఆశ్రయము లేనిచో ఏవిషయమును ఎరుకపడదు. ఈ జ్ఞానమే ఏకమాత్రమగు సత్పదార్థము. దీని ఆద్యంతము లెవరికిని ఎరుకపడవు. దీని యాద్యంతము లెరుకపడదగినవేని ఆ యెరుకకు వేరొక యెరుకను ఆశ్రయింపవలసి వచ్చును. కావున దానికి ఆద్యంతము లుండవు. 'జ్ఞానమున్నదా లేదా?' అని ఎవరును సందియంపడరు. ఏల? తామే అది. జ్ఞానము స్వయంప్రకాశము. స్వయంప్రకాశమగు ఆ జ్ఞానము సూర్యునివలె తాను ప్రకాశించుచు జగత్తునంతయు ప్రకాశింపజేయుచున్నది.

సూర్యుని మేఘమావరించినటులు జ్ఞానమును అజ్ఞానమావరించును. ఇటు లజ్ఞానముచే ఆవరింపబడియు జ్ఞానము తాను ప్రకాశించుచు అజ్ఞానమునుగూడ ప్రకాశింపజేయుచుండును. సూర్యుడు మబ్బుచే ఆవరింపబడియు తాను ప్రకాశింపక మానడు. మబ్బునుగూడ ప్రకాశింపజేక మానడును కదా. అడ్డమయిన వాని నన్నింటిని ప్రకాశింపజేయుచుండుట ప్రకాశశీలములగు వస్తువుల స్వభావము.

ఇట్టి జ్ఞానమును సంపూర్ణముగా నెరుగుటకు దాని కావరకమగు అజ్ఞానమునుండి పరిత్రాణము పడయవలయును. శక్తిస్వరూపము తెలియుచో తద్గోచరమగు నజ్ఞానము విలుప్తమగును. దానితో పాటు అయ్యజ్ఞానకార్యమగు వెండియు లోపము పడయును. ఇటులే జ్ఞానస్వభావమగు ఆత్మని స్వస్వరూప మనుభూతమాయెనేని ఆత్మ కావరకమగు నవిద్యయు ఆత్మయందే విలీనమై పోవును. ఆ యవిద్యావిలయముతో పాటు తత్కల్పితమగు నీ సంసారమంతయు లోపము పడయును.

జీవు డజ్ఞానగ్రస్తుడు. జీవునకు గల జ్ఞానము ఖండజ్ఞానము. ఇది భేదము కలిగించును. తెలిసికొనువాడు, తెలిసికొనబడునది, తెలివి అను మూడువస్తువులు వేరు వేరు అనుభవము భేదజ్ఞానము. నీ వొక గుఱ్ఱమును చూచితి వని అనుకొనుము. అపు డీ మూడువిధములగు అనుభవములును

కలుగును. ఇచట చూచువాడు తెలిసికొను వాడు. గుఱ్ఱము తెలిసికొనబడునది. గుఱ్ఱము నెరుక తెలివి. ఇదియే భేదజ్ఞానము.

భేదజ్ఞానమే దుఃఖముల కన్నిటికిని మూలము. దుఃఖ మనుభవించునపుడు భేదజ్ఞాన ముండును. 'నేను దుఃఖ మనుభవించుచున్నాను'. అను జ్ఞానమే దుఃఖభోగము. దీని మూడు వస్తువులు విడివిడిగా కాన వచ్చును. ఒకటి జ్ఞానము. రెండు జ్ఞేయము. మూడు జ్ఞాత. ఇచట జ్ఞానమనగా దుఃఖానుభూతి. జ్ఞేయ మనగా దుఃఖము. జ్ఞాత అనగా నేను. ఈ మూడును దుఃఖభోగము నకు, లేక దుఃఖజ్ఞానమునకు విషయములు. దుఃఖానుభవమునకు సరిగా వెనుకగూడ ఈమూడు వస్తువులును విడివిడిగా తెలియు చునేయుండును.

దుఃఖమునకు కారణ మేమి? ఇష్టమగు వస్తువు దొరకలే దను నెరుకయు, అనిష్టమగు వస్తువు వచ్చిపడె నను నెరుకయు దుఃఖము నకు కారణము. సుఖదుఃఖములు రెండును సర్వానుభవసిద్ధములు! ఇందు సుఖము ప్రవర్తకము; దుఃఖము నివర్తకము. ఈగ కడనుండి ఏనుగువరకును గల జీవజాల మంతయు సుఖము పొందవలయు నను ఆశతో పాటుపడుచుండును. దుఃఖమునుండి తొలగవలయు నను పూనికతో దుఃఖము నకు దూరముగ నుండును. సుఖము కలుగు నని తోచకపోవుచోగాని, దుఃఖము దూరీకృత మగునని తోచకపోవుచోగాని యెవ డును ఏపనినేని యిచ్ఛాపూర్వకముగా చేయడు. ఇష్టవస్తువు పోయినపుడుగాని, పోవు నని తోచినపుడుగాని దుఃఖము కలుగును. అటులే అనిష్టము కలిగినపుడుగాని, కలుగగల దని తోచినపుడుగాని దుఃఖము కలుగును. కావున దుఃఖము కలుగుటకు కారణము భేదజ్ఞానమే యని తేలును. నేను, నా జ్ఞానము, నా యిష్టానిష్టములు - అను నీ మూడు వస్తువులయు జ్ఞానము అన్ని తెరగులయు దుఃఖభోగమునకు పూర్వమునందుండనే యుండును.

ఇంకొకటి—గాఢనిద్రలో ఈ జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లుండవు. మరియు నెట్టి దుఃఖా నుభూతియు నుండదు. ఆ గాఢనిద్ర భగ్న మయిపోయినతరువాత మరల నీ భేదజ్ఞానము జీవుని పెనవైచుకొనును. దానికి ఫలముగా మరల దుఃఖ మనుభవించుట జీవుని వంతు. కావున భేదజ్ఞానము పోవునేని దుఃఖము పోవు ననియు, భేదజ్ఞానము కలిగినంతనే దుఃఖము కలుగు ననియు నిరూపిత మగుచున్నది. కావున అన్ని తెరగులయు దుఃఖములు లేకుండ జేసికొనవలయునేని భేదజ్ఞానము లేకుండ జేసికొనవలయు నని తేలుచున్నది.

ఈ భేదబుద్ధి యెటులు పోవును? అభేద జ్ఞానమువలననే, అద్వైతజ్ఞానమువలననే యిది పోవును. జ్ఞాతృజ్ఞానజ్ఞేయము లను ఈ మూడు వస్తువులలో నిక్కమున కెట్టి భేదమును లేదు. అఖండప్రకాశమగు నాత్మయే అజ్ఞానముచే ఆవరింపబడి అజ్ఞానమునందు గల విక్షేప శక్తిచే మూడుగా తునిసి జ్ఞాత యనియు, జ్ఞేయ మనియు, జ్ఞానమనియు మూడు తెర గుల ప్రకాశము వడయుచున్నది. ఆలి చిప్పను అజ్ఞాన మావరించి వెండినిగా గోచ రింపజేయగలదే కాని ఆ యాలిచిప్ప వెండి

కానేకాదుగదా! అటులే అజ్ఞానము ఆత్మ నావరించి జ్ఞాతృజ్ఞేయజ్ఞానరూపముగా వేరు పరచి వ్యవహారగోచర మొనరించునేకాని నిక్కమున కాత్మ ఒకటియే. అది అఖండము; అభిన్నము; స్వయంప్రకాశము. ఇట్టి యెరుక హృదయమునందు దృఢముగా నాటుకొనినకొలది భేదబుద్ధి క్రమక్రమముగా సడలదొడగును. ఆ భేదబుద్ధి పూర్తిగా తొలగిన పిదప నిక దుఃఖమునకు వేళ్లు పుట్టవు. భేదజ్ఞానముగాని, దానిపై ప్రమాణబుద్ధిగాని దుఃఖమునకు కారణమని తెలిసి దానిని పోగొట్టుకొనినయెడల నడుమనడుమ నొకవేళ భేదబుద్ధి కలుగుచున్నను దుఃఖ మంతగా కలుగదు. ఈ శరీర మున్నంతవరకును ఈ భేదజ్ఞానము ఊచముట్టు నశించిపోవకున్నను ఈ భేదజ్ఞానమునే నమ్మికొనియుండక పోవచ్చును. మరియు దానియెడ ప్రమాణబుద్ధిని సడలింపజేసికొనవచ్చును. ఈ రెండును అసంభవములు కావు. భేదబుద్ధిని విలయము పొందించినవారే అన్నితెరగుల దుఃఖముల నుండియు విముక్తి పొందుదురు. వారే ముక్తులు. ఇట్టి ముక్తు లపుడపు డీభరతఖండము నలంకరించి దీనిని పుణ్యభూమిగా జేసిరి. వారే యీ ప్రపంచ మంతయు మాయ యని మనకు తెలిపిరి.

కార్యకారణముల తత్త్వమును తెలుపుటకై ప్రపంచమున నెన్నియో ప్రయత్నములు జరిగెనుగాని వానియందే ప్రయత్నమును సఫలము కాలేదు. ఈ కార్యకారణ తత్త్వము తెలిసికొన నయితి కాదని మాయావాదులే తొలుదొలుత ప్రచారము చేసినవారు. 'కార్యకారణతత్త్వమును తెలిసికొనగల' నను నహంకారవృక్షము నుచ్ఛేదించు సత్యకుఠారమును పదనుపెట్టగలుగుటచేతనే మాయావాదు లీజగత్తును 'అనిర్వాచ్యము' 'మాయామయము' అని వక్కాణింప సాహసించిరి.

మాయావాదు లొక క్రొత్త సిద్ధాంతమును స్థాపించి ప్రచారము చేయదొడగలేదు. వారి యుద్దేశము స్థాపనము కాదు. వారి యుద్దేశము ఖండనము. జగదుత్పత్తి యెడ నింతవర కెన్ని సిద్ధాంతములు ప్రచారితము లాయెనో ఆ సిద్ధాంతము లన్నియు భ్రమాత్మకము లని యీ మాయావాదము నందలి రహస్యము.

ఉపనిషత్తులు మాయావాదమునకు మూలము. పురాణములం దిది పురాణించెను. బాదరాయణులు దీనిని సూత్రించిరి. శంకరులు వ్యాకరించిరి.

---

## సవరణ

మాయావాదము మొదటివ్యాసములో 'కల' అను శీర్షికలోని 'అలీక' పదములకు బదులు 'ప్రాతిభాసిక'మనియు, 'అలీకము' అను శీర్షికలో గల అలీకపదములకు బదులు 'అలీకము' అను శీర్షికతోపాటు 'మాయ' అనియు మార్చి చదువుకొనవలయును.

వే. శి. శా.

---

# "భగీరథి" స్మృతి

★

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

ఓ సహోదరశిల్పి
ఓ మహోదయమూర్తి
నీహారగిరిపథవి
హారివ! భగీరథి!
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

ఆకొన్న ఎడదతో
నాకొండలని వలచి
తెలిమంచువలిపెముల
తెరల గుసగుసలాడి
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

గండశిలల ఎడంద
కందళించే వలపు
కండగల నీకృతుల
పండించితివ మాకు
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

ఉభయసంధ్యాభర్మ
డోల నూగే ప్రకృతి
బాలనెత్తిన కళా
భాగ్యపితవే నీవు
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

హిమసీతువులు కనుల్
చెమరించు లేమిడులు
ఏమి సేసినవో నీ
వేగితివి మము విడిచి
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

అతడు కాంచనధునిర
పాతలము ప్రాకింప
నిరుపేదరాయి ఎద
నిలిపితివ హిమశిఖరి!
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

..................................

నీహారగిరిశిఖర
నీరాజనము వైతె!
  ఓ సహోదరశిల్పి
  ఓ మహోదయమూర్తి...

# కృష్ణదేవరాయల కళింగజైత్రయాత్ర

## ౧

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

కృష్ణదేవరాయల కళింగజైత్రయాత్రకు ప్రధాన కారణము విజయనగరరాయలకును కళింగగజపతులకును తరతరములుగ పెరిగివచ్చుచుండిన పగ. రెడ్డి రాజ్యము విచ్ఛిన్నమైనప్పటినుండియు తీరాంధ్రదేశము నాక్రమించుకొనుటకొఱకు నా రెండింట్ల రాజులకును స్పర్ధ కలిగినది. క్రీ. శ. ౧౪౦౩ వ సంవత్సరమున కుమారగిరిరెడ్డి దివంగతు డైనపిమ్మట రెడ్డిరాజ్యము రెండు సంస్థానములుగ చీలినది. దక్షిణమున పెద కోమటివేమారెడ్డి కొండవీటినుండి గుంటూరుమండలమును పాలింప నారంభించెను. మధ్యాంధ్రదేశము, అనగా నిప్పటి పశ్చిమగోదావరికృష్ణామండలములుగూడ నితని యేలుబడిక్రింద నుండె ననుట కాధారము గలదు. గోదావరికి బూర్వోత్తరదిగ్భాగమందలి రాష్ట్రము నంతటిని కాటయవేమారెడ్డి రాజమహేంద్రవరము రాజధానిగ పాలించుచుండెను; కాని ఈ రెడ్లకిద్దరికిని పొందు కుదురలేదు. ఒకరి యధికారము నింకొక రొప్పుకొనక వారొండొరులతో పోట్లాడుటకు సంసిద్ధులైరి. తమలోదాము పోటి తగవు తీర్చుకొనియుండిన నన్యుల కందు ప్రవేశము కలుగకయుండెడిది. అట్లుగాక, వారు పరిసరదేశములను పాలించుచుండిన ప్రభువుల సహాయ మపేక్షించిరి. పెదకోమటివేమారెడ్డి బహమనీ సుల్తాను నాశ్రయించెను; కాటయవేమారెడ్డి విజయనగర రాయల సహాయ మపేక్షించెను. యుద్ధము సంప్రాప్తమైనది. ప్రారంభదశయందు పెద కోమటివేమారెడ్డి పక్షమునకే జయము గలిగెను; యుద్ధమున కాటయవేమారెడ్డి నిహతుడాయెను; అతని కుటుంబము శత్రులచే జిక్కినది; కాని విజయనగరబలముల సహాయముచే గాటయవేముని సైన్యాధ్యక్షుడు దొడ్డయఅల్లాడారెడ్డి శత్రులను బరాభూతుల గావించి, కాటయవేముని సంతతిని రాజమహేంద్రరాజ్యమున నెలకొల్పెను.

ఈ యుద్ధమువలన రాజమహేంద్రవరరెడ్లకును విజయనగరరాయలకును గాఢమైత్రి కలిగినది. గోదావరీ తటమున కర్ణాటకులకు పలుకుబడి హెచ్చి వారి ప్రాబల్య మతిశయించినది. ఇది కళింగాధిపతి యగు గజపతినాల్మడిభానుదేవునికి నచ్చలేదు; కావున నతడు గోదావరీతటమునుండి కర్ణాటకులను పాఱదోలి యచ్చట నిజాధికారమును నెలకొల్పు నుద్దేశముతో నెత్తివచ్చెను; కాని సమరము సంఘటిలలేదు. రాజతంత్రమర్మజ్ఞుడగు నల్లాడరెడ్డి మధ్యవర్తియై యిరుపార్శ్వములవారిని సమాధానపఱచి వారిని నిజ రాజ్యములకు మరలిపోవునట్లు చేసెను.

కయ్యము తప్పినను శాంతి కుదురలేదు. అల్లాడ రెడ్డి సమకూర్చిన సమాధానము తాత్కాలికమే. రెండు రాజ్యముల మధ్య గలిగిన ఘర్షణయొక్క కారణము తొలగిపోలేదు. కావున నిరుపార్శ్వములవారును సమయము వేచియుండిరి. క్రీ. శ. ౧౪౨౨ వ సం.న విజయనగరమున మొదటి దేవరాయలు కాలధర్మము నందెను; అతని కుమారుడు రామచంద్రరాయలు వజ్రసింహాసనము నధిష్ఠించి యారుమాసముల కాలము పృథ్వీపాలన మొనర్చెను; తరువాత నతని తమ్ముడు ప్రథమవిజయరాయలు రాజ్యాభిషిక్తుడై ప్రజాపాలన సేయగడగెను; విజయరాయ లశక్తుడగుటవల్ల నేమొ యతని పుత్రు డిమ్మడిదేవరాయలు రాజ్యభారము వహించి దేశపాలనమునం దతనికి తోడ్పడుచుండెను. ఈ సంవత్సరమునందే బహమనీసుల్తాను ఫీరోజుశాహును జంపించి యతని తమ్ము డహమ్మదుశాహు సింహాసనము నాక్రమించుకొని విజయనగరరాయలపై నూడు దీర్చుకొనుటకు రాయసామ్రాజ్యముపై దండువెడలెను. సమయముననె రాజమహేంద్రవరమున నల్లాడ

రెడ్డియు నస్తంగతు డాయెను. తరువాత రాజమహేంద్రవరరాజ్యమున గొంత కలవరము గలిగినది. అల్లాడరెడ్డిపుత్రు లగు వేమవీరభద్రారెడ్లకు దాయాదుల ప్రతిఘటనవలన రాజ్యము వశపడలేదు. మఱియు క్రీ. శ. ౧౪౨౩-౪ సం.న రాచవేమన మరణమువలన కొండవీడురాజ్య మనాయకమైనది. ఇట్లు ఆంధ్రకర్ణాటరాజ్యములందు రాజకీయవాతావరణము మారి స్థితిగతులు నిలుకడ లేకయుండ, నదియె నూతన రాష్ట్రసంపాదన కనుకూలసమయ మని నిశ్చయించి, కళింగదేశాధిపతి నాల్గవభానుదేవుడు దండెత్తివచ్చి రెడ్డిరాజుల యేలుబడిక్రింద నుండిన తీరాంధ్రదేశము నంతటిని జయించి వశపఱచుకొనెను; కాని యతడచట దన యధికారమును స్థిరముగ స్థాపింపజాలక పోయెను. ఏలన ఇమ్మడిదేవరాయలు బహమనీసుల్తాను నోడించి తఱుమగొట్టి తరువాత క్రీ. శ. ౧౪౨౫ వ సంవత్సరమున నల్లాడరెడ్డిపుత్రులను రాజమహేంద్రవరరాజ్యమున పునఃప్రతిష్ఠ సేయుటకొఱకు తీరాంధ్రముపై నెత్తివచ్చెను. భానుదేవుని పరాజితుని గావించి సింహాచలము దాటిపో దఱుమగొట్టెను. కొండవీటిరాజ్యము నాక్రమించి రాయసామ్రాజ్యమున గలుపుకొని రాజమహేంద్రవరమున నల్లయవేమవీరభద్రులను బ్రతిష్ఠించి వారికి మధ్యాంధ్రము నొప్పజెప్పెను.

రాయలకును గజపతులకును నిది ప్రథమసంఘట్టన. మఱి పదునైదేండ్లదాక వారొండొరుల మరల దారసిల్లలేదు. ఈలోపల కళింగమున పూర్వగాంగవంశ మంతరించినది. సూర్యవంశజు లగు నొడ్డెగజపతుల యేలుబడి ప్రారంభమైనది. ఈ వంశస్థాపకుడైన కపిలేశ్వరగజపతి శూరశిఖామణి; అద్వితీయపరాక్రమశాలి. కావున నతడు రాజ్యమునకు వచ్చినపిమ్మట పూర్వము నాల్గవభానుదేవుడు జయించియుండిన తీరాంధ్రదేశమును ఎట్లైన దన యేలుబడిక్రిందికి దెచ్చుకొనవలయు నని నిశ్చయించెను; కాని శత్రుదుర్జయుడైన ఇమ్మడిదేవరాయలు పృథ్వీపరిపాలనము సేయుచున్నంతకాలమును గపిలేశ్వరుని కోరిక నెఱవేఱదాయె. క్రీ. శ. ౧౪౪౨ తుదనో, ౧౪౪౩ ప్రారంభదశయందో విజయనగరమున నొక యుపద్రవము సంభవించినది. ఇమ్మడిదేవరాయల తమ్ముడొకడు రాయలను మంత్రిసామంతదండనాయకాది సకలనియోగివర్గముతో గూడ సంహరించి రాయపదము నాక్రమింపదలపెట్టెను. అతని వంచనకు లోనై రాజధానియం దున్న రాజకీయోద్యోగులందఱు మడిసిరి. రాయలుమాత్రము క్షతశరీరుడైనను ప్రాణమును గోలుపోలేదు. ఈ వార్త తెలియవచ్చినంతటనే కపిలేశ్వరుడు బహమనీసుల్తానుతో నేకీభవించి విజయనగరసామ్రాజ్యముపై దండువెడలెను. బహమనీసుల్తాను కృష్ణాతుంగభద్రల మధ్యదేశమును సాధింప బ్రయత్నము సేయ, గజపతికపిలేశ్వరుడు రాజమహేంద్రవరరెడ్డిరాజ్యముపై గవసెను. కాని వారి కోరిక యీడేరలేదు. లక్కణదండనాయకుడు గొంత సైన్యముతో కృష్ణాతుంగభద్రల యంతర్వేదిని ప్రవేశించి బహమనీసైన్యముల నోడించి పాఱదోలెను. మల్లప్పదండనాయకుడు మఱికొంత సైన్యముతో గూడ బయలువెడలిపోయి కృష్ణాగోదావరుల నడిమి తీరాంధ్రదేశమును జొచ్చి కపిలేశ్వరుని పరాభూతుని గావించి రాజమహేంద్రవరరెడ్డిరాజ్యమును సంరక్షించెను.

తన ప్రథమప్రయత్న మిట్లు భగ్నమైనను కపిలేశ్వరుడు తీరాంధ్రమును జయించు నుద్దేశమును వదలుకొనలేదు. క్రీ. శ. ౧౪౪౬ వ సంవత్సరమున నిమ్మడిదేవరాయలు స్వర్గస్థు డాయెను. అతని తమ్ముడు రెండవ విజయరాయలు సింహాసనము నాక్రమించుకొని దాదాపు రెండేండ్లకాలము ప్రజాపరిపాలన మొనర్చెను; కాని యతని ప్రభుత్వము కాంతముగ సాగలేదు. ఇమ్మడిదేవరాయల పుత్రుడగు మల్లికార్జునరాయలు అతనితో బ్రతిఘటించి క్రీ. శ. ౧౪౪౭-వ సం.న రాజ్యమును స్వాధీనపఱచుకొనెను. మల్లికార్జునరాయలు తరుణవయస్కుడు; అతనికి నిర్వాహకత చాలదు; మఱియు విజయరాయలపక్షమువారు రాయలయెడవిముఖులై యుండిరి; కావున రాయరాజ్యముపై నెత్తిపోవుట కదియను కూలసమయ మని యెంచి కపిలేశ్వరగజపతిబహమనీసుల్తానుతో గూడ నేకమైవచ్చి విజయనగరమునకు ముట్టడివేసెను. ముట్టడి యెట్లు పర్యవసానము నందెనో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. సమకాలికరచనయగు గంగా

చానప్రతాపవిలాసమున మల్లికార్జునరాయలు గిరిగహ్వరమునుండి వెలువడిన సింహశాబకము ఏనుగుఘటలపై బడినట్లు రాజధానినుండి బయలు వెడలి శత్రులను నోడించి చెల్లాచెదరు గావించెనని చెప్పియున్నది; కాని క్రీ. శ. ౧౪౫౭ వ సం. వ్రాయించిన కపిలేశ్వరగజపతియొక్క వెలిగాని తామ్రశాసనమున నతడు విజయనగరమును జయించినట్లు వ్రాసియున్నది. జగన్నాథము కైఫీయతున కపిలేశ్వరుడు విద్యానగరమును క్రీ. శ. ౧౪౪౯-౫౦ వ వర్షమున సాధించెనని యున్నది. క్రీ. శ. ౧౫౦౦ వ సం. నాడు వ్రాయించిన ప్రతాపరుద్రగజపతియొక్క అనంతవరతామ్రశాసనమున కపిలేశ్వరుడు విద్యానగరిమును ముట్టడించి కర్ణాటకభూపాలునికడనుండి మానోన్నతమైన ధనరాశిని కప్పముగ గ్రహించెనని యున్నది. విజయ మెర్పరిదైనను గజపతి కపిలేశ్వరుడు క్రీ. శ. ౧౪౫౭ వ సం. నకు పూర్వము విద్యానగరమును ముట్టడించెనని మనము నిశ్చయముగ జెప్పవచ్చును. ఈ ముట్టడి దైనవెనుక కపిలేశ్వరుడు తీరాంధ్రమును స్వాధీనపఱచుకొనుటకు దండువిడలెను. రాజమహేంద్రవరరెడ్డిరాజ్యము మొదటికడి దైనది. వేమవీరభద్రాదు లేమయిపోయిరో తెలియదు; కాని వారిరేలుబడిక్రింది రాష్ట్రమంతయు క్రీ. శ. ౧౪౫౦-౫౪ ల మధ్య గజపతికి హస్తగత మైనది; తరువాత క్రీ. శ. ౧౪౫౪ వ సం. న కొండవీడు స్వాధీనపడెను; మఱి నాలుగుసంవత్సరములవఱకు విశేషాంశము లెవ్వియు జరుగలేదు; క్రీ. శ. ౧౪౬౦ వ సంవత్సరమున కపిలేశ్వరుడు దేవరకొండ వెలమవారికి తోడుపోయి బహమనీబలముల నోడించి తెలంగాణమునంతటిని వశపఱచుకొనెను. ఆ సంవత్సరముననె పశ్చిమముగ దండును రాయసామ్రాజ్యముమీది కంపెను; కాని దండయాత్ర శ్రీశైలమును దాటిపోలేదు. క్రీ. శ. ౧౪౬౩ వ సంవత్సరమున కపిలేశ్వరుడు తన కుమారుని హంవీరమహాపాత్రుని గొప్ప సైన్యముతోగూడ రాయసామ్రాజ్యమందలి దక్షిణమండలములను జయింప నంపెను; హంవీరుని దండయాత్ర జయప్రదముగ సాగినది. మల్లికార్జునరాయలుగాని యతని సామంతులుగాని యొడ్డెదండు నెదిర్చినట్లు కానరాదు. ఉదయగిరి, చంద్రగిరి, కంచిపట్టణము, వయిదులంపట్టి-ఉసావడి, తిరువారూరు, తిరుచ్చిరాపల్లి మున్నగు ముఖ్యదుర్గము లన్నియు నొడ్డెవారికి సులభముగ కైవశ మైనవి. కాని హంవీరుడు ద్రావిడచోళదేశములలో చిరకాల ముండలేదు. కారణ మేమో తెలియదుకాని యతడు దండుతో గూడ నెంత వేగముగ వచ్చెనో యంతటి వేగముతోడనే వెనుదిరిగిపోయెను. ఒడ్డెదండయాత్రవలన ద్రావిడచోళదేశములలో దాత్కాలికముగ క్షోభకలిగినది కాని రాయల యేలుబడికి మఱి యెట్టిభంగమును గలుగలేదు; కాని యీదండయాత్ర కేవలము నిష్ఫలము గాదు. ఉదయగిరిదుర్గమును, దాని క్రింది రాష్ట్రమును గజపతికి హస్తగత మాయెను.

మల్లికార్జునరాయలుగాని, యతని జంపి క్రీ. శ. ౧౪౬౫ సం న విజయనగరసింహాసనము నాక్రమించుకొన్న ఇమ్మడివిరూపాక్షరాయలుగాని యొడ్డెవారిని తఱిమివేసి నష్టమైపోయిన రాయరాష్ట్రమును మరల స్వాధీనపఱచుకొనుటకు బ్రయత్నపడిన ట్లగపడదు; దీనికి కారణము స్పష్టముగ దెలియదు. ఇమ్మడివిరూపాక్షరాయలు గపిలేశ్వరునితో సఖ్యము జేసికొని యతని సహాయము వలన రాయసింహాసనము నాక్రమించుకొనెనని యెంచుటకు గొంత యవకాశము గలదు. రాయల యీదాసీన్యమునకు గారణ మేదియైనను రాయసామంతు లొడ్డెవారి యాధిపత్యము నంగీకరింపలేదు. వీరియందు ముఖ్యుడు చంద్రగిరిప్రభువు సాళువనుండ నరసింహరాజు. ఒడ్డెవారిని పాఱదోలి రాయసామ్రాజ్యమును బునరుద్ధరింపవలయు నని యతడు పట్టుబట్టెను. నరసింహరాజు చంద్రవంశాంతర్ఖ్యాతిమైన సాళువకులసంభూతుడను తిప్పరియుడు; కుమారకంపణాదు మధుర సుల్తానులతో జరిగిన యుద్ధములం దతనికి జేదోడువాడొడై పనిజేసి, రాయసామ్రాజ్యమును దక్షిణమున రామసేతుపర్యంతము విస్తరింపజేసిన శూరశిఖామణులయం దొక్కడైన

* *Sources of Vijayanagara History*, **P.** 66; ARE. 1934-5, *Part II Para* 37; *Further Sources of Vijayanagara History*, *Vol II*, *Nos.* 71 *and* 69.

సాళువమంగి వంశజుడు; నరసింహరాజు తండ్రి యగు ముమ్మడిగుండరాజు కులక్రమాగతమైన రాష్ట్రమును చిత్తూరుమండలములోని చంద్రగిరిదుర్గము నిజరాజధానిగ శాసించుచుండెను; కాని యితడొనర్చిన ఘనకార్యము లెవ్వియు దెలియరావు. క్రీ. శ. ౧౪౫౬ వ సంవత్సరమునుండియు సాళువనరసింహరాజు రాజ్యము సేయుచుండినట్లు శాసనములవలన దెలియవచ్చుచుండుటచే, క్రీ. శ. ౧౪౬౩ వ సంవత్సరమున కుమారహంవీరమహాపాత్రుడు దక్షిణదిగ్విజయార్థము వచ్చి చంద్రగిరిదుర్గమును సాధించినప్పు డతడచట రాజ్యము సేయుచుండి యుండవలయును. ఒడ్డెవారిపై నతని కీసు గల్గుట కిదియె ప్రధానకారణమై యుండనోపును. కాని కపిలేశ్వరుని చరమదశవఱకు సాళువనరసింహరాజునకు ఒడ్డెవారిని దఱుమగొట్టి వారి యేలుబడిక్రింద నుండిన రాయసామ్రాజ్యభాగములను కైవసము గావించుకొనుట కవకాశము లభింపదాయె. కుమారహంవీరపాత్రుని త్రోసిపుచ్చి కపిలేశ్వరుడు మఱియొక పుత్రుడైన పురుషోత్తముని దన యనంతరము రాజ్యాధిపత్యమునకు నియమించి, క్రీ. శ. ౧౪౬౮ వ సంవత్సరమునుండి యతని సహాయునిగ జేసికొని రాజకార్యములను నిర్వహింపగడగుటవలన, గజపతిరాజ్యమున జాల యసంతృప్తి సంభవించినది. కృష్ణకు దక్షిణమందలి తీరాంధ్రమున గొంత సంక్షోభము గలిగెనని యెంచుట కాధారము గలదు. పైజెర్కొనిన యసంతృప్తిని, రాజ్యసంక్షోభను సందుచేసికొని సాళువనరసింహరాజు క్రీ. శ. ౧౪౬౯-౭౦ వ సంవత్సరమున నొడ్డెసామ్రాజ్యముపై దండువెట్టెను.

ఒడ్డెవారితో సాళువనరసింహరాజునకైన పోరాటమున రెండు ముఖ్యఘట్టములు గానవచ్చుచున్నవి. ఆద్యమున నతనికి సర్వత్ర విజయమే చేకూరినది. క్రీ.శ. ౧౪౬౯-౭౦ న దండు నతడు నడపుకొనివచ్చు మార్గమువరికట్టి పోటుచూపవచ్చి మాఱొడ్డిన యొడ్డెదళముల విభాళించి దిశాపట్టులగావించి యుదయగిరిదుర్గమునకు ముత్తికవేసి లగ్గలువట్టి సాధించెను. తరువాత క్రీ.శ. ౧౪౭౦-౭౧ ల మధ్య కృష్ణాప్రవంతివఱకు వ్యాప్తమైన తీరాంధ్రభూమిని జయించి కొండవీడుమొదలుగు ముఖ్యదుర్గములను స్వాధీనపఱచుకొనెను. ఇట్లు సాళువనరసింహరాజు ఒడ్డెవారు జయించి స్వాధీనముచేసికొనియుండిన రాయసామ్రాజ్యమండలములను మరల సాధించి వశపఱచుకొన్నను దృప్తుడు కాలేదు.

కపిలేశ్వరుని మరణానంతరము సింహాసనముకొఱకు అతని పుత్రులగు హంవీరపురుషోత్తములకు యుద్ధము సంప్రాప్తమైనది. హంవీరు డోడిపోయెను; కాని ప్రబలమైన రాజ్యకాంక్షచే ప్రేరితుడై ఎట్లైన తన దాయాదిని నిర్మూలము గావించి రాజ్యమును బొందవలయునని నిశ్చయించి హంవీరుడు బహమనీసుల్తాను ఇమ్మడిమహమ్మదుశాహు లష్కరీతో సఖ్యము కుదుర్చుకొని, యప్పుడు గజపతుల యేలుబడిక్రింద నుండిన తీరాంధ్ర మతని కర్పించి యతని సహాయమును బడసెను. స్వబలముచే గెలువజాలకపోయినను తురకలతోడుగొని హంవీరుడు పురుషోత్తము నోడించెను. ఒప్పందము చేరకు, ఇమ్మడిమహమ్మదుశాహు కతడు కృష్ణాగోదావరుల మధ్యనుండు తీరాంధ్రమును వశపఱచెను. మహమ్మదుశా హతనిని కటకము సింహాసనముపై ప్రతిష్ఠితుని గావించెను.

పురుషోత్తముడు బహమనీసుల్తానుచే బరాజితుడైనను హంవీరుని యాధిపత్యము నొప్పుకొనములేదు, రాజ్యముపై నాసను విడువనులేదు. కావున నోటమి గలిగి తన్మూలమున రాజ్యభ్రంశ మాపాదించినను పోట్లాటను మానుకొనలేదు. ఈ పోట్లాటవృత్తాంతము మనకు విస్తరముగ దెలియకపోయినను చిట్టచివరకు హంవీరు డోడి పురుషోత్తముని యాధిపత్యము నంగీకరించి యతనితో సంధి గావించుకొనెనని స్పష్టముగ దెలియవచ్చుచున్నది. రాజ్యమున నిట్లు పునః ప్రతిష్ఠితుడైనపిమ్మట పురుషోత్తమగజపతి తీరాంధ్రదేశమును మరల స్వాధీనము జేసికొనుటకు ప్రయత్నము సేయగడగెను.

క్రీ. శ. ౧౪౭౭ వ సంవత్సరమునకో యించుక పూర్వమో కృష్ణాగోదావరీమధ్యస్థతీరాంధ్రదేశమున నొక గొప్ప హావళి రేగినది. కొండపల్లిదుర్గాధ్యక్షుడు తనకు ఏలికయైన ఇమ్మడిమహమ్మదుశాహుపై దిరుగుబాటు చేసి పురుషోత్తమగజపతికి వర్తమాన మంపెను;

మఱియు సాళువనరసింహరాజుతో సఖ్యము కుదుర్చుకొని యతని సహాయమున దీరాంధ్రదేశమును బహమనీ సుల్తానులకడనుండి జయించుటకు దగు ప్రయత్నములు గావించెను. తూర్పున కళింగమునుండి సైన్యముతో గూడ పురుషోత్తమగజపతి తరలివచ్చి మహమ్మదుశాహుపక్షమున తీరాంధ్రమును పాలించుచుండిన నిజాము-ఉల్-ముల్కు బహరీ నోడించి తఱుమ గొట్టి రాజమహేంద్రవరమునకు ముట్టడివేసెను. నైరృత్యమునుండి కొండపల్లిదుర్గపాలకుడు సాళువనరసింహరాయలతో గూడ కూచిచేసిపోయి రాజమహేంద్రవరముచెంత గోదావరీపశ్చిమతటమున విడిసెను. రాజమహేంద్రవరదుర్గము పురుషోత్తమగజపతికి పట్టుబడినది.

తీరాంధ్రస్థితిగతు లిట్లుండ బీదరకు నిజామ్-ఉల్-ముల్కునకైన పరాజయవృత్తాంతమును, దన్మూలమున గలిగిన రాజ్యనష్టమును దెలియవచ్చినవి. ఇమ్మడి మహమ్మదుశాహు లష్కరీ తీరాంధ్రముపై దన యధికారమును మరల నెలకొల్పదలపెట్టి సైన్యములను గూర్చుకొని రాజమహేంద్రవరముపై నెత్తివచ్చెను. అతని రాకను గాంచి భయభ్రాంతచేతస్కులై పురుషోత్తమగజపతియు సాళువనరసింహరాజును పోటు జూపక నిజ రాజ్యములకు పాఱిపోయిరనియు నిమ్మడిముహమ్మదుశాహు తీరాంధ్రమును వశపఱచుకొనుచు మూడేండ్లకాలము రాజమహేంద్రవరమున నివసించియుండెననియు మహమ్మదీయచరిత్రకారుల వ్రాతలవలన దెలియుచున్నది.

రాజమహేంద్రవరజైత్రయాత్రవలనను సాళువనరసింహుని కడక నిరాటంకముగ సాగినది; గజపతుల యధీనమందుండిన ఉదయగిరి కొండవీడురాజ్యములు రెండును నతనికి హస్తగతములైనవి; రాయసామ్రాజ్యమున కీశాన్యదిగ్భాగమున మరల కృష్ణాప్రవంతి యెల్లయైనది; కాని యతని యధికారమచట స్థిరపడదాయె. రాజమహేంద్రవరజైత్రయాత్రవలన నతనికి బహమనీసుల్తానుతో వైర మేర్పడెను; కావున నతడు కృష్ణాగోదావరీమధ్యతీరదేశమును సంపూర్ణముగ వశపఱచుకొన్నపిమ్మట క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరమున గొండవీటిపై నెత్తివచ్చి దానిని స్వాధీనపఱచుకొనెను. ఏకారణమువల్లనో తెలియదు కాని సాళువనరసింహుడు కొండవీటిని సంరక్షించుటకెట్టి ప్రయత్నమును సేయలేదు; మఱియు దన రాష్ట్రమును బహమనీసుల్తానుబారి బడనీయక కాపాడుటకుగూడ నెట్టి యత్నమును గావింపలేదు. దీనికి కారణము నిశ్చయముగ దెలియదు; కాని యూహించుటకు దుస్సాధ్యము గాదు. సాళువనరసింహుని దృష్టి యన్యథా లగ్నమై యుండినది. రాయసామ్రాజ్యదుస్థితి యతనికి హృదయశల్యమై బాధింపగడగినది. సంగమవంశమును దుదముట్టించినగాని యది బాగుపడదని నిశ్చయించి తత్కార్యనిర్వహణ తత్పరుడై యుండెను. ఈకారణముననే మొయతడు గజపతులకడనుండి తాను జయించి స్వాధీనము జేసికొని యుండిన తీరాంధ్రభూమిని సంరక్షించుటకు దగిన యేర్పాటులను జేయజాలకపోయెను. అదిరెగు సాళువనరసింహునిపై గసితీర్చుకొనుట కనుకూలమైన సమయమని గ్రహించి, ఇమ్మడిమహమ్మదుశాహు సైన్యముతోగూడ కొండవీటినుండి బయలువెడలి యెక్కారొక ప్రయాణములమీద కంచికి బోయి యాపట్టణమును గొల్లకొట్టి లభ్యమైన ధనముతోగూడ మరలిపో నారంభించెను. ఈవర్తమానము సాళువనరసింహరాజునకు దెలియవచ్చినది; అతడు తన సేనాధిపతి యగు తుళువ ఈశ్వరనాయకుని సుల్తానుదుండగమునకు ప్రతీకారమొనర్చుటకు సైన్యముతోగూడ నంపెను. ఈశ్వర నాయకుడు నెల్లూరుమండలములోని కందుకూరికడ మహమ్మదుశాహుమార్గము నరికట్టి యుద్ధమున నతని సేనను ఖండతుండెములుగ నఱికి యతని యశ్వదళమును వశపఱచుకొని కాంచీపురమునుండి కొనిపోవుచుండిన కొల్లధనమునంతటిని హరించెను. ఇట్లీశ్వర నాయకుడు మహమ్మదుశాహు నోడించినను కొండవీటిని మరల జయించుటకు దలపెట్టలేదు; కావున నాదుర్గమును దానికి జెల్లుచుండిన రాష్ట్రమును సాళువనరసింహునికి మరల స్వాధీనపడలేదు. కాని యది బహమనీసుల్తానుయేలుబడిక్రిందను నటుపిమ్మట చిరకాల ముండలేదు.

ఇమ్మడిమహమ్మదుశాహు బహమనీ క్రీ. శ. ౧౫౧౮ వ సంవత్సరమున లోకాంతరగతు డాయెను.

అతనితరువాత బహమనీసింహాసనము నధిష్ఠించిన అతని పుత్రుడు ఇమ్మడి మహమ్మదుషాహు తరుణవయస్కుడు; శక్తిహీనుడు; కావున బహమనీసామంతులు సుల్తాను అధికారమును సరకుగొనక యెవరికివారే స్వతంత్రులై యథేచ్ఛ బ్రవర్తింప నారంభించిరి. రాజ్యమునందు పాలన పటుత్వము దగ్గినది. అంతఃకలహములు మెండైనవి. సమయ మట్లనుకూలము కాగా గజపతిపురుషోత్తముడు తీరాంధ్రముపై నెత్తివచ్చి క్రీ. శ. ౧౪౮౪-౫ సం. న కొండవీడు పర్యంతము గల రాష్ట్రమునంతటిని జయించెను; క్రీ. శ. ౧౪౮౯-౯౦ సంవత్సర మప్పటికి గుండ్లకమ్మవఱకును గల దేశ మతని యధికారముక్రిందికి వచ్చినది. గుండ్లకమ్మవఱకు వచ్చిన గజపతి యంతటితో తృప్తినంది వెనుదిరిగిపోలేదు. ఉదయగిరిదుర్గ మతని రాజ్యమునకు దక్షిణమున పొరుగులపువంటిది. అది యతని కధీనము గాకపోయిన నతని రాజ్యమునకు దగిన సంరక్షణ యుండదు; కావున దాని జయించి కైవసముచేసికొనుటకై దండువెడలెను; ఉదయగిరిపై గజపతి యెత్తి వచ్చుచున్నాడను వార్త తెలియవచ్చినంతటనే సాళువ నరసింహరాయలు తద్రక్షణార్థము స్వయముగ నచటికి వచ్చి కోటకొత్తళములను బలపఱచి యుద్ధకార్యములను జరుప నారంభించెను. పురుషోత్తముని సైన్యములు వచ్చి యుదయగిరిని ముట్టడించెను. ఎంతకాలము ముట్టడించెనో, యపుడు జరిగిన విశేషాంశము లెవ్వియో తెలియవు. కాని యుద్ధసరణి నరసింహరాయలకు బ్రతికూలముగా సాగెను. అత డోడిపోయి చెఱజిక్కె. పురుషోత్తమున కుదయగిరిదుర్గమును సమర్పించి విడు మరవంచె నని గజపతుల శాసనాదులవలన దెలియవచ్చుచున్నది. * సాళువనృసింహరాయలతరువాత కృష్ణదేవరాయలకు, క్రీ. శ. ౧౫౧౩-౧౪ వ సంవత్సరమున కైవస మగుకఱకును, ఉదయాద్రి గజపతుల యేలుబడి క్రింద నుండుటవలన పైవిషయము సత్యమని నిర్ధారిత మగుచున్నది. ఈ సమయముననే కాబోలు కొన్ని యుత్కలగ్రంథములయందు వర్ణింపబడినట్లు పురుషోత్తముడు కాంచీరాజపుత్రికను గొనిపోయి వివాహ మాడినది. †

ఇట్లు సాళువనరసింహరాయలు ప్రప్రథమమున గజపతుల యధీనమం దుండిన రాయరాష్ట్రమునంతటిని జయించినను రాజ్యాంతిమదశయందు దానిని సర్వమును గోలుపోయెను. కాని నరసింహుడు దానిపై నాసను వదలుకొనలేదు; ఎట్లైనను దానిని మరల సాధింపవలయు ననుకోరిక యతని హృదయమున స్థిరముగ బాదుకొనెను. మరణకాల మాసన్నమగుటచే గజపతితో బోరాడి మరల నారెండుదుర్గములను వాని క్రిందిరాష్ట్రమును స్వాధీనపఱచుకొనుట కవకాశము లభింపదాయె. కావున నతడు దన సంకల్పమును నెఱవేర్పవలసినదని దన యనంతరము వజ్రసింహాసనము నధిష్ఠించినవారి కాదేశించి ప్రాణము విడిచెను.

---

* ప్రతాపరుద్రగజపతి సరస్వతీవిలాసమునందు—

"శీవగ్రామమహీం ప్రగృహ్య సమరే
కర్ణాటభూమీధవం
దీనోక్తిప్రవణం నృసింహమనజా
ధీశం పున [ర్ముక్తవాన్]
[యో] హంవీరమహారిపుంసమతనో
త్పాదాబ్జపీఠావలిం
సోయం శ్రీపురుషోత్తమో గజపతి
ర్మద్వాగ్విలాసప్రదం."

అతనిదే అనంతవరతామ్రశాసనమునందు—

"యస్మై నిత్యతరప్రతాపదహన
జ్వాలాయమానధ్వజ
స్తమ్భాబద్ధకుమ్భరక్తవసన
ప్రేషావిభగ్నద్విషే
సన్నాయాభయయాచనాఞ్జలిమహో
దత్వోదయాద్రింభియా
దాత్మానం ముముచే నృసింహనృపతిః
కర్ణాటదేశాధిపః."

*(Further Sources of Vijayanagara History II 88-89)*

† ఇందుకు ప్రతిక్రియ సేయనెంచియె కృష్ణదేవరాయలు గజపతికుమార్తె నుద్వాహము చేసికొనవలయునని పట్టుబట్టినది.

సాళువనరసింహరాయల మరణశాసనమును కృష్ణదేవరాయలు రాజ్యాభిషిక్తుడగువఱకును అమలు లోనికి దెచ్చుట కెవ్వరును ప్రయత్నము చేసిన ట్లగపడదు. అతని పుత్రులకు ప్రాపుగ సామ్రాజ్యమును పాలించిన తుళువనరసానాయకునకుగాని, యతని మరణానంతరము రాయపద మాక్రమించుకొన్న వీరనరసింహరాయలుగాని గజపతుల ప్రస్తావమునకు బోలేదు. తుళువవంశజుల తామ్రశాసనములన్నింటను, శిలాశాసనములు కొన్నింటను నరసానాయకుడు గజపతి నోడించెనని చెప్పియున్నది. ఇతడు గజపతి నెప్పు డెచట నోడించెనో తెలియదు. నరసానాయకుడు గతించినతరువాత గూడ నుదయగిరి కొండవీడురాజ్యములు రెండును గజపతులకే చెల్లుచువచ్చినందున నతడారాజ్యములను జయించుటకైనను దండెత్తిపోయి గజపతి నోడించెననుట యుక్తము గాదు. ఓడించుటయే వాస్తవమై యుండిన నా రెండు రాజ్యములంతయు గాకపోయినను వానియందు కొంతయేనియు నతనికి స్వవశమైయుండ వలయునుగదా; కావున గజపతిపై నరసానాయకుని విజయ మతడు గజపతియధీనమందున్న రాష్ట్రమును జయింప దెత్తిపోయినపుడు చేకూడెనని తలచుట సరి కాదు. ఈ పట్టున స్మరింపదగిన చరిత్రాంశ మొక్కటి కలదు. క్రీ. శ. ౧౫౦౦ సంవత్సరమున ప్రతాపరుద్రగజపతి వ్రాయించియిచ్చిన యనంతవరతామ్రశాసనమునం దతడు దక్షిణదిగ్విజయార్థము సైన్యముతో గూడ వచ్చి కృష్ణానదీతీరమున విడిసి యుండెనని చెప్పియున్నది.* తరువాత నీజైత్రయాత్ర యెట్లు నడచెనో తెలియదు. గజపతిసామ్రాజ్యమునకు దక్షిణదిక్కున నుండినది రాయసామ్రాజ్యమే యగుటచేత ప్రతాపరుద్రగజపతి చేయదలపెట్టిన దక్షిణదిగ్జయయాత్ర విజయనగరసామ్రాజ్యమును జయించు నుద్దేశముతో వచ్చిన దండయాత్రయేయని నిశ్చయముగ జెప్పవచ్చును. ఈ దండయాత్ర రాయసామ్రాజ్యగడిప్రదేశములవఱకును నడచెనని చెప్పుటకు సంశయింప బనిలేదు. ఇట్లెత్తివచ్చిన ప్రతాపరుద్రగజపతి నెదిర్చి నరసానాయకుడు తఱిమి వేసి యుండవచ్చును. ఇందసంగత మేమియు లేదు. వీరనరసింహరాయలు రాజ్యమేలిన యాఱేండ్లును నతని ధిక్కరించిన రాయసామంతుల తోడను, వారికి సహాయులై వచ్చిన మహమ్మదీయుల తోడను పోరాటమున సరిపోయినది. అంతశ్ఛిద్రములలో నిమగ్నుడగుటవలన నతనికి గజపతివంటి ప్రబలునితో పోరు తెచ్చిపెట్టుకొనుటకు వలనుపడలేదు. కావున సాళువనరసింహరాయల కోరిక కృష్ణరాయలు సామ్రాజ్యాధిపత్యము వహించునప్పటివఱకును కొనసాగదాయెను. కృష్ణరాయలు శక్తిత్రయసంపన్నుడైన ప్రభువు. అఖండప్రతిభాశాలి; దండు నడుపుటయందు చతురుడు; శత్రునిషూదన మతని ప్రధానవినోదము. కావున సాళువనరసింహరాయల మరణశాసనమును జూడగనే యతని యాజ్ఞను పరిపాలించుట తన విధి యని తలచెను. ఏదులఖాను నోడించి రాయచూరు దుర్గమును స్వాధీనపఱచుకొనుటవలన సాళువనరసింహుని కోరిక కొంతవఱకు కొనసాగినది; గజపతి నోడించి ఉదయగిరి కొండవీడురాజ్యములను జయించిననది సంపూర్ణముగ నెఱవేఱగలదు; కావున కృష్ణదేవరాయలు గజపతిపై దెత్తిపోవుట తన కవశ్యకర్తవ్యమని నిశ్చయించి యుద్ధసన్నాహములు సేయ దొడగెను.

---

* "వేదండప్రజగండమండలగళ
ద్దానాంబుధాప్లుత
త్పాదన్యక్కృతశైన్యసైన్యనివహ
త్తూర్ణాశ్వమామండలాన్
యాత్రాం దక్షిణదిగ్జయాయ విదధ
త్సంప్రాప్య కృష్ణాతటీం
సోయం రుద్రనృప స్సమైచ్ఛదనఘో
దాతుం ద్విజేభ్యో మహీం."

—ఆంధ్రపత్రిక, దుందుభి (పదునాఱవ) సంవత్సరాది సంచిక, పుట ౧౩౬.

# వి కృ తి

శ్రీ కలపటపు రామగోపాలరావు
శ్రీ కామరవోలు సుబ్బారావు

★

విక్పతి జనించె కాలమున విశ్వముపై నొక పూవు రాలె, తా
రకలకు నెక్కి నొక్క మృతరాజ్యరమావిభవాత్మశాంతి, కా
నక చెలరేగు మానవవినాశకభక్తుల నాహరింపలో
నకనకలాడె నాకలి వినాయకమై యణుశక్తి ముంపగన్.

'అంధా, యిట్టటు లం'చు జీవితమహాంధాకాశమార్గాల రా
కేందుశ్రీలకు మబ్బుజుట్టి, ఘనతావేశాల నానాదివా
గాంధమ్ముల్ తలలెత్తు సంధినిగదా యావిర్భవంబైతి వీ
ఇందున్ పాంథుల యార్తితీరుగతి మా కింకేమి సూచించెదో!

ఆగమముల్ ఫలించిన మహాసుకృతాలయ మిట్టి భారత
క్ష్మాగతమైన, నెంతటి వికారపు భౌతికమేని సౌఖ్యల
క్ష్మీగరిమావిభావముననె జెందు, నదే క్రియ సౌఖ్యదాయివే
కాగల వీవు; స్వాగతము గైకొనుమమ్మ వినూతనాబ్దమా!

---

[కథానిక]

# ప్రభాతం

'నిరంజన్'

పెళ్లి సందడితో ఊరు మోగిపోతోంది. సుమ మొగుడు డాక్టరుపరీక్షకు చదువుతున్నాడనీ, అన్నివిధాలా ఈడూజోడైన సంబంధంఅనీ చెప్పుకుంటున్నారు. శ్రమప్రయాసలకు లెక్కచేయకుండా తండ్రి సర్వహంగులతోనూ వివాహతంతు వైభవంగా జరిపిస్తున్నాడు. బాజాభజంత్రీలతోనూ, పురోహితుల మంత్రాలతోనూ పెళ్లివారిల్లు కోలాహలంగా ఉంది. ఆ మేళాలూ, ఆ గాసులైట్లూ, ఆ సందడీ చూస్తూ పిల్లలు ఉత్సాహం పట్టలేకపోతున్నారు. కాని మధుకర్‌కుమాత్రం ఆ వినోదాలమీదికి మనసు పోవటంలేదు. సుమకు పెళ్లవటం బాల్యస్నేహితుడైన మధు కంత సంతోషించతగ్గ విషయంగా కనపడలేదు. పెళ్లయాక సుమ ఎక్కడికో ఇంకోవూరు వెళ్లిపోతుందని విన్నప్పటినుంచీ మధుమనస్సులో పెద్ద రాయి పడ్డట్టయింది.

సుమ వెళ్లిపోతే తను ఇక అధికారం ఎవరిమీద చలాయిస్తాడు! సుమను ఏడిపించినా, నవ్వించినా, ఆర్డర్లు వేసినా అది తన ఇష్టారాజ్యం. స్వార్జితమైన ఈ అధికారంఅంతా అన్యాయంగా చెయిజారిపోతుంటే మధుకు కష్టం వేసింది. కొద్ది దిగులుకూడా కలిగిందని చెప్పటం న్యాయం. మధుకు డాక్టర్లన్నా మొగుళ్లన్నా పట్టరాని అసహ్యం పుట్టుకొచ్చింది!

"సుమా, మన వూర్నించీ ఎక్కడికో వెళ్లిపోతావుటగా! నాకుమల్లే అక్కడ నీతో కబుర్లు చెప్పటానికి ఎవ రుంటారు?" అన్నాడు మధు, సుమ వెళ్లిపోయినా తనకుమాత్రం ఏమీ ఫరవాలేదన్నట్టు! సుమ గుడ్లనీళ్లు కుక్కుకుంటూ పలక్కుండా నుంచుంది. తన బెదిరింపు ఈవిధంగా పనిచేస్తుందని మధుకూడా అనుకోలేదు. నిర్ఘాంతపోతూ సుమకళ్లనీళ్ల వంక చూసి మధు మెల్లిగా అక్కణ్ణుంచీ తప్పుకున్నాడు.

పెళ్లయినతరవాత సుమ ఎప్పటిలాగా తమ ఇంటికి వస్తూ పోతూ తనతో మామూలుగా మాట్లాడుతూ ఉండటంతో మధుకు డాక్టర్లమీద కలిగిన అసహ్యం క్రమంగా మాసిపోయింది.

బాల్యంలో మనసులు ఎంత అమాయకంగా ఉంటాయ్! సెలవులకు ఇంటికి వెళ్తున్న మధుకర్ సుమ పెళ్లిముందు జరిగిన ఆ సంభాషణ జ్ఞాపకం తెచ్చుకొని చిరునవ్వు నవ్వుకున్నాడు. ఒంటెద్దుబండీ ఎత్తెత్తి కుదేస్తూ ఈడిగిలబడి సాగిపోతోంది. మధుమనస్సులో బాల్యస్మృతులన్నీ ఒకదానివెంట ఒకటి కమ్ముకొని వచ్చినై. ఊరివెలుపల మైదానంలో ఆడుకొన్న ఆటలూ, దేవుడిగుళ్లో పెద్దవాళ్లకు తెలియకుండా చేసుకున్న దొంగవిందులూ, ఇరవైనాలుగుగంటలూ ఖల్లుఖల్లున దగ్గుతూ ఈ వెధవలుమాత్రం కులాసాగా ఎందుకుండాలన్నట్టు అందినవాణ్ణల్లా చితకబాదే ఆ పేద బడిపంతులూ గుర్తుకు వచ్చారు.

చిన్నతనంలో మన స్వభావమూ ఏదో నిష్కారణమైన ఉల్లాసంతో పొంగిపోతూ ఉంటుంది; ఎటువంటి బాధలూ కష్టాలూ మనస్సు కప్పుడు గాఢంగా తాకవు. ఆ లేతవయసులో ఆ ఉత్సాహమే లేకపోతే పిల్లలీప్రపంచంలో బతికి బట్టగట్టడమే అసంభవమేమో అనిపించింది మధుకు. చిన్నతనంలో తను చేసిన అల్లరిచేష్టలకీ ఆకతాయితనానికీ నిజంగా మేర లేదు. తోటి ఈడుపిల్లలెవరన్నా సరే ఒంటికాలిమీద లేచేవాడు.

సుమమాత్రం, మొదట్నుంచీ మృదుస్వభావ

అవలంబేది, తను ఎన్ని తిప్పలు పెట్టినా, పాపం, సహించి ఊరుకొనేది. ఒకసారి ఎందుకో పోట్లాట వచ్చి తను తోసేసరికి సుమ కింద బడి మోకాలికి దెబ్బ తగిలింది. మర్నాడు వాళ్లమ్మ గాయం చూసి, ఎక్కడ పడ్డావు తల్లీ, ఇంత చేటుదెబ్బ తగిలించుకున్నా వని అడిగింది. దురదృష్టవశాత్తు అప్పుడు తనుకూడా అక్కడే ఉన్నాడు. సుమ ఏం చెబుతుందో, తన కేం ముంచుకు వస్తుందో అని గుండెలు దడదడ కొట్టుకుంటున్నయ్. సుమ తన భయం గ్రహించి, ఆడుకుంటుంటే పడ్డా నమ్మా అని అబద్ధం ఆడి ప్రాణాలు కుదుటబెట్టింది. మనసులో తన కప్పుడు సుమఅంటే కలిగిన కృతజ్ఞత, ఆదరనూ తల్చుకుంటే ఇప్పటికీ ఒక వింత అనుభవం గానే ఉంటుంది.

సుమలో చిన్నప్పటి ఆ మృదుత్వానికి ఇప్పుడో గాంభీర్యమూ దీర్ఘాలోచనా వచ్చి కలిసినై. ఈపరిణామం తన కళ్లముందు తాను చూస్తూఉండగా చిటికెలో జరిగినట్లుంది.

సుమమీద తన చిన్నతనంనాటి అధికారం తనకు తెలియకుండానే ఈ రెండుమూడేళ్లలో చెయి జారిపోయింది. పూర్వస్థితి వ్యత్యస్తమై ఇప్పుడు క్రమంగా సుమదే తనకన్నా పైచెయ్యి అవుతున్నట్టుగా కనపడుతోంది!

* * * *

"ఎప్పుడు వచ్చావు మధూ? రా, కూర్చో. కులాసాగా ఉంటున్నావా" అని సుమ సంతోషంతో చిరునవ్వుతూ పలకరించి ఉయ్యాలబల్లమీద కూర్చోమని తనుకూడా పక్కన కూర్చుంది. మధు కెందుకో ఈసారి సుమను చూడగానే కొత్తవేసింది. మధ్యమధ్య సెలవుల కింటికి వచ్చినప్పుడు సుమదగ్గరే తనకు కాలక్షేపం. ఇంట్లో ఒక్క క్షణమేనా ఉండవేమిరా అని తల్లి మొత్తుకొనేది. సుమతో కలిసి చిన్నతనపు ముచ్చట్లు జ్ఞాపకంచేసుకుంటూనో, వర్తమానంగురించీ భవిష్యత్తుగురించీ అర్థంలేని ఊహలు అల్లుతూనో గడిపే వాడు. కాని ఇప్పుడు తన ఎదుటికి వచ్చిన ఆ స్త్రీమూర్తిని చూడగానే, సుమ చిరపరిచితమైన బాల్యదో దాటి యవ్వనంలో అడుగుపెట్టిందన్న విషయం మనస్సుకు ఒక్కసారిగా కశాఘాతమై తాకింది. క్రొజ్జడ వేసుకొని పట్టుచీర కట్టి యౌవనపు పొంగుతో తెల్ల తామరలా మిసమిసలాడుతోంది సుమ! తళతళ మెరుస్తున్న ఆ కళ్లూ, వయసుతో సమ్మోహన మైన ఆ రూపమూ చూస్తుంటే, మధుహృదయం తటిత్తాడితసాగరంలా సంక్షుభితమై రక్తం హోరు మంటూ నిలువెల్లా ఒక్కసారి ఉరవడించింది.

"సాయంత్రంబండికి వచ్చా సుమా. అప్పుడే మీ ఇంటికి వద్దామనుకున్నాగాని నిద్రలు పోయి ఉంటారు లేపవలసివస్తుం దని రాలేదు. పట్నంనుంచి కిందటిసారి నువ్వు తెమ్మనమన్న గాజులు తీసుకొచ్చా. కాని ఈ ఆరునెలలలోనే ఇంత లావు అవుతావనుకోలేదు! అయినా చూడూ" అంటూ మధు పొట్లంలోంచి గాజులు తీసి ఇచ్చాడు. వాటిలోంచి ఒకటి తీసుకొని సుమ తొడుక్కోటానికి ప్రయత్నించింది. గాజు మధ్యలోనే చిట్లింది. ఎందుకు కష్టపడతావు, అనవసరంగా అని మధు అంటున్న మాటలు వినిపించుకోకుండా తెచ్చిన గాజుల్లో సగం చిట్లగొట్టి పోసులుపెట్టినతర్వాతగాని సుమ తన ప్రయత్నం విరమించలేదు. మణికట్టువరకు చెయ్యి గాట్లతో నిండి ఎర్రగా కందిపోయింది!

సుమ మళ్లీ సంభాషణ ఎత్తబోయింది; ఇంతలో దూరంగా గొడ్లపాకవైపునుంచి బాధతో సుక్కపట్టి ఏడుస్తున్న పసిపాపరోదనం ఆకస్మికంగా వినిపించింది.

"మధూ, ఎవరిదో పసిపిల్ల ఏడుపులాగా ఉంది. వినిపిస్తోందా నీకు? ఈవేళప్పుడు గొడ్లపాకలో చంటిపిల్ల లెవ రుంటారు? ఏమిటో చూసివద్దాం రా." అంటూ సుమ లేచింది.

పాకలో ఒకమూల దూలానికి మురికిబట్ట ఒకటి ఉయ్యాలగా కట్టిఉంది. సుమ మెల్లిగా మడతలు తొలగించి చూసింది. పసిపిల్లడి తల ఆముదంఓడుతూ, ముఖంఅంతా జిడ్డుతోను మట్టితోను అసహ్యంగా అట్టలుగట్టి ఉంది. చూస్తేనే డోకు వచ్చేంత రోతగా ఉన్నాడు.

"మా పనిమనిషి నరిసిపిల్లడు. పనికుంకను ఒక్కణ్ణే ఇక్కడ వదిలేసి ఎక్కడికో పనిమీద పోయినట్టుంది."

పాలేర్లందరూ అన్నాల కెళ్లకు వెళ్లారు. పాకలో ఎవ్వరూ లేరు. పిల్లడు కక్కటిల్లిపోతున్నాడు. కారణం ఏమిటో తెలియటం లేదు. కనుచూపుమేరలో పెద్దవాళ్లెవరూ లేకుండా చూసి సుమ గభాల్న పిల్లణ్ణి బుజాలమీదికి తీసుకుంది.

"మధూ, చూశావా పాపం. చీమలు ఎలా పుట్టలుపోసినయ్యో బట్టలో! ఎంత బాధ లేకపోతే అలా ఏడుస్తాడు పసివెంక!" అంటూ ఉద్వేగంతో పిల్లణ్ణి గుండెలకు హత్తుకున్నది. జాలితోను బాధతోను ముఖం కుంచితమైపోయింది. కొంతసేపు బుజాలమీద వేసికొని ఊపి సముదాయించి ఊరుకున్న తరవాత ఉయ్యాల దులిపి పడుకో బెట్టింది. రెండుమూడు ఊపులతో పిల్లడు నిద్రపోయినాడు. జుగుప్సాకరంగా ఉన్న ఆ దాసీశిశువుమీద సుమ కురిపించిన ప్రేమ పారవశ్యాన్ని చూసి మధు ఏదో చెప్పలేని ఆనందంతోనూ ఆవేదనతోనూ ఆపాదమస్తకం కంపించిపోయినాడు!

"పట్నంలో కేమీ లేమిటి మధూ! సాయంత్రం పూట రోజూ బీచికి షికారు వెళ్తూఉంటావా? ఒకసారి పట్నం తీసికెళ్లి సముద్రం చూపింతూ. సముద్రం ఎన్నిసార్లు చూసినా నాకు తనివితీరదు కళ్లు తిరిగేట్టు ఎటు చూసినా అంతు కనిపించని ఆ నీళ్లూ, నిలువునా లేచి ఎగిరిపడే ఆ తరంగాలూ, ఆ ప్రచండమైన ఘోష వింటుంటే ముందు ఏదో విపరీతమైన భయం వేస్తుంది! కాని తర్వాత తర్వాత ఆ భయంలోనే ఒక విచిత్రమైన ఆకర్షణ కనిపిస్తుంది. జీవితంలో మనం చెయ్యవలసింది ఏదో ఉందనీ, అది చెయ్యలేకపోతున్నామనీ, మన కప్పుడప్పుడూ కలుగుతూఉండే ప్రచండమైన ఆవేదన, అశాంతీ సముద్రాన్ని చూస్తుంటే మరింత భయంకరంగా మనస్సును ఆవహిస్తయ్. సముద్రంకూడా మనలాగే దేనికోసమో క్షోభపడుతూం దనిపిస్తుంది. వెర్రిగా చేతులు చాచుతూ ఆకాశాన్ని అందుకోవాలని సముద్రుడి నిరంతరప్రయత్నం. పైనుంచీ సముద్రుడి హృదయ సంక్షోభాన్ని కనిపెట్టి జాలితో వాలి లాలిస్తున్నట్టుగా ఉంటుంది, ఆ ప్రశాంతమైన ఆకాశం. మధూ, మన మామూలుజీవితంకన్నా ఉత్తమమైన జీవితం సాధించాలని మనం పడే తాపత్రయాన్నీ, ఆవేదనా ఆ ఆకాశంలాగే ఏదో అదృశ్యశక్తి పైనుంచి వీక్షిస్తూ మనలను కనిపెడుతూ ఉంటుందని గాఢనమ్మకం కలుగుతుంది నాకు ఆ ఆకాశసాగరాలను చూస్తున్నప్పుడు! దూరంగా, అతిసుదూరంగా, దిగంచలాలలో ఎక్కడో సముద్రం చివరికి ఆకాశాన్ని అందుకుంటుంది! ఆకాశం సముద్రుణ్ణి హత్తుకుంటుంది! జీవితసత్యమంతా ఆ ఆకాశ సాగరాల సంగమంలో ఉందనిపిస్తుంది! మధూ, నీకూ అటువంటిభావాలే కలుగుతయ్యా సముద్రాన్ని చూసినప్పుడు?" హృదయంలో సాగరసంక్షోభాన్ని ప్రత్యక్షంగా వింటున్న మధు "అవును, సుమా" అని హాషాదనుభూతిద్వారా సమాధాన మిచ్చాడు!

మధు కొంతసేపటికి తన దీర్ఘధ్యానంలోంచి బైటపడి, వెళ్లివస్తానని లేచాడు.

"మధూ, రేపు మా ఇంట్లో పూజ. పొద్దున్నే తోటలోకి వెళ్లి పూలు కోసుకురావాలి. నువ్వుకూడా వస్తావా? రాత్రికి నిన్ను భోజనానికి పిలుద్దామనుకున్నాను. పోనీ, ఇవ్వాళ వద్దులే; రేపు వస్తువుగాని. అంత మరీ వచ్చినమాన్నాడే ఇంట్లో తిననివ్వకుండా లాక్కొస్తే మీ అమ్మ బాధపడుతుంది."

"అలాగే రేపు వస్తాలే" అంటూ మధుకర్ వెళ్లిపోయినాడు. దూరమై పోతున్న అతని అస్పష్ట రూపంవంక చూస్తూ సుమ పరధ్యానంలో పడ్డది. ఆ రేగిపోయిన జుట్టూ, కాళ్ల కడ్డాలుపడుతున్న ఆ పైజమాలూ చూస్తే, మధు కింకా తన సంరక్షణ తాను చూసుకోటం చేతకాదనిపించింది. ప్రయోజకుడై ముసలితల్లి నెప్పుడు సుఖపెడతాడా అని దిగులు పడ్డది సుమ. మధు ఇంకా నీళ్లు పోసి అన్నంకలిపి పెట్టవలసిన స్థితిలోనే ఉన్నా డనిపించింది. సుమ హృదయం మధుమీద ప్రేమవాత్సల్యాలతో పొంగిపోయింది!

మధుతో సుమకు రోజులు క్షణాలుగా గడిచిపోతున్నయ్. కాని మధుహృదయంలో తీవ్రమైన అశాంతి ప్రవేశించింది. ఈత రాక మునిగిపోతున్న మనిషి కాళ్లూ చేతులూ కొట్టుకున్నకొద్దీ నీళ్లు తాగి మరింత ఉక్కిరిబిక్కిరైనట్టు, మధుకర్ ఆ అశాంతి నుంచి తప్పించుకోటానికి ప్రయత్నించినకొద్దీ వ్యథ మరింత తీవ్రం కాసాగింది.

* * * *

"పది పదిహేనురోజుల్లో రమ్మని రాశారు, మధూ! తిండీ తిప్పలూ సరిలేక పాపం ఎంత అవస్థ పడుతున్నారో. నిన్నీమధ్య చూసినప్పుడు చెప్పారా నీతో? వారికి ధనార్జనమీద మోజు లేదు. బీదసాదలకు ఉచితంగా వైద్యం చేస్తూ ఉన్నదానితోనే కాలక్షేపం చెయ్యాలని నిశ్చయించుకున్నారు. నీ కిది అభిమతమేనా అని అడిగారు నన్ను. జీవితంలో నే నింతకన్న కోరుకోగలిగిం దేముంది, మధూ? దరిద్రులకు దీనులకు ఆర్తితీర్చడంకన్న ఆనందం ఏమిటి? బీదసాదలు అగచాట్లు పడుతూ రంటే ఆశ్చర్యంలేదు. కాని అన్నీ ఉండీ రోజులు సుఖంగా గడపగలిగిన వారుకూడా జీవితాలు పాడుచేసుకుంటారే, వారి నేమనాలి మధూ? కొంచెం శాంతం, రవంత ప్రేమ అలవర్చుకుంటే జీవితం స్వర్గతుల్యం గా చేసుకో వచ్చునే! దరిద్రుల బాధలైతే తీర్చవచ్చునుగాని ఈ అంధులకు కళ్లువిప్పటం ఎలా?"

ఆవేశంతో సుమకళ్లు తళతళ మెరుస్తున్నయ్. మధు మంత్రముగ్ధుడై చూస్తున్నాడు. సుమ మాట లాపి వేయగానే హఠాత్తుగా మెలకువ వచ్చినట్లయింది మధుకు.

"సుమా, అప్పుడే వెళ్లిపోతావా? సెలవు లయినదాకా అయినా వుంటా వనుకున్నాను."

సుమ నవ్వింది. "నాతో కూడా మావూరికి రారాదూ మధూ! మావారిని చూసినట్టూ వుంటుంది; నన్ను దింపినవాడవ్వూ అవుతావు." మధు పలకలేదు.

"మధూ, మీఅమ్మ ఒక్కర్తే ఎన్నిరోజులని కొట్టుకుంటుంది? నీకోసం ఆడమనిషి అయినా రైతుల చుట్టూ తిరిగి శిస్తులు వసూలుచేసి డబ్బు పంపుతూండబట్టే పట్నంలో నీచదువు సాగుతోంది. జాగ్రత్తగా చదివి చప్పున ఒడ్డెక్కు. నీ వింత సంపాదించి తెస్తే ఈ వార్ధక్యంలోనైనా రోజులు హాయిగా గడపవచ్చు నని ఆమె గంపెడాశ పెట్టుకుంది.

ఏం మధూ, మాట్లాడకుండా అలా కూర్చున్నావేమీ? ఒంట్లో బాగా లేదా? ముఖం వాడి ఉంది."

అని సుమ మధుకర్ దగ్గరకు వచ్చి నుదుటిమీద చెయ్యి వేసింది. ఆ స్పర్శ మధుఅంతరాంతరాలలోకి వెళ్లి తాకింది. రక్తం అగ్నిజ్వాలలై నాలుకలు చాచుకుంటూ నరనరాలగుండా తీవ్రవేగంతో ప్రవహించింది.

"నడుము నెప్పిగా ఉంది. జ్వరం పెట్టుకు రాదు గదా?"

"కొంచెం తలనెప్పిగా ఉంది. పోయి పడుకుంటే అదే పోతుంది. వెళ్లొస్తా సుమా" అని నిట్టూర్చి బరువుగా అడుగులు వేసుకుంటూ కదలిపోయినాడు మధు.

* * * *

మధు క్రమంగా ఇల్లు కదలటం మానేశాడు. సుమ తను ఇంటికి వస్తే బెట ఏదో పనివున్నట్టు వెంటనే ఇంట్లోంచి వెళ్లిపోయేవాడు. మధు ప్రవర్తనలో ఈమార్పు సుమకు అర్థంకాలేదు. తనతో అంతవరకు అతిచనువుగా మాట్లాడుతూ పసిపిల్లడిలాగా వెంటనంటి తిరుగుతున్న మధు తనమీద ఒక్కసారిగా ఇంత ఉపేక్ష వహించడం సుమహృదయానికి తీవ్రమైన ఆఘాతం వలె అయింది. బాధతో సుమ లోలోపల కుమిలిపోతోంది. మధుమనస్సుకు ఎప్పుడైనా నొప్పి కలిగించానేమో నని మథనపడ్డది. కాని ఎంత తల బద్దలు కొట్టుకున్నా తాను చేసిన తప్పేమిటో తోచలేదు. చివరకు సూటిగా మధుకర్నే కారణం అడగాలని నిశ్చయించుకుంది. తడబడుతున్న హృదయంతో అడుగులో అడుగు వేసుకుంటూ సుమ ఒక సాయంత్రం మధుకర్ ఇంటికి వెళ్లింది. కనుచీకటి; గదిలో మంచం మీద కళ్లుమూసుకొని పడుకొని ఉన్న మధు ఆకారం అస్పష్టంగా కనిపిస్తోంది. చుట్టూ పుస్తకాలు పడిఉన్నయ్. వణుకుతున్న చేతులతో సుమ దీపం తీసుకొని గదిలో ప్రవేశించింది.

"మధూ!" వ్యథతో గద్గదమౌతున్న ఆ స్వరం మధు హృదయంలో తీవ్రశరంలా నాటుకున్నది. హీన స్వరంతో "సుమా, వచ్చావా" అని మధు తలయెత్తి చూశాడు.

"ఆఁ, వచ్చాను. నాతో మాట్లాడటం ఎందుకు మానేశావో కారణం చెబుతావేమో తెలుసుకోవాలని వచ్చాను." కళ్లలో చిందుతున్న అశ్రుబిందువులూ, ఆ ప్రశ్నలోని వింత కర్కశత్వమూ కలిసి మధు హృదయాన్ని మరింత కలతపెట్టినయ్.

"సుమా, కారణం ఏమీ లేదు. పరీక్షలకు ఇప్పట్నించే గట్టిగా చదవాలని చదువుతున్నా. తీరిక లేక మీ ఇంటికి రావటం లేదుగాని అంతకన్నా ఏమీ లేదు".

"మధూ, నువ్వు చెబుతున్నది నే నమ్మను.

నా మాటల్లోనో ప్రవర్తనలోనో నీ మనస్సుకేదో కష్టం కలిగించి ఉంటాను. ఎప్పుడైనా అటువంటి పొరపాటు నావల్ల జరిగిఉంటే మన్నించు. కాని నాతో మాట్లాడటం మాత్రం మానివెయ్యకు మధూ!" అని పొంగివస్తున్న దుఃఖాన్ని అణుచుకొని సుమ ప్రాధేయపడ్డది.

"సుమా, నాకీ అగ్నిపరీక్ష పెడతా వెందుకు? నన్ను చేటాకి హింసించటం ఆనందమా నీకు?" అని మధు, మనస్సులో దీనంగా మొర పెట్టుకున్నాడు. కాని ఆ మొర సుమ ఆలకించలేకపోయింది!

"మధూ, నేనెన్ని తప్పులు చేసినా మన్నిస్తానని చేతిలో చెయ్యి వెయ్యి." అంటూ సుమ చెయ్యి చాపింది. మధు యంత్రప్రతిమలా చెయ్యితీసి చేతిలో వేశాడు.

"రేపు ప్రొద్దున్నే నా ప్రయాణం. ఇవ్వాళ మనం రాజీపడిన దానికి గుర్తుగా రాత్రి మాఇంట్లో భోజనం చెయ్యాలి. అక్కడే పడుకుందువుగాని, కబుర్లు చెప్పుకుంటూ ఈ నాలుగుగంటలూ గడుపుదాం. తెల్లవారితే నేనెలాగూ వెళ్ళిపోతాను."

భోజనాలయినాక సుమ ఇద్దరికీ డాబామీద పక్కలు వేసింది. సుమ భర్తకు తాను చేయబోతున్న ప్రేమపూరితమైన సేవనుగురించీ, భర్తతో కలిసి జగత్తులో తాను సాధించబోతున్న దిగ్విజయాలగురించీ తాను కంటున్న మధురస్వప్నాలన్నీ ఒకదానివెంట ఒకటి ఏకతీరుగా ఏకరువు పెట్టుకుపోతోంది. మధుకర్ మధ్యమధ్య ఊకొడుతూ తన ఆలోచనల్లో తాను నిమగ్నుడైనాడు. సుమ మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్రపోయింది. ఆ నిశ్శబ్దనిశీథంలో ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు ప్రశాంతంగా వినపడుతున్నయ్. మధుకర్‌కు ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. లేచి పక్కమీద కూర్చుని, సుమవేపు తదేకంగా చూడసాగాడు.

ఊరంతా నిశ్శబ్దంలో మునిగుంది. పండువెన్నెల విరియగాస్తోంది. సుమముఖంమీద వ్రేలుతున్న ముంగురులను ఒకసారి రేపుతూ మరొకసారి సవరిస్తూ చల్లనిగాలి మెల్లిగా ఆడుతోంది. వలయాలు తీరిన ఆమె ఉన్నతవక్షం ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో లయ కలుపుతూ మృదువుగా లేచి పడుతోంది. ఇంతకాలమూ పోరాడి అణచిపెట్టిన వాంఛలన్నీ ఒక్కసారిగా కట్లు తెంచుకొని విజృంభించినై. మధుకర్ హృదయంలో ఝంఝామారుతం రేగింది. కళ్ళలో చీకట్లు చుట్టలు చుట్టుకున్నయ్. చెవులు హోరుమంటున్నయ్. లేచి పిల్లిలాగా అడుగులు వేసుకుంటూ సుమను సమీపించి ముఖంలోకి వంగి చూశాడు.

సౌఖ్యమేతప్ప కష్ట మెరుగని ఆ చిరునవ్వూ, ఆ అమాయకశిశువదనమూ మధుకర్ని హఠాత్తుగా ఆకట్టినయ్. పదునైన కత్తిని గుండెల్లో అమాంతం దిగబొడిచినట్టయింది. బాధతో రెండుచేతులా గుండెలు బిగియబట్టుకొని మధుకర్ వెనుదిరిగి బైటికి వెళ్ళిపోయినాడు.

* * *

"అనంతమైన దుఃఖమే జీవితసర్వస్వం. నిజమైన సౌఖ్యమూ ఆనందమూ ప్రపంచంలో లేవు. ఒకవేళ ఉన్నట్టు కనపడ్డా అవి క్షణికం. భయంకరమైన కాళరాత్రిలో తళుకుమని మెరిసిపోయే మెరుపులవంటివి సుఖసౌఖ్యాలు. జీవితంలోని అంధకారపు లోతులను తడివి చూసుకోటానికి మాత్రమే అవి ఉపకరిస్తవి. సుమా, రంగురంగుల దారాలతో నీ అల్లుకున్న మాయాజాలం ఒక్క సాక్షాత్కారంతో సాలీడు గూడులా విరిసిపోయింది. కష్టపడి కట్టుకున్న ఆకాశసౌధాలన్నీ ఒక్క గాలితెర వీచుగానే కుప్పకూలిపోయినై. సౌఖ్యమూ ప్రేమా అన్న పదాలు ఎంత మిథ్యావచనాలో, వాటిలో ఎంత ప్రతారణ దాగి ఉందో నీ కిప్పటికైనా బోధపడిందా? యథార్థం కళ్ళఎదుట కనిపిస్తుంటే ఊరికే ఆత్మవంచన చేసుకొని ప్రయోజనం ఏమిటి? నీ పరాజయాన్ని అంగీకరించు. ఆ అంగీకరించటంలోనే ఒక శాంతి ఉంది."

"నేను ఒప్పుకోను; ఒప్పుకోను; ముమ్మాటికీ ఒప్పుకోను" అంటూ సుమ ఆత్మ తనలో ధ్వనిస్తున్న ఆ నిరాశాస్వరంమీద ఆక్రోశంతో తిరగబడ్డది.

కాని అంతలోనే అలసట కమ్మి, కొనఊపిరి విడుస్తున్న ప్రాణిలా విలవిలలాడి మళ్లీ నిర్వేదంలో మునిగిపోయింది. భర్తతో కలిసి దీనుల దుఃఖాశ్రువులు తుడుస్తూ వారి జీవితాలను సుఖమయం చేయాలని కలలుగన్న ఆమె జీవితమే భర్తృవియోగంతో కన్నీళ్ళ గలిసింది. తన దాంపత్యజీవితం మూణ్ణాళ్ళముచ్చటగా కళ్ళఎదుట తేలిపోయింది. భర్తతో గడిపిన రెండేళ్ళూ రెండుక్షణాలుగా సుమకు తోచినై. భర్త ఉజ్జ్వలమైన ఆశయాలలో, అతని అనురాగంలో స్వర్గమర్త్యా

లకు తాను సేతువు నిర్మించుకుంది. అతని సమక్షంలో తనకు చెప్పలేని ఆనందమూ, శాంతీ. అతని కళ్లూ, మాటలూ, చేతలూ తన్నుకనకట్టి, ఎప్పుడూ చూచే ఈ మామూలు ప్రపంచాన్నే ఏదో అద్భుతమైన మాధుర్యంతో నింపివేసేవి.

"సుమా, నిన్నుగాక మరెవర్నైనా పెళ్లిచేసుకొనుంటే నా జీవితం ఎలా ఉండేదా అని ఊహించుకున్నప్పుడల్లా నాగుండెలు భయంతో జలదరించిపోతయ్. సుమా, నా జీవితంలో ఉన్న ప్రచండమైన అశాంతికీ, అసంతృప్తికీ, నీవే తోడులేకపోతే నే నేమయేవాణ్ణో!" అంటూ ఒకసారి అతను చీకట్లో జడుసుకున్న పసిపిల్లడిలాగ వణికిపోతూ తన గుండెల్లో తల దాచుకున్నాడు. తన హృదయం అప్పుడు ఎంత గర్వంతో, ఎంత పరమానందంతో ఉప్పొంగిపోయింది. అటువంటి తమ దాంపత్యజీవితానికి అంతలోనే అశ్వాసాంతం ఆవిధంగా వస్తుందని సుమ ఊహించలేకపోయింది.

ఒకరోజున హఠాత్తుగా ఊరంతా స్ఫోటకం వ్యాపించింది. పేదవారి పేటలు మృత్యుదేవత ప్రళయతాండవానికి ప్రధానరంగాలైనయ్. పోసినవాళ్లకే మళ్లీమళ్లీ పోతపోస్తోంది. ఇంటికి నలుగురూ అయిదుగురూ మంచాలు పడుతున్నారు. కొందరికి అట్ట పోత పోసి చూడడానికి భయంకరంగా ఉంది. పోసినవాళ్లలో బతికినవాళ్లు బహుకొద్దిమంది. డాక్టర్లు మొదటి వారంరోజులూ పేటల్లోకి వెళ్లారుగాని, తర్వాత ధైర్యం చాలక ఈ రోగానికి మందు లేదంటూ వెళ్లడం మానేశారు. పేదవారి గుడిసెల్లో వాహకులు లేక శవాలు మురిగి కంపుకొడుతున్నయ్.

సుమభర్త రాత్రింబగళ్లు మురికిగూడాలలో తిరుగుతూ వ్యాధిగ్రస్తులకు ఉపశమనంకోసం తోచిన చికిత్సలు చేస్తున్నాడు. సుమ దడదడ కొట్టుకుంటున్న గుండెలతో, భర్త అన్నానికి ఎప్పుడు వస్తాడా, హృదయశాంతి మళ్లీ ఎప్పుడు చేకూరుతుందా అని అతని రాకకోసం ఎదురుచూస్తూ, బైటికి వెళ్ళగానే యథాప్రకారం దిగులారంభమై కంటికి కునుకు లేకుండా అహోరాత్రాలు గడుపుతోంది. మరణశిక్ష కోసం నిరీక్షిస్తున్న నేరస్థుని కళ్లలోవలె సుమకళ్లలో ఒక వింతవెలుగు వెలుగుతోంది. ఒకపూట సుమభర్త వళ్లగింజ పేలపుగింజగా జ్వరంకాస్తూ ఇంటికి వచ్చాడు. వళ్లపోత పోసింది. మూడురోజుల్లో అశ్వాసం సమాప్తమైంది.

సుమ ఆశయాలూ ఆశలూ భర్తచితిలో బుగ్గైనై. బుద్బుదాలలాగా ఆమె స్వప్నా― జీవితంలో క్షణకాలం మెరిసి చిట్లిపోయినై. గంపెడు చీకటి నెత్తిన వేసుకొని సుమ పుట్టింటికి తిరిగి వచ్చింది.

సుమకు జీవించాలన్న వాంఛ క్రమంగా అడుగంటింది. నిరంతరమైన దుఃఖంతో కుంగి కృశించి మంచాని కంటుకుపోయింది. మనస్సు మొద్దుబడి బహిః ప్రపంచపు సుఖదుఃఖాలు అంటటం మానివేసినై. మూగబాధతో మృత్యువుకోసం నిరీక్షిస్తూ సుమ రోజులు గడుపుతోంది.

ఒకనాడు పట్నంనుంచి వార్త వచ్చింది. మధుకర్ ఏదో దిగులుపడుతున్నవాడిలా పొద్దస్తమానం గదిలోనే విచారంగా కూర్చుంటున్నాడనీ, ఆరోగ్యం చెడి తిన్నగా కాలేజీకి వెళ్లటం లేదనీ విన్నప్పుడు, సుమకు మళ్లీ భర్తపోయిన తర్వాత మొదటిసారిగా బాధ తెలిసింది. ఆమె హృదయంలో రాజుకున్న అగ్నిని ఒక్కసారిగా ఎగసన దోసినట్లయింది. మధుకర్‌కు తల్లి ఎంత డబ్బు పంపుతున్నా చాలటం లేదు. ఆమె పడుతున్న అవస్థలు చూడలేక సుమ ఒకటిరెండుసార్లు తల్లి పేరిట మధుకర్‌కు మనిఆర్డర్లు పంపింది.

మధుకర్ సెలవులకు గాని ఇంటికి వచ్చాడు. తిన్నగా సుమను చూడటానికి బయలుదేరాడు. గుండెల బరువుతో అడుగుతీసి అడుగు వేసేటప్పటికే చాలి వస్తోంది. అల్లాగే కాళ్ళీడ్చుకుంటూ, అనుగామనగా సాగి వెళ్లాడు. శీర్ణశీర్ణమైపోయిన ఆ శరీరం, ముఖంలో ప్రతి రేఖలోనూ వ్యక్తం అవుతున్న ఆ మూగబాధ చూడగానే మధుకు కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగినై. సుమ వంక చూడలేక అప్రయత్నంగా తల తిప్పుకున్నాడు. చెప్పలేని మనోవ్యథతో, తడబడుతూ మళ్లీ మౌనంగా ప్రక్కను కూర్చున్నాడు. మధుకర్ దీన ముఖమూ, కళ్లలోని ఆ తప్తాశ్రువులనూ సుమ చూసింది. రెండుచేతులూ చాపి మధుముఖాన్ని గుండెల మీదికి తీసుకొని జాలిగా నిమురుతూ "ఏడవకు, మధూ, ఏడవకు. మళ్లీ ఇక ఎప్పటికీ నన్ను విడిచిపెట్టి పోవుగద" అన్నది. ఇరువురి హృదయాలూ క్షణకాలం ఒక అనిర్వచనీయమైన మహాశాంతిలో లీనమైపోయినై! వర్షాధౌతప్రభాతంలా అశ్రుసిక్తమైన అతని ప్రసన్నదృష్టిలో సుమ కథియం గోచరించింది.

# కాలగంపే

## భూమివయస్సు

పురుషుడిని అతనిజీతము, స్త్రీని ఆమెయొక్క వయస్సు అడిగితే చాలామంది మర్యాదలోప మని భావిస్తారు. కాని ఏమియూ సంకోచములేకుండా భూమివయస్సునుగురించి చర్చింపవచ్చు. అది భూదేవి కేమియూ అపచారము కాదు. అది నిర్ణయించుట అంత సులువయిన పనికూడా కాదు. భూమివయస్సుగురించి వేదాంతులు, శాస్త్రపరిశోధకులు ముఖ్యముగా భూగర్భ, ప్రకృతి, వైశ్లేషిక రసాయన శాస్త్రజ్ఞులు విశేషముగా పరిశోధనచేసిరి. మనము పుట్టుటకు పూర్వము యీజగత్తు ఎంతకాలమునుంచి వున్నది, యీ భూమి ఎంతకాలమునుంచి ప్రస్తుతవైఖరీలో వున్నది అనేప్రశ్నలు ఆలోచించినకొలదీ ఆలోచన పెరుగు చునే యుండును. దీనికి కారణమయిన ఆదిశక్తియొక్క మహత్తు అద్భుతముగా కనిపించును.

పూర్వము, పశ్చిమదేశములో బైబిల్ (*Bible*) ప్రమాణగ్రంథముగా తీసికొన్నతరువాత, క్రైస్తవ వేదాంతులు భూమియొక్కవయస్సు నిర్ణయించుటకు ఒక పద్ధతి నవలంబించిరి. చరిత్రలో తెలిసిన మొట్ట మొదటి సంవత్సరము తీసికొని, అప్పటివరకు వారి ఆదిపురుషుడైన ఆడెమ్ (*adam*) నుంచి పరంపరగా వచ్చిన తమ మతగురువుల వయస్సు కూడుకొనుచు వచ్చి, మొత్తమును భూమివయస్సుగా తీసికొనేవారు. ఇట్లు చేయగా ౬,౦౦౦ సంవత్సరములు తేలెను. భూగర్భ శాస్త్రజ్ఞులు ఇది బహుస్వల్పమని ఆక్షేపించిరి. అంత మోసెస్ (**Moses**) గురువు కాలమున దినప్రమాణము హెచ్చుగా నుండియుండవచ్చునను యుక్తితో క్రైస్తవవేదాంతులు భూమి ౫౫,౦౦౦ సంవత్సరముల క్రితము పుట్టెననిరి. యీ వయస్సు కూడ చాలా తక్కువగనే కనిపించెను. భూగర్భశాస్త్రజ్ఞులు భూమియొక్క పుట్టుకను గురించి మనకు విశేషము లేమియు తెలియవనియు, అందుచే భూవయస్సునిర్ణయము కష్టతరమనియు చాలాకాలమువరకు అభిప్రాయపడుచుండిరి. సాధా రణముగా యీదురుగాలి, వాన, తుపాను వచ్చినపుడు గాలిఅంతయూ దుమ్ముమయమగుట మీరు గమనించియే వుందురు. యిసుకరేణువులు ఒకచోటనుంచి మరియొక చోట పడును. బాగుగా వానకురిసినపుడు మన చుట్టు ప్రక్కనున్న రోడ్లు, గుట్టలు, కొండలు కడిగివేసినట్లు కనిపించుటకూడా బహుసామాన్యము. పెద్ద గాలివాన వచ్చినపుడు చిన్నచిన్న రాళ్లు గుట్టపైనుంచి మొదటికి చేరుకొనును. అనేకపర్యాయములు గాలి, వానలవలన కొండలు, గుట్టలు క్రమముగా చిన్నవి యగుచుండును. యీ కారణముచేతనే మరల యీ ఇసుకరేణువులు ఒకచోట కూర్చబడి మరల గుట్టగా తయారగును. కొండలు యీవిధముగా తరుగుకుపోవు టకు ఎరోషన్ (*Erosion*) అనియు, అవి పెరుగు టకు డిపోసిషన్ (*Deposition*) అనియు చెప్ప బడును. సముద్రపు ఒడ్డున, నదిఒడ్డున ***Erosion*** ప్రత్యక్షముగా కనిపించును. నాటికెరటములు ఒడ్డును తరిగివేయును. [illegible] సంవత్సరమున కెంటులో (*Kent*) సుద్దకొండలు సంవత్సరమునకు రెండున్న అడు గులు తరుగుకు పోయినదీ గమనించి, భూమియొక్క వయస్సు ౩౦ కోట్ల సంవత్సరములు ఉండవచ్చునని ఒక భూగర్భశాస్త్రజ్ఞుడు సూచించెను.

అసలు మనభూమి సూర్యగోళములో ఒక భాగ మనియు, కాలక్రమానుగతముగులవలన రవిదగ్గరనుంచి వేరైనదనియు కొంతమంది అభిప్రాయము. అదిని,

భూమికూడా సూర్యునివలెనే అగ్నిమయమై యుండెను; క్రమముగా ఉపరిభాగము చల్లారపోగెను. అందుచేతనే, భూమిలోపలికి వెళ్లినకొలదీ శీతోష్ణ పరిమాణము (అంటే వేడి) హెచ్చును. పైభాగము చల్లపడుటకు ఎన్ని సంవత్సరములు పట్టునని లెక్క చూచి, లార్డుకెల్విన్ (*Lord Kelvin*) గారు భూమి సుమారు ౧౦ కోట్ల సంవత్సరములలో ప్రస్తుత అవస్థకు వచ్చియుండును అని నమ్మిరి. తరువాత వారు యీ కాలము ౯ కోట్లు, లేక ౫ కోట్లు సంవత్సరములు పట్టునని అనుకొనిరి. క్లెరెంన్స్ కింగుపండితుడు కూడా భూమియొక్క శీతోష్ణపరిమాణలెక్కల ననుసరించి భూమివయస్సు ౩ కోట్ల ౪౦ లక్షల సంవత్సరము లుండవచ్చుననిరి. సర్ చార్లస్ డార్విన్ అనువారు మరియొక తీరున ఊహించిరి. భూమియు, చంద్రుడును మొదట కలిసి ఒక గోళముగా వున్నవనెడి సిద్ధాంతము నాధారముగా తీసికొని, అవి విడిపోయి అగుమము ౫ కోట్ల ౬౦ లక్షల సంవత్సరము లయివుండు ననిరి.

భూగర్భశాస్త్రజ్ఞులకు యీ స్వల్పకాలములో భూమియందు జరిగిన మార్పులు జరుగుట అసంభవముగా తోచెను.

నదులు మట్టి తీసికొనిపోయి సముద్రములో పడవేయుట మీకందరికి తెలిసిన విషయమే. ఒకబిందెతో నదినీళ్లు తీసికొని ఒక ఇందుపకాయ అరగదీసి దానిలో కలిపినయెడల మట్టి అంతయు క్రిందికి చేరును. ఎంత మట్టి వున్నదీ తేలును. నదిప్రవాహముకూడా మనకు తెలియును. దీనినిబట్టి ఎంత మట్టి ఎంతకాలములో ఒక నది సముద్రములో వేయునదీ, సముద్రములో మట్టి దిబ్బలు ఎంతకాలములో ఏర్పడినవీ లెక్కపెట్టవచ్చును. సముద్రములోనికి నదులు ఎప్పుడు ప్రవహించుచునే యుండును కనుక యీ పద్ధతిలో సముద్రపు దిబ్బలు, వాటిపై జంతుజాలము మొదట ఏర్పడిన కాలముకూడ కనుగొనుటకు ఆధారము కలదని అనుకొనిరి. కాని యీ పద్ధతిలో చాలా చిక్కులు కలవు. ప్రతినదుల లోను నీరు ఎల్లకాలములయందును ఒకవేవడిలో ప్రవహింపదు. అది కాక యీ ఇసుకదిబ్బలయొక్క వైశాల్యము కూడ మనకు తెలియదు. కనుక సమమంయిన లెక్కరాదు.

గత ౬౦ సంవత్సరములలోపున ౧౪ గురు భూగర్భశాస్త్రజ్ఞులు యీ పద్ధతిమీద ౬ మొదలుకొని ౨౦ కోట్ల సంవత్సరములనుంచి మనకు తెలిసిన జీవరాసులు సముద్రములో బ్రతుకుట మొదలిడెనని అనుకొనిరి. ఈ అంచనాలలో ఇంత వ్యత్యాసము వుండుటకు కారణము లెక్కకు కావలసిన సరియైన విషయములు లేక పోవుటయే.

జాలి (*Joly*) ఇంకొక పద్ధతితో కూడ భూమి వయస్సు నిర్ణయింపబూనిరి. నదినీటిలో ఎంత ఉప్పు వున్నదీ, సముద్రపునీటిలో ఎంత ఉప్పు వున్నదీ మనము అంచనా వేయవచ్చును. కాని ప్రతిసంవత్సరము సముద్రపు నీటిలో ఉప్పుభాగము హెచ్చుచున్న పరిమితి మాత్రము తెలియదు. అది ఒకేరీతిని మారుచున్నదని యూహించి భూమియొక్క వయస్సు ౯ కోట్ల సంవత్సరములని వాదించిరి.

నాల్గవ పద్ధతి కొలదికాలము క్రిందట కనిపెట్టిన రేడియో యాక్టివిటీ (*Radio activity*) అను విషయము ననుసరించియున్నది. రేడియో యాక్టివిటీ అనగా నేమిటి? మన ప్రపంచములో ౯౨ రకముల మూలపదార్థములు కలవు. వీటినే ఎలిమెంట్సు (*Elements*) అందురు. ఇవి ఎట్టిపదార్థములన, ఒక్కొక్క పదార్థమునందు ఒకటే పదార్థ ముండును కాని, భిన్నపదార్థముల యొక్క సంపుటి కాదు. ఇవి బంగారము, రాగి, వెండి, రేడియము మొదలయినవి. యీ మూలపదార్థముల పరమాణువులను (*atoms*) చాలాకాలము విభజించుటకు వీలులేదని అందరు అనుకొనిరి. అటుతరువాత జరిగిన పరిశోధనలవలన, పరమాణువులుకూడా విభజింపవచ్చునని తేలినది. పరమాణువులయొక్క నిర్మాణము సూర్యకుటుంబము (*Solar system*) తో పోల్చవచ్చును. సూర్యకుటుంబములో సూర్యునివలె, పరమాణువు మధ్య ధనవిద్యుత్తు (*positive electricity*) తో కూడిన ప్రోటాన్సు (*Protons*) అనునవి యుండును. వీనిచుట్టు ఋణవిద్యుత్తు (*negative electricity*) తో కూడిన

ఎలక్ట్రాన్లు (*Electrons*) అనునవి వెలుతురు వేగముతో తిరుగుచుండును. యీ తిరుగుట సూర్యుని చుట్టూ ఇతరగ్రహములు తిరిగినట్లే యుండును. ఒక్కొక్క పరమాణువునందు కొన్ని ప్రోటాన్లు, కొన్ని ఎలక్ట్రాన్లు వుండును. పరమాణువు ఇట్లు నిర్మింపబడివుండుటచేత దానిని విభజించుట కష్టతరమైనపని అయ్యెను. యీ సందర్భములో ఇంకొక విషయము చెప్పతగును. ప్రోటాన్లయొక్క, ఎలక్ట్రాన్లయొక్క సంఖ్యయే వేరువేరు పదార్థములకు కారణము. యీ ప్రోటాన్లయొక్క సమూహము కొంతవరకే నిల్చియుండును. ఆ సంఖ్యకు దాటిన, అవి వాటితోపాటు ఎలక్ట్రాన్లు పరమాణువునుంచి తగ్గిపోవును. యురేనియమనే మూలపదార్థమునందు ౨౩౮ ఎలక్ట్రాన్లు కలవు; ఇవి క్రమముగా ౨౦౬ ప్రోటాన్లవరకు తగ్గినచో అప్పుడా పదార్థము సత్తు (*Lead*) క్రింద మారిపోవును. ఇట్లు తగ్గినపుడు మూడురకముల కిరణములు ఉద్భవించును. అందులో ఒకరకమును అల్ఫారేస్ అందురు. వీటిని పరిశోధించి చూడగా హీలియమ్ అనే పరమాణువుగా తేలెను. ఒక్కొక్క హీలియమ్ పరమాణువునకు ౪ ప్రోటాన్లు వుండును. యీ ప్రోటాన్లు యురేనియమునుంచి జనించు పని, కాలము ఒకటేతీరున వుండును. దీనినే రేడియో యాక్టివిటీ అందురు. యురేనియము వుండు ప్రదేశములలో సత్తుకూడా వుండును. యీ సత్తు యురేనియమునుంచి వచ్చినదనియే నిర్ధారణచేసిరి. యీ సత్తు ఆ యురేనియమునుంచి వచ్చుటకు ఎన్ని సంవత్సరములు పట్టినదీ లెక్కవేయవచ్చును. ఇట్లు లెక్కచేసి ప్రకృతిశాస్త్రజ్ఞులు యురేనియముతో కలిసివుండిన పర్వతశిలలవయస్సు ౪౦ మొదలు ౫౦ కోట్ల సంవత్సరములవరకు కలదని అంచనావేసిరి. యీ కొండలలో బహుపురాతనకొండ డెకోటా (*Dakota*) అను ప్రదేశమున నున్న బ్లేక్ హిల్స్ (*Black Hills*) అనునది ౧౫౦ కోట్ల సంవత్సరముల క్రితము ఏర్పడినట్లు శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. దీనినిబట్టి భూమి అంతకుముందు ఏర్పడినట్లు స్పష్టమగుచున్నది. ఇటువంటి విషయములను గమనించి ప్రస్తుతము మనము చూచెడిభూమి ౩౩౫ కోట్ల సంవత్సరముల క్రితము ఏర్పడినట్లు నమ్మకము క్రమముగా కలుగుచున్నది.

పూర్వము హిందువుల లెక్కలప్రకారము భూమివయస్సు రమారమి ౨౦౦ కోట్ల సంవత్సరములుండవచ్చునని సూచించిరి. యీ అంచనా సుమారు ప్రస్తుత శాస్త్రపద్ధతుల నవలంబించివచ్చిన సంఖ్య అంత వుండుట హిందూపద్ధతుల సామర్థ్యము తెలియచేయును.

—కొల్లూరి వెంకటేశ్వరరావు.

# విమర్శనము

## ప్రేమైకజీవులు

కథల సంపుటి. కథకుడు: ఇందుకూరి సత్య నారాయణరాజుగారు. ప్రకాశకులు: జయానికేతనం, మద్రాసు ౭. వెల ౧ రూ.

ఇందలి ఆరుకథలలోని ప్రముఖపాత్రలను ప్రేమైకజీవనులే యనుటవల్ల ఈ గ్రంథశీర్షిక సార్థక మైనది. ప్రేమప్రభావము తెలుపుటయే ఈ కథకుని ముఖ్యోద్దేశ్య మని ఇందలి కథలు చాటుచున్నవి. రచన ఆరితేరిన దనుట కాక్షేపణ లేదు. ఉబుసుపోకకే కాక పాఠకుల జిజ్ఞాసను రేకెత్తించుటకుకూడ చాలినవై యున్న వీ కథలు.

---

## పాటలమంజరి

రచయిత: ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. ప్రకాశకులు: యఱ్ఱమిల్లి శ్రీరామశాస్త్రిగారు, మండపేట, తూర్పుగోదావరిజిల్లా. వెల ౬ అ.

చిన్నచిన్నవే అయినా ఇందలి ౨౩ పాట లన్నీ గుణమున గొప్పవయియున్నవి. సంగీతమూ, సాహిత్యమూకూడా వీనిలో సమపాళంగా మిళితమై, ఇవి పాఠకుల సహృదయత లూగించునవై యున్నవి.

---

## హిందీ - తెలుగుస్వబోధిని

రచయిత: పాగా వెంకోబరావుగారు. ప్రకాశకులు: నవభారత్ పబ్లిషర్స్ లిమిటెడ్, కర్నూలు. వెల ౬ అ.

ఇది హిందీ కొత్తగా నేర్చుకొనువారికి చాల ఉపయోగకరముగా రచింపబడినది. కొత్తవారికి కొత్తలో ఏయేవిషయములు ముఖ్యములో అవి యన్నియు ఇందులో సరిగా పాటింపబడినవి.

---

# గ్రంథస్వీకారము

## అగ్నిధార

ఖండకావ్యసంపుటి. రచయిత: 'దాశరథి'. ప్రకాశకులు: సాహితీమేఖల, చండూరు, నల్లగొండ, హైదరాబాదు. వెల రూపాయిన్నర.

## వీరసేనుడు (ఒథెల్లో)

షేక్సుపియరు నాటకమునకు స్వతంత్రానువాదము. రచయిత: చావలి లక్ష్మీనారాయణగారు, బి. ఏ., బి. ఇడి., పొన్నూరు, గుంటూరుజిల్లా. వెల రూ. ౧-౮-౦.

## వెన్నెల

ఖండకావ్యసంపుటి. రచయిత: కూలెంపాటి మధుసూదనరావుగారు, బి. ఏ., నిమ్మగడ్డ, చల్లపల్లి పోస్టు, కృష్ణాజిల్లా. వెల రూ. ౧-౮-౦.

## రామచంద్రప్రభుశతకము

రచయిత: పోలూరి రామకృష్ణయ్యగారు. ప్రకాశకులు: సాధనగ్రంథమండలి, తెనాలి.

## గీతాసందేశము

మూలము: శ్రీ అరవిందులు, అనువాదకులు: పి. బాలసుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారు. ప్రకాశకులు: శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి. వెల ౧ రూ.

## సంస్కృతం

ద్వితీయశతకం. కృతికర్త: పండిత కర్ణవీర నాగేశ్వరరావుగారు, చీరాల.

## *Common Script for India*

రచయిత: బుద్ధిరాజా రాజభూషణరావుగారు, బి. ఏ., బియల్., ప్రాప్తిస్థానము: సాహిత్యమండలి, ఏలూరు. వెల. ౩ అ.

## మల్లెమాల

ఖండకావ్యసంపుటి. రచయిత: అవ్వారి నారాయణగారు, బుక్కరాయసముద్రము, అనంతపురముజిల్లా.

---

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras, Editor: S. Sambhu Prasad